

ఈ యంత్రాన్ని 'మనోలా' అంటారు. ఈ అమ్మాయిని మీరేమంటారు?

# అతిథులు వచ్చే సమయము — కాని సరళకు తలనొప్పిగా ఉంది!










సారిడన్ త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా పనిచేస్తుంది. తలనొప్పి, పంటినొప్పి, ఒంటినొప్పి, జ్వర చిహ్నములు మరియు జలుబులు. నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సారిడన్ వేసుకోండి.

ఎల్లప్పుడూ సారిడన్‌ను మీ యింట్లో ఉంచుకోండి. పెద్దవారికి ఒక బిళ్ళ పూర్తియైన మోతాదు; పిల్లలకు ¼ నుండి ½ బిళ్ళవరకు చాలును.

ఒకే ఒక

# సారిడన్ 'రోష్'

నొప్పిని పోగొట్టును, సేదదేర్చును, నవోత్సాహమును కలిగించును




ఒకే సారిడన్ బిళ్ల చాలును

ఒక బిళ్ల ఖరీదు 13 నయా పైసలు

'రోష్' తయారు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

## ముఖచిత్రం

మా అభిమాన నటి "షీలా" ముఖచిత్రము, అత్యంత ఆకర్షణీయముగా ఎంతో వినోదాన్ని కల్గించింది !

శ్రీ జన్నుమహంతి వేణుగోపాలరావు,
శ్రీ నున్నా నాగేశ్వరరావు (అన్నవరం)

## లండన్

17—4—64 వ ఆంధ్ర పత్రిక "వీక్లీ"లోని "మహానగరం లండన్" గురించి చదువుతున్నంత సేపూ లండన్‌లో ఉన్నట్లే ఉంది విదేశాలు చూడక పోయినా చూచి వచ్చినవారి ద్వారా 'పత్రిక' ద్వారా పాఠకులకు వివరిస్తున్నందుకు రచయిత రామారావు గార్కి కృతజ్ఞత! అదే పత్రికలోని "ఓ తెలుగు సినిమా కథ" ప్రత్యేకత

వీలారి వీరరాఘవరావ్ (అరసాడ)

## కథలు

ఈ వారం వెలువడిన "విహారి శాలివాహన"ల "నీలి నీడలు" రెండు సార్లు చదివాను. చాలా బాగుంది ప్రతివారము ఇటువంటి పెద్ద కథ ఒకటి వేయకోరు చున్నాను.

యం గోపాల్‌రెడ్డి (తొండవాడ)

* * *

మీరు ప్రచురించిన నీలినీడలు కథ చాలా బాగుంది విహారి, శాలివాహనగార్లు క్రాంతి కుమార్, రఘుల మనస్తత్వాలను చాల చక్కగా చిత్రించారు ఆఖరికి రఘు ఉత్తరం ద్వారా రెండు కన్నీటి బిందువులు రాల్పించారు

వాసుదేవమూర్తి (విజయనగరం)

* * *

"నీలి నీడలు" కథ చదివాను. కథా గమనం, పాత్ర పోషణ, పాత్రల చిత్రీకరణ బాగానే ఉన్నాయి క్రాంతి కుమార్ పాత్రను రచయితలు ఉదాత్తంగా ఉత్కృష్టంగా సృష్టించారు కాని చివరిలో మశూచికంతో రూపు మారిపోయి అందవిహీనంగా తయారయి నర్సుగా చేరిన శారదను డాక్టర్ క్రాంతికుమార్ పెళ్లి చేసుకోమని కోరడం, ఆమె తిరస్కరించడం, అసహజంగాను, పాత్ర ఉత్కృష్టతను కించ పరచినట్లుగాను అనిపించింది కథ ముగింపు అసంతృప్తిగా ఉన్నా చదువుతున్నంత సేపు బాగానే అనిపించింది

డి చెన్నకిషన్ (కాకినాడ)

* * *

10—4—64వ తేదీ సంచికలో మీరు ప్రచురించిన "నీలినీడలు" కథ చాలా బాగుంది 'సంఘటనలు, సన్నివేశాలు, సంభాషణలు తగుస్థాయిలో ఉన్నాయి. రచయితకు నా ధన్య వాదాలు.

పి రాజారాం (శ్రీకాకుళం)

* * *

10—4—64 సంచికలో విహారి శాలివాహన గార్లు రచించిన "నీలినీడలు" కథ చదివాను కథ చాల వరకు సరి క్రొత్త నడకలో సాగినది. రచయిత

# ఉత్తరాలు

గార్లు (ప్రస్తుత) ప్రజలలోని భావాలను చాల వరకు స్పష్టంగా తెలియ జేశారు కథ చదువుతున్నంతసేపు నా ఆనందానికి అంతులేదు

సి. రాధాకృష్ణయ్య (చిత్తూరు)

* * *

యద్దనపూడి సులోచనారాణిగారి 'ఐలవ్‌యూ' కథ చాలా బాగుంది కాని చివరన 'హెస్టన్'ని చంపి వేయడము, సుజాతకు పిచ్చి ఎక్కించడం పిచ్చిగా ఉంది కథలో ఏదో కల్పించటం కోసం అతికినట్లుగా ఉందేకాని సహజంగా లేదు మిగతా కథ అంతా కొత్త పద్ధతిలో చక్కగా ఉన్నది

సూర్యకుమారి (సికింద్రాబాదు)

* * *

సులోచనారాణి గారు వ్రాసిన "ఐ లవ్‌యూ" కథ చాలా బాగుంది ఎటొచ్చి ఇంగ్లీషు మాటలు వాడడం వల్ల తక్కువ మంది ఆడవాళ్ళు మాత్రమే అర్థం చేసుకోగలరని నా ఉద్దేశం. ముఖ్యంగా రావ్ "స్లీవ్" ఎత్తి టైము చూసుకున్నాడని వ్రాసేరు. దయయుంచి ఇలాంటి మాటలు ఉపయోగించ వద్దని కోర్తాను తర్వాత హెస్టన్, బేగంపేట విమానాశ్రయంలో రావ్‌ని కౌగలించు కొన్నాడని వ్రాసేరు ఇది చాలా అసందర్భం నేను స్వయంగా అమెరికా దేశస్థులతో (ఇక్కడ) పని చేసేను కాబట్టి వాళ్ళ నడవడిక, ఆచారాలు బాగా నాకు తెలుసు మగవాళ్ళు మగవాళ్ళతో చేతులు కలుపుకొని నడవడానికి కూడా అమెరికా దేశస్థులు అసహ్యించుకొంటారు అలాంటిది, బేగంపేట విమానాశ్రయంలో, హెస్టన్ రావ్‌ని కౌగలించు కొంటాడా ! ! !

ఎం ఎస్ మూర్తి (బెరైలీ)

* * *

10—4—64 తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రిక యందు ప్రచురిత మయిన "మలుపులో పిలుపు" అనే కథ చాల బాగుంది ఇంత మంచి కథ వ్రాసిన రామలక్ష్మిగార్కి, ప్రచురించిన మీకు నా అభివందనలు, ఇలాంటి కథలు ఇంకా ఎక్కువగా వేయవలెనని నా కోర్కె !

గుండుమళ్ల వెంకట రామారావు (శ్రీకాకుళం)

## సీరియల్ కథలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటిత మగుచున్న సీరియల్స్ "ఎండమావులు" "సంపెంగ పొదలు" చాలా బాగున్నవి సంపెంగ పొదలు కథ వాస్తవానికి చాలా దగ్గరగ యుంది. గిరిద్వారా చెప్పబడిన రచయిత మనోభావాలు శంకర్ లాంటి వ్యక్తులు అర్థం జేసుకోవచ్చు.

జె జగదీష్ (చత్రపురం)

* * *

10—4—64 తేదీ వారపత్రికలో హరి కిషన్ గారి 'ఎండ మావులు' శీర్షికలో (సీరియల్) స్వాతి, కృష్ణమూర్తుల (దంపతుల) సంభాషణలలో సెకండరీ గ్రేడు ప్యాసయిన స్వాతి చేత చాలా దారుణంగా మాట్లాడించారు. ఉదా : స్వాతి వేడి అన్నము పెట్టి భర్తకు 'ఇనరమంటారా ?' అంటే కృష్ణమూర్తి 'పిండా ? పప్పా ?' అని హేళన చేస్తాడు. తరువాత ఆ సమయములోనే అన్నపు గిన్నె అవతల ఉంచి, ఆ చేత్తోనే పెరుగుగిన్నె ఇవతల పెట్టింది. అల్లాగే జుట్టు ముడివేసుకొని "పప్పు కావాలా" అని ఇంత పప్పు చేత్తో తీసి విస్తట్లో వేసి 'అబ్బో చెయ్యి చుర్రుకున్నది' అని కాలిన వేళ్ళు నోట్లో పెట్టుకొని, విదిలించి 'అరే మరిచి పోయాను.' ఇంత అపరిశుభ్రంగా, అసభ్యంగా చదువుకొన్న ఏ జాతి పిల్ల అయినా మాటాడుతుందా ? రచయిత గారు ఈ రూపేణా హరిజనులను కించ పరచవద్దని మనవి.

కామేశానందం (కోడూరు)

## రామచరితమానస్

38వ పేజీలో 2వ 'కాలమ్' లోని 32వ లైను నందు "ఎవరికి ఇంద్రజిత్తు, కుంభకర్ణుల వంటి మహావీరులు సోదరులుగా నున్నారో" అంటూ రావణుడు తన గొప్పను చాటు కుంటాడు అంగదునితో. 41వ పేజీలో 3వ కాలమ్ లోని 1, 5వ లైనులలో తండ్రిని సమీపించి మేఘనాదుడిట్లు ధైర్యము పలికెను "ఓ తండ్రీ మాటలతో గాక రేపు చేతలతో సమరాంగణమున నా శక్తి సామర్థ్యములు ప్రదర్శించి నీ మన్ననల నందుకొన గలవాడను" "పుత్రుని వీరోచిత ప్రజ్ఞకు సంతోషించెను" అంటూ వ్రాశారు

నాకు గుర్తున్నంత వరకు ఇంద్రజిత్తు లేక మేఘనాదుడు రావణునికి కుమారుడు పై విధముగా ఒక చోట తమ్మునిగాను, మరో చోట కుమారునిగాను చిత్రించటం ఏమీ బాగా లేదు. ఈ తప్పు తులసీదాసుదైన ఉండటానికి వీలులేదు. తెనిగించిన 'ముంగరశంకర రాజు' గారిదైనా ప్రచురించిన మీదైనా అయి ఉండాలి

కనుక పై రెండింటిలో అతను (ఇంద్రజిత్తు) ఎవరయినది తెలియబరుస్తారని ఆశిస్తాను

మూర్తి (బొంబాయి)

* * *

10—4—64 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన రామాయణ కథలో సుషేనుడు రామునితో "సంజీవి కొండను దెచ్చిన యెడల సోదరుడు సజీవుడగునని" యన్నట్లు వ్రాయబడింది ఏ రామాయణములో కూడా ఇలా ఉన్నట్లు లేదు సంజీవి పర్వత మందు గల ఔషధుల మూలికలను దెచ్చిన యెడల సోదరుడు సజీవుడగునని యున్నట్లు రామాయణములో నున్నది రాముడు మూర్ఛాగతుడైన తమ్ముని జూచి విలపించుచు "అమ్మకు నీవు ఏకైక పుత్రునివి" అని వ్రాయబడినది. సుమిత్రకు లక్ష్మణుడు, శత్రుఘ్నుడు ఇరువురు కుమారులు గాని ఏక సంతానము గాదు.

బి. రామలక్ష్మి (విశాఖపట్నం)

* * *

"సంజీవి కొండను దెచ్చిన యెడల సోదరుడు సజీవుడగు"నని సుశేణుడు చెప్పగ ఆంజనేయుడు ఔషధులను వెతక సాగెను" అని ఉంది. 10—4—64 పత్రిక కొండనే తెమ్మన్నపుడు ఔషదులను వెతకవలసిన పనేమొచ్చింది ?

పోశిన సత్యనారాయణరావు (దొంతమూరు) ★

# సేవింగ్స్ బ్యాంక్ ఖాతా మొదలుపెట్టండి




## నేషనల్ అండ్ గ్రిండ్లేస్

నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్‌లో సేవింగ్స్ బ్యాంక్ ఖాతా ప్రారంభించడం అతి తేలిక. ఇందుకు అయిదే అయిదు రూపాయలు చాలు. దీనికి సాలీనా నూటికి 3 రూపాయలు వడ్డీ లభిస్తుంది.

నేడే మీకు సమీపంలోగల స్థానిక బ్రాంచికి వెళ్ళి పూర్తి వివరాలు తెలుసుకోండి. మీ బ్యాంకింగ్ సమస్యలు ఏలాంటివి అయినా సమర్థవంతంగా, సాదరంగా మీ సమస్యలు పరిష్కరించేవారు మీకు స్వాగతమిస్తారు.



## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

(యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది • మెంబర్ల బాధ్యత పరిమితం)

**బ్రాంచీలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్డు; 378 నేతాజీ సుభాస్ చంద్రబోస్ రోడ్డు, (రాయెడ్ప్ బ్రాంచి); 6, అర్మీనియన్ స్ట్రీట్; 158, మౌంట్ రోడ్డు, హైదరాబాద్: అబిద్ రోడ్.**

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 1—5—'64
క్రోధినామ సం॥ నిజ చైత్ర బహుళ చతుర్థి
సంపుటము: 56 సంచిక: 35
స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 న.పై.
సంవత్సర చందా 15.60 న.పై.
6 మాసాల చందా 7.80 న.పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1




"బూబుమ్మగారవ్వొచ్చు! లేదా ఏదేనా దొంగ బంగారం వ్యాపారికూడా కావచ్చును బదర్!"

## మనలో మాట

'ఎండమావులు' 'సంపెంగపొదలు' రెండూ యీ వారంతో ఐపోయాయి! వచ్చేవారం మేము లోగడ నిర్వహించిన నవలల పోటీలో తృతీయ బహుమతిపొందిన "కూలిన గోడలు" నవలను ప్రారంభిస్తున్నాము.

ఈ వారం వేసిన 'ప్రస్థానం' బాగా పెద్ద కథే అయి నప్పటికీ మరి రెండు కథలను యిదే సంచికలో వేయగలిగాము.

ఈ వారం వనితాలోకం పేజీలలో వంటలు, వనితావాణి రెండూ లేవు, కాని కాగితంతో పూలు తయారుచేయడం మీద ఒక సచిత్రవ్యాసం వేశాము. మేమిదివరకే పేర్కొన్నట్లు త్వరలో మా పఠితలకు కొన్ని ప్రత్యేక వ్యాసాలను 'సచిత్రంగా' అందించనున్నాము.

'63వ సంవత్సరపు మా బాలెట్‌లో పాఠకుల ఆదరాభిమానాలను చూరగొని గెలుపొందిన ప్రముఖ నటుడు శ్రీ ఎన్. టి. రామారావును వచ్చేవారం పాఠకులు సచిత్ర శీర్షికలో చూస్తారు. ఆపై సంచికలో శ్రీ రామారావు వ్రాయనున్న వ్యాసాల గురించి కూడా అదే సంచికలో మరి కొన్ని వివరాలు తెలుసుకుంటారు.

ఈ వారం స్కాండినేవియా దేశాలమీద వేసిన సచిత్ర వ్యాసం; స్వీడన్, డెన్మార్క్, నార్వే, దేశాల మూడింటిగురించి క్లుప్తంగానైనా, కుతూహల జనకంగా తెలుపుతున్నదని భావిస్తున్నాము. రచయిత శ్రీ ఎన్. చెంగల్రాజుగారు ఎం. టెక్. పట్టభద్రులు. ప్రస్తుతం పశ్చిమ జర్మనీలో కెమికల్ ఇంజనీరుగా ఉంటున్నారు. ఈ ఫొటోలు తీసినవారు శ్రీ పీలాండ్ వోల్ఫ్. రానున్న సంచికలో ఆస్ట్రేలియన్ ఆదిమవాసుల (ఎబొరిజిన్స్) గురించి ఒక వ్యాసం 'సచిత్రంగా' పాఠకులకు అందించనున్నాము.

'రామేశ్వరం' గురించి వద్ద వ్యాసం పట్ల పాఠకులు చూపిన ఆసక్తిని పురస్కరించుకుని కాశీపట్నం మీద కూడా త్వరలో సచిత్ర వ్యాస మొకటి వేద్దామనుకుంటున్నాము.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి వాసంతి.


మళ్లీ అబ్దుల్లా పతనానికి ఏంకారణం కాగలదు?
తన అహంకారం
అబ్దుల్లా


మేంకేరళలాగ గెలవమని ఎవరంటున్నారు!
నంబూద్రిపాద్


ద్వంద్వ వ్యక్తిత్వాలు
పి.యస్.పి లో కూడా చీలికలా?


సంగీత దర్శకుడు
చైనా
పాకిస్తాన్
ఇండోనేషియా
ఇండియా వ్యతిరేక ఉద్యమం

# కాశ్మీరు సమస్యపై లోక్ సభలో శ్రీ నెహ్రూ

ఇటీవల అనారోగ్యంనుంచి కోలుకున్న తరువాత ప్రధాని శ్రీ నెహ్రూ లోక్ సభలో ప్రసంగించినది పోయిన వారంలోనే. ఆ ప్రసంగంకూడా లిఖిత పూర్వకమైనదే. శ్రీ నెహ్రూ ప్రసంగపు ధోరణి మామూలుగానే ఉంది. అయినా ఒకటి రెండు లోపాలూ లేక పోలేదు. అంతకు పూర్వం ఉండే ఉన్నతి స్థాయి, ఈ సారి కనుపించలేదు. ఉపన్యాసంలోని సారాంశం కూడా అంత గొప్పగా లేదేమోనని కూడా అనిపించింది.

ఉదాహరణకు ఒకసంగతి చెప్పుకొందాం; పాశ్చాత్యుల ప్రమేయం లేకుండా వున్నట్లయితే కాశ్మీరు సమస్య ఏనాడో పరిష్కారం అయి వుండేదని శ్రీ నెహ్రూ అన్నారు. ఊరకనే, ఆమాట అన్నారుగాని, పాశ్చాత్యుల ప్రమేయం ఏమిటో, వాళ్లసలు రంగంలోకి ఎలావచ్చారో శ్రీ నెహ్రూ చెప్పలేదు.

నిజం చెప్పాలంటే పాశ్చాత్యులను రంగంలోకి తీసుకొచ్చింది నెహ్రూగారే కదా! కాబట్టి ఆయన అమలు పరచిన 'రాజనీతి' విఫలమయి పోయిందని స్పష్టమవుతున్నది.

నెహ్రూ తటస్థవిధానానికి, పాశ్చాత్యుల వైఖరికి ఎలాంటి సంబంధం ఉన్నదో పరిశీలిద్దాం. పాశ్చాత్యులు ఇండియా, మధ్య ఉన్న ఈ సన్నిహిత సంబంధానికి కారణం నెహ్రూ తటస్థ విధానం మాత్రం కాదు. అయినా పాశ్చాత్య దేశాల పట్ల ఆయన చూపుతున్న అభిమానమే అందుకుకారణం. ఈ సంగతిని ఉదహరించటానికి 'సూయజ్' సమస్య చాలు. శ్రీ ఈడెన్ విధానాన్ని సమర్థించాలని వ్రాయటం లేదు, నెహ్రూ తత్వాన్ని విపులీకరించాలనే వ్రాస్తున్నాను. మొదటినుంచీ నెహ్రూలో ఉన్న ఆ విచిత్ర స్వభావమే ఇండియా, గ్రేట్ బ్రిటన్‌ల మధ్య బేధాభిప్రాయాలకు దారి తీసింది. కామన్వెల్తు సభ్యదేశాన్నొక దానిమీద 'సూయజ్' విషయంలో దురాక్రమణ చేసినట్లు ఆరోపణలను, అధిక్షేపణలను చేసింది పండిట్ నెహ్రూగారే. ప్రపంచ దేశాలన్నింటి ప్రతినిధిగా మాట్లాడే అధికారం నెహ్రూగారికెవరిచ్చారు?

పైగా ఆయన తనకు తెలిసిన వేవో ఉపన్యాసాలిచ్చినా తీరా సమయం వచ్చేసరికి తన ఆప్తమిత్రుడైన 'నాజర్'ను రక్షించుకోటానికి ఆయనకు ఏమాత్రం సైనికబలం వుంది?

చివరకు, దురాక్రమణ జరగక పోవటం నెహ్రూ ప్రతిభవల్లకాదు బోలెడంత సైన్యాన్ని కలిగిన రష్యా జోక్యం వల్ల!

కాశ్మీరు సమస్యకొద్దాం. పాశ్చాత్య దేశాలు జోక్యం కల్పించుకున్నాయన్నమాట వాస్తవం. దానికి కారణం లేకపోలేదు. కాశ్మీరు ప్రజలు తమ రాష్ట్ర భవిష్యత్తును స్వయంగా నిశ్చయం చేసికోవచ్చునని శ్రీ నెహ్రూ ఆ రోజుల్లో ఒక ప్రకటన చేశారు. పాశ్చాత్యదేశాల వాదం కూడా ఈ ప్రకటనకు అతీతంగా లేదు.

నెహ్రూగారి అప్తుడు, పాత స్నేహితుడు షేక్అబ్దుల్లా ఉండనే ఉన్నాడు. మున్ముందు కాశ్మీరు చరిత్రను ఎవరైనా సక్రమంగా వ్రాస్తే సంవత్సరాల క్రితం షేక్ అబ్దుల్లా కూడా దాదాపు నెహ్రూ ఈనాడు సృష్టించిన నటువంటి పరిస్థితినే సృష్టించారని చెప్పక తప్పదు. పండిట్ నెహ్రూ ఆహ్వానాన్ని పురస్కరించుకొని ఒకప్పుడు షేక్ అబ్దుల్లా ఢిల్లీ వచ్చి నెహ్రూజీతో ఉండి ఒక ఒప్పందం కుదుర్చుకొని వెళ్ళారు. ఆ బృందం కాశ్మీరును ఇండియాలో కలపటానికి బదులు, రెండింటి మధ్య పెద్ద అగాధాన్ని సృష్టించింది. ఈ పనంతా నెహ్రూదే. దీని బాధ్యత కూడా ఆయనదే.

# రష్యా నాయకుని జన్మదినోత్సవం!



మొదటివరస : ఎడమనుంచి—అల్యోషా అడ్జుబెయి (8 సం॥ల మనుమడు), వాన్యా అడ్జుబెయి (4 సం॥ల మనుమడు), నికిటా కృష్చెవ్ (3½ సం॥ల మనుమడు).

రెండవవరస: ఎడమనుంచి—అలెక్సెయి అడ్జుబెయి (అల్లుడు), యలెనా, రాడా (కుమార్తెలు), నినా పెట్రోవ్నా (సతీమణి), నికిటా అడ్జుబెయి (10 సం॥ల మనుమడు), శ్రీ క్రుష్చెవ్, సెర్జీ (కుమారుడు), గాలినా (కోడలు).

ఏప్రిల్ 17వ తేదీన రష్యాప్రధాని శ్రీ నికిటా సెర్జెయవిచ్ కృష్చెవ్ 70వ జన్మదినోత్సవం జరిగింది. ఈ సందర్భంలో వారికి వివిధ ప్రపంచ నాయకులు తమ శుభాకాంక్షలు తెలియచేశారు.

శ్రీ కృష్చెవ్‌ని, ఆయన బంధువులు కొందరిని పైచిత్రంలో చూడవచ్చు.

వెన్ను విరిగే భారం



కుటుంబనియంత్రణకు ప్లానిటాబ్




సెమ్మకము * సులభము * చౌక
మీ డాక్టరుని సంప్రదించండి
లేక వివరములకు మాకు వ్రాయండి
HIND CHEMICALS LTD., KANPUR



ఊరగాయపచ్చళ్లకు అమూల్యమైననూనెలు




అగ్‌మార్కు-కాబడిన ఎ.యస్. బ్రాండ్ చాయపప్పు నూనె




అగ్‌మార్కు-కాబడిన మేన్షన్‌బ్రాండ్ నువ్వుల నూనె

* ముక్కనుమెత్తబడనీయవు.
* బూజుపట్టనీయవు.
* చాలకాలము నిలువ యుంచును
సీలునుగమ నింపుడు

Mfrs: అంబటిసుబ్బన్న & కో, సామర్లకోట.

మద్రాసు డిస్ట్రిబ్యూటర్లు :
M/s పెరుమాళ్లు అండ్ కో
137, ఆదియప్ప నాయక్ స్ట్రీటు
మద్రాసు-1.
ఫోను నెం: 23095
M/s B. వెంకటేశ్వరరావు & కో
136, పురుసువాక్కం హైరోడ్
మద్రాసు-7.
ఫోను నెంబర్లు : 61552, 62574



తెల్లమచ్చలకు ఉచితవైద్యము

అనేక సంవత్సరముల పరిశోధన ఫలితముగా కనిపెట్టబడిన "సోమరాజి" ఆయుర్వేద ఔషధము తెల్లమచ్చలను నివారించును. ఒక చిన్న సీసామందు ఉచితముగా పంపబడును. ఇంగ్లీషులో వ్రాయండి.

Bharat Chikitsa Kendra (B)
P. O. Lal Bigha (Gaya)



పండిత
డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేట్) లిమిటెడ్
మదరాసు-17



తామరకు లిచెన్‌సా

సుప్రసిద్ధమైన
జర్మన్ నివారిణి
ప్రతిచోటా డాక్టర్లు
విపాదము చేస్తారు.
ఈ క్రిందివాటికి నిరపాయికరమూ,
అమోఘము అగు శీఘ్రనివారిణి

- పుళ్లు
- కాలివ్రేళ్ల మధ్యపాసిన పుళ్లు
- మడమపగుళ్లు
- చాకలి గజ్జి
- మొటిమలు ఇంక ఇతర చర్మరోగములు

అసలు జర్మన్ సూత్రాన్ని అనుసరించి ఇండియాలో పిరిచే తయారు చేయబడును
ది డాలర్ కంపెనీ
337, తంబుచెట్టి స్ట్రీటు, మద్రాసు-1
పెద్ద కెమిస్టుల అందరివద్ద లభించగలదు
(3DOL-1 TG)


# న్యూఢిల్లీ లేఖ

ప్రధాని మొన్న చేసిన ఉపన్యాసంతో షేక్ అబ్దుల్లా జైలునుంచి విడుదలయిన తరువాత చేసిన ఉపన్యాసాల సంగతి కూడా ప్రస్తావించారు. షేక్‌అబ్దుల్లాను గురించి వచ్చిన వార్తలు సరి అయినవి కావట! అతను చేసిన ప్రసంగాలను తప్పుగా ప్రచురించారట. అందువల్లనే అబ్దుల్లా మిత్రులు కొందరు కాశ్మీరు వెళ్ళి అబ్దుల్లా చేసిన ప్రసంగం "టేప్‌రికార్డు" నకలును కొని తెచ్చారట. నెహ్రూకు గాని అబ్దుల్లా మంత్రులకు గాని తడవ తడవకూ అబ్దుల్లాను సంరక్షించేందుకు ముందుకు రావటం భావ్యం కాదు. ఆ మాత్రం చెప్పుకునేందుకు అబ్దుల్లాకు నోరు, నాలికా లేదా?

ఈ సమస్యలో రెండు ముఖ్యమైన అంశాలు ఉన్నాయి. మొదటి నెహ్రూ ప్రవర్తన. ఆయన మొదటినుంచి తనంతట తానే నిర్మించుకొన్న విచిత్ర ప్రపంచంలోనే మునిగి తేలుతూ వచ్చారు. అబ్దుల్లా ఉపన్యాసాలు విని ఆక్రోశం తెచ్చుకోవద్దని నెహ్రూ ఎప్పుడో తన అనుయాయులకు సలహాలిచ్చారు.

షేక్ అబ్దుల్లా కోరికను అంగీకరించటానికి నెహ్రూ సిద్ధపడి ఉండాలి. కాశ్మీరు ప్రజలే కాశ్మీరు భవిష్యత్తు నిర్ణయం చేయాలని అబ్దుల్లా కోరిక. ఇక షేక్ అబ్దుల్లాను సమర్థించటానికి అతన్ని ఇండియా విధానాల్లోకి మలచుకోవటానికి అవకాశాలెక్కడ! కాశ్మీరు ప్రభుత్వం తనకున్న శక్తి విషయంలో కేంద్ర ప్రభుత్వానికి నిరాధారమైన విశ్వాసాన్ని కలిగించింది. అదే విశ్వాసం న్యూఢిల్లీ అంతటా ప్రచారం చేస్తున్నది కాశ్మీరు ప్రభుత్వం కాకపోతే, అబ్దుల్లాకు నానాటికి పెరిగి పోతున్న సైనిక శక్తి ఎదుట కాశ్మీరు శక్తి సామర్థ్యాలు ఎంత? పోతే, షేక్‌అబ్దుల్లాను మళ్లీ జైలుకు పంపించటం ఈ ప్రభుత్వం తరం కాదు. అందు వల్లనే, ఒకవైపు అబ్దుల్లా శక్తి సామర్థ్యాలు అనంతంగా పెరిగి పోతున్న ఈ తరుణంలో ఇండియా తరఫున భద్రతా సంఘంలో చాగ్లాకు గాని, మరొకరికిగాని వాదించడం కష్టమై పోతుంది.

కేంద్ర మంత్రివర్గంలోని చీలికలు కూడా యీ విషాదాంత కథ కొంత కారణం.

శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి కాశ్మీర్ సమస్యలో జోక్యం కల్పించుకోవటంపట్ల దుష్ప్రచారం ఎక్కువై పోతున్నది. సహజంగా ఈ సమస్యను పరిశీలించవలసింది హోంశాఖ కదా!!!

ఒకటిమాత్రం నిజమని తేలిపోయింది... షేక్ అబ్దుల్లా విడుదలకు నెహ్రూగారిదే బాధ్యత అబ్దుల్లా ఇండియాకు వ్యతిరేకంగా తిరిగి కత్తి కట్టటానికి అవకాశ మివ్వటం ప్రధాని నెహ్రూయే. కాశ్మీరు భవిష్యత్తును కాశ్మీరుప్రజలే నిర్ణయించుకోగలరని నెహ్రూ సవాలక్షసార్లు చెప్పారు. నెహ్రూజీ చేస్తున్న యీ

57 వ పేజీ చూడండి

రాజధాని కబుర్లు

# అధిక ధరలు అరికట్టే ప్రయత్నాలు కావాలి!

ఆంధ్రులకు ఆర్భాటం ఎక్కువనే విషయం ప్రతిదాంట్లోనూ కనిపిస్తూనే ఉంటుంది. రాజధానిలో చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధి చేయటానికిగానూ ఎన్నో పథకాలు రూపొందించారు. తగిన సలహాలను ఇవ్వటానికిగాను 'కాబినెట్ కమిటీ'ని కూడా ఒకటి ఏర్పాటు చేశారు. స్టూడియోలు కట్టడానికిగాను అయిదు లక్షల రూపాయలు అప్పుగా రెండేళ్లపాటు వడ్డీ లేకుండా ఇస్తామన్నారు. ఇక్కడ తయారయ్యే చిత్రాలకు డబ్బు రూపేణా కొంత ముట్టచెపుతామన్నారు. ఇలాంటి ప్రభుత్వ నిర్ణయాలు తీసుకుని మూడు నెలలు దాటిపోయింది. అప్పటినుంచీ ఇప్పటివరకు ఎన్నో సమావేశాలు, సన్మానాలు జరిగిపోయినాయి. ఇంకేముంది వచ్చిపడుతున్నారు నిర్మాతలు, డైరెక్టర్లూ అనుకున్నారు. ఏమూల చూసినా స్టూడియోలు వెలుస్తాయి అనుకున్నారు. ఈకాస్తలోనూ, అసూయలు, అపోహలు కూడా తలెత్తినాయట! తీరా చూడబోతే ఏమీ కనిపించటంలా! ఇదేమీ ఒక వ్యక్తి గాదు, ఇస్తాననంగానే చెక్కు రాసి చేతిలో పెట్టటానికి. కాగితంమీద కలం పెట్టాలసి వచ్చేటప్పటికి ఎన్నెన్నో చిక్కులూ, సమస్యలూను. రాష్ట్ర ప్రభుత్వం చేసిన నిర్ణయాలను ఆచరణలో పెట్టటానికి, మధ్యలో చెలరేగిన విమర్శలను దృష్టిలో పెట్టుకుంటూ, నియమాలను, షరతులనూ తయారు చెయ్యలేదు. అందువల్లనే కాగితాలు చురుకుగా కదలటంలేదు.

ప్రఖ్యాత చలన చిత్ర నిర్మాత ప్రసాద్‌గారు హైదరాబాద్‌లో 'కలర్ పిక్చర్' తీయటానికి అనుగుణంగా స్టూడియో నిర్మించాలని ప్రయత్నం చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వ పథకం క్రింద వారికి డబ్బు ఇవ్వటానికి కూడా నిర్ణయమయిపోయిందిట. మరియెప్పుడనేదే ప్రశ్న. అతి త్వరలోనే అని సమాధానం. నిర్ణయాలు అమలు కావటం ప్రారంభమయిన తర్వాత, మొదట్లో చెలరేగిన సంచలనం, ఎందాకా ఉంటుందో చూడాలి. ఈలోగా అయితే, పదిమంది తెలుగు నటీ నటులు ఏదో కారణంగా (షూటింగే ముఖ్యమనుకోండి) హైద్రాబాదు రావటం, వార్నందర్నీ ఒక్కసారిగా చూసి, ఇక్కడ ప్రజలు తబ్బిబ్బులవటం జరిగింది. దీనికి కారణం, అదివరకెప్పుడూ కూడా ఈమధ్య తిరిగినంత విచ్చలవిడిగా తెలుగు నటీ నటులు, హైద్రాబాదు పట్నంలో కనిపించకపోవటమే! ఇంత హడావిడి చేసినందుకు, సాధ్యమైనంత త్వరలో రాష్ట్ర ప్రభుత్వంవారు, ఆరూల్సేమిటో తయారుచేసి, నిర్ణయాలను అమలు పరచటానికి సిద్ధపడితే, స్టూడియో నిర్మాతలు ఎంతవరకు ముందుకు రాగలుగుతారో తెలిసిపోతుంది. దాంతో చలనచిత్ర పరిశ్రమలో కలిగిన సంచలనం ఏమిటో తెలిసిపోతుంది!

ధరలు పెరిగి పోతున్నాయి అంతు లేకుండా. అదుపులో పెట్టటానికి ఎవ్వరికీ సాధ్యం కాకుండా ఉంది. ప్రభుత్వాధిపతుల దగ్గర్నుంచి సామాన్య మానవుని వరకు గగ్గోలే వినిపిస్తుంది. మరి ఈ ధరలను తగ్గించటానికి తీసుకోవలసిన చర్యలు ఎవ్వరు తీసుకుంటారో, ఎప్పుడు తీసుకుంటారో తెలీకుండాఉంది. జనం పెరిగిపోతున్నారని, కుటుంబ నియంత్రణంటూ ప్రచారం చేస్తున్నారు. ఈ ఆహార ధాన్యాల పెరుగుదల విషయం పట్టించుకోకపోతే ఎట్లా! జంట నగరాలలో చౌక డిపోలను, మునిసిపాలిటీవారు నెలకొల్పి, నిర్వహించుకోలేక మూసి వేస్తున్నారు. వారికీ సివిల్ సప్లయిశాఖ వారికి పొత్తు కుదురలేదుట. అదిట కారణం మూసివెయ్యటానికి. ఆ మాటకొస్తే, ఈ రోజుల్లో సమన్వయం ఎక్కడుంది కనక! ఇప్పుడే ప్రభుత్వం వారే, వారి పర్యవేక్షణలో కొన్ని షాపులను ఏర్పాటు చేస్తారుట! ఇక చిల్లర దుకాణాల్లోకి వెళితే, బియ్యం స్టాకు లేదంటారు. టోకు వర్తకులు, వీళ్లకు కావలసిన బియ్యం సప్లయి చెయ్యరుట! నెలకు నాలుగుసార్లు వాళ్ల చుట్టూ తిరిగితే, అప్పుడేదైనా కనికరిస్తారుట! ఈ అవస్థంతా పడటమెందుకు, మేము టోకు వర్తకుల దగ్గరకు వెళ్లనే వెళ్లము అని కొంతమంది భీష్మించుకు కూర్చున్నారు. ఇట్లాగయితే, మేము ఇకనుంచి బియ్యం వ్యాపారం చెయ్యనే చెయ్యమంటూ టోకు వర్తకులు బెదిరిస్తున్నారు. ఇక బీదా బిక్కీ చూడపోతే నానా అగచాట్లకు గురి అవుతున్నారు. షాపులముందు గంటల తరబడి క్యూలో నిలబడి మరీ బియ్యం కొనుక్కోవాలి. అన్ని షాపుల్లోనూ వీళ్లకు కావలసిన బియ్యం దొరకవు. జంట నగరాల్లో ఎటువైపు చూసినా, ఎండలో కూడా ఈ 'క్యూలు' కనిపిస్తూనే ఉంటాయి. నిజంగా బియ్యం కేనా అంటే అదికాదు. ఇంట్లో అన్నీ ఉన్నాయి అనే సామెత మోస్తరు, ఓపట్టాన మనకు అంతుపట్టదు. ప్రతివాడూ తననిదాటే

64 వ పేజీ చూడండి

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### మాయని మచ్చ

ఎలాగ వుంటుంది భూకంపంలో శైసాను
ఆలాగ వుండదు టీ కప్పులో తుఫాను
తుఫాన్ మెయిల్లో టీ కప్పు
తుళ్లితే వస్త్రాలకు ముప్పు!

### గోవిందు నామాలు

నాకు తెలిసిన ఒకానొక నాస్తికుడు
లేదంటాడు ఆబ్దీకాల వల్ల జాస్తీ చెడు
ఏవంటే ఆయనకు అనయ్యామే తద్దినాలు
అయినా ఎంతో ఇష్టం ఆ భోయినాలు.

### మర్యాద రామన్న స్టోరీలు

అవతల వాళ్ల కాళ్లు తొక్కిన ప్రతిసారీ
అనవయ్యా నువ్వు 'వెరీసారీ'
అప్పుడే వుంటుంది నీకు నాగరికత ఖాతా
లేకపోతే నువ్వు బ్రతుకుతున్న యుగం త్రేతా
ఇంగ్లీషు వాళ్లు తుమ్మినా దగ్గినా క్షమించాలి
అని ఎదుట వాళ్లతో వెంటనే వచించాలి
ఇష్టమైన వాడి అస్పష్టత తొక్కరాని గార్డెన్
ముట్టెత్తుతాడు అతగాడు నీ యొక్క పార్డన్
మనసులో 'ఘెటవుట్' మాటల్లో వెల్కం
అదేనయ్యా సభ్యతయొక్క కిటుకు కీల్కాం.



సుజాతకు చిర్రెత్తుకొచ్చింది. అమ్మకు, బామ్మకు బుద్ధిలేకపోతే నాన్నగారికికూడా మతి పోయిందా ఏమిటి!

ఇదేం ఫైనలియర్ అనుకున్నారో మరేమనుకున్నారో? మొన్నీమధ్య వెళ్ళినప్పుడు అమ్మాటే అంటే, వాళ్ళకూ అదే బాధట! చదువు పూర్తయిపోతోంది కనుక వేసంగి సెలవల్లో వివాహంచేసి తీరాలట! ఈమధ్య వదిన కూడా విచిత్రంగా మారిపోయింది. తనకు పట్టుమని పందొమ్మిది ఇంకా నిండలేదు. వీళ్ళ హడావుడిచూస్తే ఫక్కున నవ్వు వస్తోంది. సరస్వతీదేవి కటాక్షంవల్ల చదువు తొందరగా వస్తున్నది కాబట్టి, ఏదో పట్టా పుచ్చుకోగలుగుతోందికాని, లేకపోతే వీళ్ళు చదివిస్తారా? ఈ పెళ్ళిచూపులకోసరం తను ఇంచుమించు పది సార్లయినా వూరికి వెళ్ళింది. ఈ విషయం వదిన దగ్గిర వెళ్ళగక్కితే, 'తప్పంతా నీదే' అంటుంది. "కట్నం పుచ్చుకునే వ్యక్తిని చేసుకోనని, నీ కంత పట్టుదల ఎందుకు? అన్నీ వచ్చినప్పుడు కట్నం సంగతి పెద్దవాళ్ళకు వదిలేస్తే, నీ కీ తిరగడం బాధ ఏనాడో తప్పును'' అని సన్నగా చీవాట్లు పెడుతూంది. తననేమో ఆత్మవంచన చేసుకోవడం చేతకావడంలేదు. ఆలోచనలలోనే బండి ఎక్కింది సుజాత.

మంగళగిరిలో మాధవయ్యగారు పేరుమోసిన డాక్టరు. ప్రాక్టీసు ప్రారంభించేనాటికి, ఆయన చెప్పుకోదగిన స్థితిమంతుడుకాడు. సామాన్య సంసారి ఆయన ప్రతిభా విశేషాలవల్ల త్వరలోనే కాలు నిలద్రొక్కుకొని కాస్త స్థితిమంతుడు కాగలిగాడు. సరిగా ఆ సమయానికే రాధమ్మగారితో వివాహమయింది. రాధమ్మ తండ్రి బాగా ఉన్నవాడు. ఒక్కత్తే సంతానం. దాంతో మాధవయ్యగారి ఆర్థికస్థితి మరోమెట్టు పైకి వెళ్ళింది. రాధమ్మగారు వచ్చిన వేళా విశేషమో ఏమో ఆయన సంపాదన వేలకు వేలు విపరీతంగా పెరిగిపోయింది. సిరిసంపదలతోపాటు వారికి సంతానం కూడా సమృద్ధిగానే ఉన్నది. ఆవిడకు వరుసగా అయిదుగురు అబ్బాయిలు పుట్టారు. మొదటి మూడుసార్లూ బంధువర్గంతోపాటు, ఆవిడా సంతోషించినా, ఆడపిల్ల లేదనే విచారం ఆవిడకు అంతర్యంలో పట్టుకున్నది. అయిదోసారి అబ్బాయి పుట్టినప్పుడయితే ఆవిడ 'అవురు'మని ఏడ్చేసింది. మాధవయ్యగారిని కూడా నట్టింట లక్ష్మీదేవిలా తిరిగే ఆడపిల్లలేని కొరత కనిపించినా, రాధమ్మగారిలా బైటకు లేచి తేలలేదు. పెద్ద కోడలినే అమ్మాయిగా భావించి తృప్తిపడేవారు. ఆఖరున భగవంతుడు ఆవిడ మొర ఆలకించాడో ఏమో అందమైన అమ్మాయి అవతరించింది. ఇంటిల్లిపాది ఆనందానికీ అవధుల్లేవు. వూరంతా విడ్డూరంగా చెప్పుకునేటట్లు అమ్మాయికి అన్నీ వేడుకలూ ఘనంగా చేశారు. అయిదుగురు అన్నల గారాల చెల్లెలు, తల్లి దండ్రుల ముద్దుకూతురే నేటి చిందులుత్రొక్కుతున్న సుజాత.

మాధవయ్యగారు అచ్చే అభ్యుదయ భావాలు కలవాడు కాకపోయినా, ఆడవాళ్ళు చిన్నతనంలోనే పెండ్లి చెయ్యాలని పట్టుబట్టినా, వాళ్ళ పాటలు సాగనియ్యలేదు. ఒక్కతే కూతురు కావడంవల్ల ముద్దు కావచ్చు. ఇంట్లో సంగీతంతో పాటు, ఆఖరి అన్నయ్య 'రామం'తో పాటు సుజాత స్కూలుకి వెళ్తుంటే, ఆయన అడ్డు పెట్టలేదు. ఆమె అనుకోకుండా పద్నాలుగేళ్ళకే మంచి మార్కులతో స్కూలుఫైనలు పాసవడంతోనే, ఆయనకు అమ్మాయిని పెద్ద చదువు చదివిజాద్దామని బుద్ధిపుట్టింది. ఇంట్లో ఇంక చదువు మానిపించి పెళ్ళి చెయ్యమని మళ్ళీ ఒక రామరావణ యుద్ధం జరిగింది. అయినా ఆయన చలించకుండా అమ్మాయిని గుంటూరు ఆడపిల్లల కాలేజీలో చేర్పించారు. గిరున మూడేళ్ళు తిరిగేటప్పటికి సుజాత డిగ్రీ క్లాసు చివరి ఏటిలో కొచ్చేసింది. కాలేజీలో కాలుపెట్టిన దగ్గరనుండి సుజాతకు సంబంధాలు వెదకడం ప్రారంభించా రాయన. అన్ని విధాలా అనువైన సంబంధం, అప్పటినుండీ వెతికితేకాని, పట్టా పుచ్చుకునేనాటికి కుదరదని ఆయన విశ్వాసం.

సంబంధాలు చూస్తున్న దగ్గరనుండి ఆయనకో కొత్త విషయం బైటపడింది. తన మనస్సులో ఉద్దేశ్యమేకాక, 'రామానికి' వస్తున్న సంబంధాల తాలూకు అబ్బాయిలు, ఆయనకు అనుకోకుండా తటస్థ పడడంతో, పోనీపిల్ల పెళ్ళి కూడా చేసేద్దామనే ధృడమైన ఆలోచన బలంగా

## 'సుశీల'

కలిగింది. సుజాత కట్నం తీసుకోని వాడినితప్ప, పెళ్ళి చేసుకోదట! ఇది ఆయనకు చాల జటిల సమస్యయి కూర్చున్నది. తాము లేనివాళ్ళ మెలాగూ కాదు కనక, కట్నంకోసరం మంచి సంబంధాలు వదులుకోవడం ఆయన కిష్టంలేదు. ఎంతచెప్పినా సుజాత కావిషయం నచ్చడంలేదు. తన ఆదర్శాలను వదులుకోలే నన్నది. ఆ విషయంలోతప్ప అమ్మాయి అన్ని విధాలా 'ఊ' నని పించుకొన్న పిల్ల. దానికీ పిచ్చి పట్టుదల ఏమిటో ఆయనకు బోధపడలేదు. దీనికితోడు, తన తల్లి రాధమ్మగారు కూడా "మేం చెప్పినప్పుడు విన్నారా? నెత్తికెక్కించుకున్నారు. అనుభవించక తప్పుతుందా? మా మాటలు విన్నారా?'' అంటూ సన్నగా సాధింపు మొదలెట్టేసరికి, ఆయనకు నిజంగా ఏం చెయ్యాలో పాలుపోలేదు.

కుటుంబ నిర్వహణలో మొదటినుండి తనకు కుడిభుజంగా ఉంటున్న పెద్ద కోడలు కమలతో చర్చించసాగారు. కమల కూడా మామగారి ఆందోళన గ్రహించుకుంటూనే ఉన్నది. నెమ్మదిగా సుజాతను ఆరేళ్ళ పిల్లనుండి పెంచిన అభిమానంతో "సుజాతా! చిన్న పిల్లలా ఇలా మంకుపట్టు పట్టడం బాగుండలేదు! నాన్నగారుచూడు నీమంచి ఎలా బెంగ పెట్టుకుంటున్నారో! ఏదో చిన్నపిల్లవు, ఏవో నాలుగు వ్యాసాలు వ్రాసినంత మాత్రాన, ఆదర్శాలంటూ పట్టుక్కూర్చోడమేమీ బాగుండలేదు. ఈ పెద్ద విషయాలు నీకెందుకు? అన్నీ మాకు వదిలెయ్యి. మిగతా విషయాల్లో నీ అభిప్రాయం చెప్పు'' అని చీవాట్లు పెట్టేది.

సుజాత చిత్రంగాచూసి, "అదేమిటి వదినా! అంత తేలిగ్గా తీసిపారేస్తున్నావ్! నేను మనస్ఫూర్తిగా నమ్మి వాటిని ఆచరణలో పెట్టాలనుకుంటున్నాను. అయినా మీ అందరికీ నా పెళ్ళి విషయమై ఇంత తొందర దేనికి? మీ అందరూ కట్నాలు తీసుకునే మా ఇంటికి వచ్చారా? మరి నే నలా చేసుకుంటానంటే మీరెందుకు ఒప్పుకోరు? కట్నం తీసుకుంటే, కట్నంమీద మోజు తప్ప, అమ్మాయిమీద అభిమానం ఏం ఉంటుంది? అయినా నాకేమంత వయస్సు మీరిపోయిందనా'' అని సుజాత చల్లగా ఎదురు జవాబు చెపుతుంది.

కమల కా మాటలతో నోరు మూతపడిపోయింది. నిజమే మరి! తమ అదృష్టమో, మామగారి మంచితనమో తామంతా కట్నాలు లేకుండా వచ్చినవారే. కాబోయే 'రామం' భార్య కూడా కట్నం లేకుండా నిశ్చయమైన పిల్లే. మరింకేమని సుజాతను తను సమాధానం చెప్పకలదు? అలా అని ఒక్క కట్నం విషయంతప్ప, మిగతా విషయాలన్నీ సరిపోయినప్పుడు, తమకు ఇచ్చుకోగల స్తోమతుఉండే, కాలదన్నుకోవడం చూడలేకుండా ఉన్నది. "ఇదో ఆచారమై పోయింగేతప్ప, కట్నం పుచ్చుకున్నవాళ్ళు మాత్రం భార్యను కళ్ళకద్దుకొని చూసుకోరటమ్మా'' అంటే సుజాత వినిపించుకోలేదు. సుజాత ఇలా 'కట్నం' దగ్గిర పేచీ పెట్టడంవల్ల, చాలా సంబంధాలు తిరిగి వెళ్ళిపోవడంతో 'పిల్ల పేచీ కోరని? పెంకెదని'' వార్తలు ప్రచారమై పోయాయి. ఆడవడుచును గురించిన ఈ అపవాదుకు కమల మనస్సు కలవరమై పోయింది. పైకనక పోయినా పెంచిన ప్రేమ మరీ ఎక్కువకదా! ఆ పిల్లకు ఆ 'ఒక్క' గుణం తప్ప పెంకెతనంగానీ, గర్వంకానీ ఏదీ లేదు! అనవసరంగా ఆదర్శమంటూ నలుగురి నోళ్ళలోనూ పడిపోయింది. ఎన్ని లోటుపాటులున్నా, కట్నంతో కప్పిపుచ్చుకుని వివాహాలు చేసుకుంటుంటే, లేని లోపాన్ని తెచ్చి పెట్టుకుంటున్నది, తన ఆడపడుచు. అంద చందాల లోను, విద్యా వినయాలలోను, ఆస్తిపాస్తుల విషయంలోనూ, దేనిలోనూ తీసిపోని తన కూతురికి వివాహమనేది పెద్ద సమస్యగా భావించలేదు మాధవయ్యగారు. ఈ పేచీతో తానుండగా, పెళ్ళికాదేమోననే భయం పట్టుకున్న దాయనకు. మామగారీ బెంగతో ఎక్కడ మంచ మెక్కుతారోనని కమల కనిపించిన దేముళ్ళకల్లా సుజాతాను సుముఖురాలిని చెయ్యవలసిందిగా లోలోన మ్రొక్కుకున్నది.

చిన్న మరిదికీ, సుజాతకు చను వెక్కువ. అతనితోచెప్పి చూసింది. మెల్లిగా మాటలల్లా పొట్లాట అయి, వాదన రోదన పరిస్థితికి వచ్చింది. తనే వెళ్ళి సర్దిచెప్పి, ఇద్దరినీ సమాధానపరచవలసి వచ్చింది. ఇంట్లో ఈ విషయంలో అందర్నీ ఇరుకున పెట్టేస్తున్నది సుజాత. కమల ఒక్కతే కూర్చొని దీర్ఘంగా ఆలోచించి, మెల్లిగా మధ్యాహ్నం మామగారి దగ్గిరికి కాఫీ తీసుకుని వెళ్ళింది. మనశ్శాంతికోసం ఆయన ఏదో వేదాంతగ్రంథం పఠిస్తున్నారు. కోడలు వచ్చిన చప్పుడువిని, మెల్లిగా తలెత్తి కాఫీ అందుకుని త్రాగేసి, కప్పు బల్లమీద పెట్టేశారు. కమల వెంటనే వెళ్ళిపోకుండా నిల్చోవడంచూసి, ఆయన వెంటనే ఆవిడ ఏదో పనిమీద వచ్చిందని గ్రహించుకున్నారు. మెల్లిగా పుస్తకం

56వ పేజీ చూడండి

స్వీడన్‌లో "మిడ్-సమ్మర్ నైట్" ఉత్సవం. ప్రతిఏటా జూన్ 23, 24 తేదీలలో ఈ ఉత్సవాన్ని జరుపుతారు. జానపద వుత్సవాల్లో ఇది చాలా గొప్పదని ప్రశస్తి.

# స్కాండినేవియా దేశాలు!

స్వీడన్, డెన్మార్క్, నార్వే దేశాలనే స్కాండినేవియన్ దేశాలంటారు. జనాభా ప్రకారం చూస్తే ఇవి చాలా చిన్నవి కాని ఈ దేశాలవద్ద మనం నేర్చుకొనవలసింది చాలా ఉంది. ఇవి చాలా అభివృద్ధిచెందిన దేశాలు('డెవలప్డ్ కంట్రీస్'). తక్కిన పాశ్చాత్య దేశాలు కేవీ తీసిపోవు. వీటన్నిటిలోనూ ముందంజ వేసినది స్వీడన్.

**తేడా**

జర్మనీ సరిహద్దు వదలి డెన్మార్క్ ప్రవేశించగానే తేడా గమనించ గలుగుతాము. పూలతోటలు, చేపలు పట్టేందుకు వాడే లంకలు, పచ్చికబయళ్లు ఇవన్నీ కంటికి ఇలా ఇంపుగా కనిపిస్తాయి ....

స్కాండినేవియన్ దేశాల మధ్య చాలా పోలికలు ఉన్నాయి. ఒకదాని కొకటి సన్నిహితంగా కూడా ఉంటాయి. అన్నీ ప్రజాస్వామికాలే. అన్నీ 'సోషలిజం' ను స్వీకరించినవే, కాని అన్నిటిలోనూ రాజ కుటుంబాలు ఇంకా 'ఏలు' తూనే ఉన్నాయి! పెట్టుబడిదారి సంస్థలూ లేకపోలేదు!

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత స్కాండినేవియన్ దేశాల పారిశ్రామికాభివృద్ధి బాగా ముందంజ వేసిందనవచ్చు. ఇక్కడ కార్మికుల వేతనాలు ప్రపంచంలో తక్కిన ఏ కార్మిక వర్గాల వారి వేతనాలకీ తీసిపోవు. యజమానుల— పనివారి మధ్య సంబంధాలు సాఫీగానే ఉంటాయి.

అయితే, స్కాండినేవియన్‌లు చాలా 'వ్యక్తిత్వం' కలవారని నే ననుకుంటాను. నేను చూసినంత దాకా ఎవరూ తమ చుట్టుపక్కల ఇళ్లవారి వ్యవహారాల్లో కలుగజేసుకోరు. అసలు దేశం మొత్తం మీద ప్రజలు ఒకరి కొకరు కాస్త కూస్త ఎడంగా నివసించటం అలవాటు ఉన్నవారు — రెండు ఇళ్ల మధ్య కొన్ని మైళ్ల దూరం ఉండటం కూడా కద్దు!

సాంఘిక రక్షణ — అంటే వైద్య, ఉద్యోగ



ఒక స్కాండినేవియన్ వృద్ధురాలు.

ఇతర సౌకర్యాలకి కావలసిన భీమా వద్ధతులు— ఇక్కడ మధ్య తరగతివా రందరికీ లభిస్తుంది. అందుకనే ఇక్కడి ప్రజల జీవితాలు సుఖంగా ఉంటాయి.

## మర్యాది

విదేశీయుల పట్ల స్కాండినేవియన్ల నడవడి చాలా మర్యాదగా ఉంటుంది. ఎందరికో ఇంగ్లీషు మాట్లాడటం వచ్చు. జర్మన్, ఫ్రెంచి భాషలూ మాట్లాడుతారు. ఇవికాక డేనిష్ లేక స్వీడిష్ లేక నార్వీజియన్ మాట్లాడేవారు తక్కిన రెండు భాషలని కూడా కనీసం అర్థం చేసుకునే పరిస్థితిలో ఉంటారు.

ఇక్కడ సగటు ఆయుర్దాయం 70 పైన!

ఇంతదాకా పోలికలనే చెప్పాను. ఇక భేదాలు కొన్ని వివరిస్తాను. స్వీడన్ తటస్థ విధానం అవలంభిస్తుంది. నార్వే డెన్మార్క్‌లు 'నాటో' సభ్యులు. ప్రపంచ యుద్ధాలలో స్వీడన్ అసలు పాల్గొనలేదు. డెన్మార్క్, నార్వేలు కొంతకాలం జర్మనీ పరిపాలన క్రింద ఉన్నాయి.

## స్వీడెన్

జనాభా .... 75 లక్షలు (వీరిలో 8 లక్షల పైన ముఖ్యపట్నం స్టాక్‌హోంలోనే ఉంటారు!) వైశాల్యము ..... 175700 చ. మై. (బ్రిటన్‌కి రెండు రెట్లు.) నిరుద్యోగులు ..... 15% కి మించి లేదు.

స్వీడెన్‌లో వేసవిలో సూర్యుడు ఇంచుమించు రాత్రిం (?) పవళ్లు వెలుగుతూనే ఉంటాడు! 23, 24 జూన్ తేదిలలో అసలే అస్తమించడు. ఇదే 'మిడ్ సమ్మర్ నైట్' పండగ చేసుకునే కాలం ... ఆటపాటలకీ, తాగుడికీ తక్కువ ఉండదు. అయితే, ఇక్కడ 'బార్' లు ఉండవు. మద్య పానీయాలు రేషన్ మీదనే దొరుకుతాయి. బీర్ మాత్రం కొంచెం విరివిగా లభిస్తుంది.

స్వీడిష్ భోజనం చాలా సుష్టుగా ఉంటుంది. ఒక్కొక్కసారి 25 వంటలు వడ్డిస్తారు. ఎన్నో రకాల చేపలు, మాంసాలు, గుడ్లు, ఆమ్లెట్‌లు, సీతలు, చీస్, సాసేజ్‌లు, కేక్‌లు, ఇంకా ఎన్నో దినుసులు! దానంతటికీ కలిపి 8 రూపాయలకన్నా అవదు.

చివరి మాట—నోబెల్ బహుమతులు స్వీడెన్‌కి చెందినవే.....

## నార్వే

జనాభా .... 3665000, వైశాల్యం ..... 128000 చ. మై. రాజధాని .... ఓస్లో (477000 జ.), వ్యవసాయం ముఖ్య వృత్తులలో ఒకటి కాని ఇక్కడ పొలాలు చిన్న చిన్నవిగా ఉంటాయి—సుమారు 10% మందికే 25 ఎకరాలను మించిన పొలాలు ఉన్నాయి,

## డెన్మార్క్

ద్వీపకల్పం 'యుట్‌లాండ్' కాక మరొక 500 ద్వీపాలు కలిపితే డెన్మార్క్ దేశం! (వీటిలో 100 లంకలలోనే మనుష్యులు ఉంటారు.) నార్వే, స్వీడెన్‌లవలె కాక డెన్మార్క్ జనాభా చాలా దట్టంగా ఉంటుంది. 1960 లోనే వ్యవసాయ వృత్తికి సంబంధించిన వస్తువుల ఎగుమతి మీద సుమారు 370కోట్ల రూపాయలు సంపాదించుకుంది డెన్మార్క్ (ఎగుమతి అయిన గుడ్ల సంఖ్య—200 కోట్లు!)

తక్కిన రెండు దేశాలలాగే డెన్మార్క్‌లోనూ చేపలు పట్టటం పెద్ద పరిశ్రమ.

వ్యాసం : ఎన్. చెంగల్రాజు ★



"స్టాక్‌హోం" సందడితో కూడిన నగరం. జనాభా ఎక్కువ. పరిధి తక్కువ అయినందువల్ల, నగరం వెలుపల పెద్ద పెద్ద భవనాలను నిర్మించారు. అలాంటి ప్రదేశాల్లో 'వెల్లింగ్‌బై' కూడా ఒకటి. నగరంలోని కేంద్ర ప్రాంతాలన్నీ ఈ వెల్లింగ్‌బై తో ఎక్స్‌ప్రెస్ రైల్లమార్గాలద్వారా కలిపారు.



మరొక మిడ్ సమ్మర్ - నైట్ ఉత్సవ దృశ్యం.

# అసురసంధ్య



## ఆ ది వి ష్ణు

## 2

సుభద్రమ్మకి దుఃఖం వెల్లుబికి వస్తోంది. నోటికి చీర చెంగు అడ్డు పెట్టుకుని ఏడుస్తోంది. రాజారావు గుమ్మం దగ్గర మౌనంగా నిలబడి ఉన్నాడు. అతనికిప్పుడేమీ తోచడం లేదు. ఎన్నో ఆశల్ని గుండెల్లో దాచుకుని ఈ వూరు వచ్చాడు. ఇక్కడ ఈ పరిస్థితిని గమనించడంతో అతని మనసంతా చెదిరిపోయింది. అతని వయస్సూ, అనుభవాల్లో ఇలాంటి సన్నివేశాలు రెండే రెండు చోటు చేసుకున్నాయి.

అమ్మ పోయిన నాడు దిగ్భ్రాంతి చెందేడు. ఘొల్లున ఏడవలేక పోయినా, దుఃఖానికి అతీతమైన భావన యేదో అతన్ని ఆవరించిందానాడు. అమ్మలేదు! తిరిగిరాదు!— ఈ వెలితి తనని నిలువునా కూల్చివేసింది. పరిచయస్థుల సమక్షంలో అతను మతిపోయిన మనిషైనాడు.

ఈ నాడు అత్తయ్య స్థితి— అతనూహించలేదు— కానీ, వోదార్చే నేర్పు తనకి లేదు. చాతకాదు. అతను తల వంచుకుని కాలిగోటితో నేలను రాస్తూ నించుండి పోయేడు.

తాత, మునసబు ఇద్దరూ ఆ సమయానికి అక్కడ లేకపోతే రాజారావు ఇరకాటంలో పడిపోయి ఉండేవాడు. వాళ్ళిద్దరూ జీవితాన్ని బాగా ఆకళింపు చేసుకున్న వ్యక్తులు కావడాన, ఇలాంటి దారుణాలు వాళ్ళ అనుభవంలో చాలా చూసి ఉన్నారు కాబట్టి సుభద్రమ్మను వోదార్చ గలిగేరు. ఆవిడ కుదుట పడిన తర్వాత సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు వాళ్ళిద్దరూ.

రాజారావు బిక్కు బిక్కు మంటూ అవతలి గదిలోకి అడుగు పెట్టాడు. సంచీ నేల మీద ఉంచి ఒళ్ళు విరుచుకున్నాడు. గోడమీద ఉన్న పాత కాలపు ఫోటో అతన్ని ఆకర్షించింది. గబగబా అటు వైపున నడిచేడు. ఫోటోని తీక్షణంగా చూడటం ప్రారంభించేడు.

మామయ్య కాబోలు, ఆయన మొహంలోని గంభీరత కొట్టొచ్చినట్టుంది. ఆయన ప్రక్కన అత్తయ్య. వాళ్ళిద్దరి వెనుకా అమ్మ! మొహాన బొట్టు లేకపోయినా, అలంకరణ విషయంలో ఆమె నోచుకోలేక పోయినా, దేవతలాంటి మనిషి అమ్మ!

రాజారావు కళ్ళు ఆర్ద్రమైనాయి. వెంటనే తల దించేసుకున్నాడు. అంతలోనే ఉలిక్కి పడ్డాడు. తన వెనుక— ఎవరో మెల్లిగా ఏడుస్తున్నట్టనిపించింది. గభాలున వెనక్కి తిరిగి చూసేడు. లోపలి గుమ్మానికి చేరగిలబడి తలని కిటికీవైపుంచి ఆ పిల్ల ఏడుస్తోంది. రాజారావు ఆమె దగ్గరిగా వెళ్ళాడు. అది ఆమె గమనించనే లేదు. ఏడుపు ఆపనూ లేదు. అమ్మ వరలక్ష్మి గురించి చెప్పిన పోలికలు గుర్తుకొచ్చేయి. వణుకుతో నెమ్మదిగా పిలిచేడు.

"వరలక్ష్మీ!"

ఆమె ఆ పిలుపు విని తెల్లబోయింది. అందమైన తన చేతుల్తో కళ్ళు తుడుచుకుంది.

"మా అమ్మ పోయిన నాడు నేనూ నీ స్థితిలోనే ఉన్నాను. మనసు దిట్ట పరచుకోవాలి వరలక్ష్మీ! గతించిన దాన్ని మరిచిపో! ఇంతకంటె నీ కేం ఎక్కువ చెప్పగలను?"

ఆ పిల్ల రాజారావువైపు చిత్రంగా చూసింది. అతను గుమ్మాన్ని చేత్తో రాస్తూ అన్నాడు—

"నిన్ను చూడటం ఇదే మొదటిసారి. నా దౌర్భాగ్యం కొద్దీ అవాంఛనీయమైన వాతావరణంలో నిన్ను పరిచయం చేసుకుంటున్నాను." అన్నాడు బాధగా.

"నిజానికి నేను చాలా దురదృష్టవంతుణ్ణి వరలక్ష్మీ! చాలా దురదృష్టవంతుణ్ణి."

వరలక్ష్మి ఏమీ మాటాడలేదు.

"పుట్టిన ఏడాదిలోనే తండ్రిని పోగొట్టుకున్నాను. అయినా వాళ్ళందర్నీ అమ్మ దూరం చేసుకున్నది. మే మిద్దరం చావలేక బ్రతికినట్టు బ్రతికాం వరలక్ష్మీ! కానీ అమ్మకున్న ధైర్యం నన్ను మనిషిగా చేసింది. ఇప్పుడు ఆ అమ్మలేదు. ఆవిడ గౌరవించిన మావయ్యా లేడు. నా కలలూ గాలి మేడలయ్యాయి. పోనీలే వరలక్ష్మీ! అసలే దెబ్బ తిన్న నీ మనసుని నా కథలు చెప్పి బాధ పెట్టడం ఇష్టంలేదు నాకు."

అతను మళ్ళా గదిలోకి వచ్చాడు. ఎంత వద్దనుకుంటున్నా అతని చూపు మావయ్య వాళ్ళ ఫోటో మీదకి పోతూనే ఉంది. వరలక్ష్మి అక్కడ నుంచి కదలి వెళ్ళిపోయినట్టు గమనించేడు రాజారావు. భారంగా నిట్టూర్చేడు.

పాలేరు నీళ్ళు తోడినట్టు చెప్పడంతో టవలు తీసుకుని దొడ్లోకి వెళ్ళేడు.

* * *

తల దువ్వుకుంటూండగా వరలక్ష్మి గదిలోకి వచ్చింది. ఆ పిల్ల చేతిలో కాఫీ పొగలు కక్కుతోంది. దువ్వెన బల్లమీద ఉంచి, చేతులు టవల్తో తుడుచుకుని వరలక్ష్మి దగ్గరకు వచ్చాడు. కాఫీ కప్పు తీసుకుంటూ అన్నాడు.

"అలా కూర్చో వరం!"

ఆ పిల్ల ఆ పేరు వినడంతో ఉలిక్కి పడింది. రాజారావు మెల్లిగా నవ్వేడు.

"మా వివరాలు మీరు పట్టించుకోక పోయినా

మిమ్మల్ని గురించి అమ్మచాలా వాకబు చేస్తూం డేది. నీకు తెలీదు వరం అమ్మ మనసు ! మావయ్య ఆమెను ఇంటి నుంచి గెంటివేసినా ఆయన మీద గౌరవం గానీ, ఆత్మీయత గానీ అమ్మకి ఏమాత్రైనా తగ్గలేదు. పైపెచ్చు ఇరవై నాలుగ్గం టలూ మావయ్యనే తలుస్తూండేది. ఆయన గుణ గణాలను పొగుడుతూండేది. ఎందుచేతనం టావ్ ?'' అడిగేడు.

ఆ పిల్ల కుర్చీలో పొందికగా కూర్చుని వింటుండే గానీ నోరు విప్పి ఒక్క మాటైనా అనలేదు. నేల మీద చూపు నిలిపింది. రాజారావు కాఫీ తాగడం ఆపి మళ్లా అడిగేడు.

''చెప్పు వరం ! అమ్మకి మావయ్య మీద అంత భక్తి భావం ఎందుకుండాలిట ?''

''నాకు తెలీదు'' అన్నది బెరుగ్గా.

''కాదు. నీ కెవరూ చెప్పలేదు. కదూ ?— మా అమ్మ చేసింది తప్పే అవుగాక, మావయ్య రక్త సంబంధాన్ని త్రోసిపుచ్చి అమ్మ మెడపట్టి గెంటి, ఆమె మొహం ముందే తలుపు మూసినా..'' రాజారావు కంఠం వణికింది. అతనికి అమ్మ అనుభవించిన నిరాదరణ జ్ఞాపకం రావడంతో కళ్లు చెమ్మగిల్లాయి. కాఫీ కప్పు కింద పెట్టి గోడవైపు తిరిగి కళ్లొత్తుకున్నాడు.

వరలక్ష్మమ్మకి అతని మీద జాలి కలిగింది.

''బావా !'' అప్రయత్నంగా అనేసింది.

రాజారావు గొంతుకలో గుండె నిలిచినట్టయింది. అతనిప్పుడు ఆనందంలో నిలువునా మునిగి పోయేడు. తత్తరపాటుతో అన్నాడు—

''తెలుసు వరం ! తెలుసు. ఈ పిలుపు చాలు, ఈ ఆదరణ చాలు. నేను మళ్లా మనిషినౌతాను. వెయ్యి ఏనుగుల బలం వస్తుంది నాకు. ఈ పిలుపు కోసమే ఇంత దూరం వచ్చేను. నువ్విలా హృదయ పూర్వకంగా నన్ను 'బావా' అని పిలుస్తే చాలు, నా నీడలు గుర్తుండవు, నా బాధలు గతానికి ఆహుతై పోతాయి వరం !''

అతనిలో కలిగిన ఈ మార్పుకి ఆ పిల్ల ఆశ్చర్య పోయింది. తర్వాత సిగ్గుపడింది.

''నాలుగేళ్ళ క్రితం మీరు చిలకలపూడి తిర నాల కొచ్చేరు. అక్కడ అమ్మ మిమ్మల్ని చూచిందట. మీరామెను పలుకరించలేదు. పలుకరించి అమ్మ అవమానం చెందింది. అయితేనేం— లక్ష్మీదేవి లాటి నీ రూపం అమ్మని ఆకర్షించింది. అప్పట్నుంచీ నీ గురించే ఎక్కువగా చెప్పేది అమ్మ— 'వరం అప్సరసలాటి పిల్ల నాయనా—' అని. ఆ నాడు నా అమ్మని గుర్తుపట్టి, చాటుగా వచ్చి ఆమె చేతిలో ప్రసాదం పెట్టావుట నువ్వు గుర్తున్నదా?'' అడిగేడు.

వరలక్ష్మమ్మ తలూపింది.

''అందుకే అన్నది— వెన్నలాటి మనసుట నీది. ప్రేమని దాచుకోలేక నిన్ను చేతుల్లోకి తీసుకుని హృదయానికి హత్తుకున్నదిట. అప్పటి నా అమ్మ వాత్సల్యం గానీ, ఆవిడ కళ్లల్లో నిలిచిన నీటిని గానీ జ్ఞాపకం పెట్టుకున్నావా వరం ? చెప్పు నాకు'' అన్నాడు గాద్గదికంగా.

ఆ మాటతో వరలక్ష్మమ్మ చలించి పోయింది.

''నిజం వరం ! అమ్మ గుర్తుకొస్తే నే నెందుకో పసివాడినై పోతాను. పరిసరాలు మరిచి గట్టిగా ఏడవాలనిపిస్తుంది. దీన్ని హృదయ దౌర్బల్యమనూ, పసితనమనూ, ఏమైనా అను ఆమె వెన్నాదిలి వెళ్లినా, ఆమె నాకు దూరం కాలేదు. కాదు. ఆమె స్మృతులు నన్ను విడిచి పెట్టవు వరలక్ష్మమ్మ.''




వరలక్ష్మమ్మకి ఏడు పొచ్చేట్టుంది. అందికే, కాఫీ కప్పు తీసుకుని వెళ్లబోయింది—

''ఆగు వరం ! నీ మనసు నొప్పిస్తే క్షమించి మరీ వెళ్ళు.'' అన్నాడు రాజారావు.

''లేదు.'' అనేసి గబగబా వెళ్లిపోయింది వరలక్ష్మమ్మ.

—రాజారావు బట్టలు మార్చుకున్నాడు. చెప్పులు వేసుకుని బయటకు రాబోయాడు. అత్తయ్య కనిపించడంతో ఆగి, ఆమె దగ్గరిగా వెళ్లి కూర్చున్నాడు. ఆవిడెంత సేపటికీ మాట్లాడింది కాదు. తనే కల్పించుకున్నాడు.

''మావయ్యకి ఈ వూళ్లో మంచి పేరున్నదని విన్నాను. ఆయున్నందరూ అభిమానించే వారనీ విన్నాను.''

''అయినా దుర్మార్గులెవరో కడుపున పెట్టుకున్నారు. అందర్నీ ఆయిన నమ్మేవారు. మనసు విప్పి మాటాడే వారు. చివరికి.... నా పాలిట రాక్షసులెవరో.... కొంపతీశారు బాబూ !'' అన్న దావిడ ఏడుస్తూ.

రాజారావు మరేమీ మాటాడలేదు.

''దేవుడనే వాడుంటె ధర్మరాజు లాటి మనిషిని పొట్టను పెట్టుకున్న దుర్మార్గులు సుఖపడలేరు. అతి నికృష్టమైన చావు చస్తారు.'' అన్నది కసిగా.

''ఒక్కటి అడుగుతాను నిజం చెప్తావా అత్తయ్యా !''

ఆమె ఏమిటన్నట్టు చూసింది. ఆమె మొహంలో బాధ కనిపిస్తోంది. కళ్లు ఎర్రబారి ఉన్నాయి. కన్నీటి చారలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆవిడ మూర్తీభవించిన శోకంలా ఉన్నది. రాజారావు తలొంచుకుని అడిగేడు.

''సందర్భం తెలిసిగూడా ఇలాటి ప్రశ్న అడగడం అన్యాయమే ! కానీ— మనసుండబట్టక అడుగుతున్నాను. అమ్మ బ్రతికుండగా నేనీ వూరొచ్చి ఉంటే, నన్ను మీలో ఒకడ్నిగా చేసుకోమని అడుగుతే— నువ్వు ఒప్పుకునేదానివేనా ? తప్పుచేసిందనుకుంటున్న అమ్మని క్షమించగలిగేదానివేనా ? చెప్పత్తయ్యా !''

ఆమె తన మొహాన్ని అవతలవైపు తిప్పుకున్నది.

''మావయ్యని ఈ ప్రశ్న అడగటానికే, నేనీ వూరొస్తే. మీ దృష్టిలో తప్పుచేసిన అమ్మలేదు. నన్ను ఒంటరిని చేసి వెళ్లింది. నన్ను ఆదరించగలవా మావయ్యా అని అడగటానికొచ్చేను. ఈ దారుణం విన్నాను. నిలువునా కూలిపోయాను. మీకు తెలీదు— అమ్మ నాకెన్నో చెప్పింది. నాలో మావయ్య మీద గౌరవభావాన్ని పెంచిందే కాని ఆయన పట్ల మరిచిపోలేని కక్షనిగానీ, పగని గానీ నేర్పలేదు. ఇప్పుడు చెప్పండి. అమ్మ దేవత కాదూ ! మీరా విడ్ని క్షమించి ఉండేవారేనా ? చెప్పండి ?'' రెట్టించి అడిగేడు మళ్లా.

ఆవిడ ఘొల్లున ఏడ్చేసింది.

''తెలుసునాకు. మావయ్యకీ, నీకూ అమ్మమీద వాత్సల్యం చచ్చిపోలేదు. కానీ — సంఘం. అది మిమ్మల్ని ఒత్తిడి చేసింది. భయపెట్టింది. బల వంతాన మిమ్మల్ని వేరుచేసింది. ఇదే నా బాధ. గుండెల్లో దాచుకున్న ఈ బడబాగ్నిని మావయ్యతో చెబుదామనుకుని వచ్చేను. కానీ—'' అతను వెక్కి వెక్కి ఏడ్వడం ప్రారంభించాడు.

సుభద్రమ్మ గోడకి చేరగిల పోయింది.







# అసుర సంధ్య

కొంత సేపటికి రాజారావు లేచి నిలబడ్డాడు. గుప్పెట బిగించేడు.

"నాకు స్వర్గ నరకాలపైన నమ్మకం లేద త్తయ్యా! నేరం చేసిన మనిషి శిక్ష నిక్కడే అనుభ విస్తాడు. ఇది మాత్రం నిజం." అన్నాడు గంభీ రంగా. తర్వాత నెమ్మదిగా అడుగులేసుకుంటూ బయటకు నడిచేడు.

ఇల్లు దాటిన తర్వాత సిగరెట్టు ముట్టించేడు. అతని మనసంతా గందర గోళంగా, సాలెగూడులా తయారయ్యింది. ఎన్నో ఆలోచనలు, అతని మస్తిష్కంలో మెదులుతున్నాయి. అవుతే ఒక్క దానికీ సరైన రూప మేర్పడటంలేదు.

అప్రయత్నంగా అతని అడుగులు దేవాలయం వైపు దారితీసాయి. మునసబు ఇల్లు దగ్గర పడింది. ఆయన ఇంటి అరుగుమీద నిలబడి మరె వరో మనుష్యులతో ఏదో విషయమై చేతులు తిప్పుకుంటూ ఉపన్యసిస్తున్నారు. శ్రోతలు కడు జాగ్రత్తగా వింటున్నారు. ఆయన, కొన్ని ముక్కలు సర్వ జనానికి, వీధి చివరివరకూ విన పడేలా— మరికొన్ని (ముఖ్యమైనవి కాబోలు) మెల్లిగా చెవిలో రహస్యం చెబుతున్నట్టుగానూ ఉన్నాయి. మునసబుని రాజారావు చూసిన వేళా విశేష మేమిటో గానీ అతనికి మునసబుపట్ల సదభిప్రాయం కలగటంలేదు.

మావయ్యకీ మునసబుకీ ఆ మధ్య 'మాటల్లే వని' తాత చెప్పేడు. అతని ఆకారానికి తోడు తాత అతని గురించి చెప్పిన ఈ విషయం తోడై— మునసబంటే కొంత అయిష్టత కలిగించింది.

రాజారావు మునసబునీ, అతని తాలూకు వంది మాగతుల్నీ చూసి గూడా చూడనట్టు తలొంచుకు నడక వేగం పెంచాడు. కానీ— మునసబే రాజా రావుని పరామర్శించడంతో రాజారావు ఆగిపోక తప్పింది కాదు.

"ఏం బాబూ అంతా సవ్యంగా ఉన్నట్టేనా ?"

ఈ రకమైన పరామర్శలో రాజారావుకి కొంత అవహేళన స్ఫురించిన మాట నిజం. అతను ముభా వంగా నవ్వి వూరుకున్నాడు.

"మొదట్లో చిటపట లాడినా సుభద్రమ్మ మంచి మనిషి. ఎంతైనా మేనల్లుడివాయె. తెగించి కాదనడానికి ఆమెది ఆడమనసా మరోటా ? రెండు రోజులు గడుస్తే అన్నీ చక్కబడతాయి. నువ్వేం ఖంగారు పడకు. అన్నట్టు నువ్వెక్కడ పని చేస్తున్నట్టు చెప్పావూ ?"

"ఇంతకు మునుపు నేనేం చెప్పలేదు గానీ ఇప్పుడు చెప్పవలసిన అవసర ముంటె అడగండి. చెబుతాను." అన్నాడు నిష్కారంగా.

"మునసబు గలగలా నవ్వేశాడు.

"అసాధ్యుడివే ! మరేమిటో అనుకున్నాను." అన్నాడు మునసబు వొచ్చే నవ్వుని ఆపుకుంటో.

"కానీ, మీ గురించి నే నింకా ఓ నిర్ణయానికి రాలే దింకా."

"నీబోటివాడి కది బ్రహ్మవిద్యటయ్యా !" మళ్ళా నవ్వేస్తూ అన్నాడు.

"ఆలస్యమైనా మంచిమాటన్నారు."

దీంతో మునసబు అభిమానం కొంచెం దెబ్బ తిన్నట్టయింది. రాజారావులాటి వాగుడుపిట్టతో తను మాటలు పెంచుకోడం, అందునా అంత మంది ముందు మంచిది కాదనుకుని, వరస మార్చి అన్నాడు—

"ఈ ఖబుర్లకేమొచ్చె గానీ—వెళ్లిరా. అవతల నువ్వేదో పని తొందర్లో ఉన్నట్టున్నావు."

"వీలు చిక్కినప్పుడు మరోమాటు కలుస్తాను. అప్పుడు తీరుబాటు చూసుకుని మాటాడుకో వచ్చు. సెలవు మరి." అని చెప్పేసి కాలుతూన్న సిగరెట్టుని నేలమీద వేసి చెప్పుతో తొక్కి మరీ కదిలాడు రాజారావు. పది అడుగులు వేసిన తర్వాత మునసబు పార్టీ తాలూకు నవ్వులు వినిపించాయి గానీ—వాటిని పట్టించుకోలేదు రాజారావు. ఆలయం వేపు వేగంగా నడవడం ప్రారంభించేడు.

ఆలయం చేరుకునే వేళకి తాత మంటపం మీద కూర్చుని ఏదో పుస్తక పఠనంలో మునిగి పోయి ఉన్నాడు. రాజారావు రాకని కూడా గమ నించలే దతను. రాజారావు చెప్పులు విడిచి మెల్లిగా వొచ్చి తాతకాస్త దగ్గర్లో కూర్చున్నాడు. అప్పటిగ్గాని పుస్తకంనించి చూపు మార్చలే దాయన. రాజారావుని చూచి పుస్తకం మూస్తూ—

"గీత చదువుతున్నాను" అన్నాడు.

"అవుతే మిమ్మల్ని కలిసికోటాని కిది వేళకాదు గాబోలు" అన్నాడు రాజారావు మెల్లిగా నవ్వుతో.

"అది కాదు" ముక్తసరిగా జవాబిచ్చేడు తాత.

రాజారావు సిగరెట్టు పాకెట్టు తీసి సిగరెట్టు ముట్టించుకుని నెంపాదిగా పొగ వదులుతూ ఏదో చెప్పబోయాడు గానీ మధ్యలో తాత గొంతు అడ్డ పడ్డది.

"ఆలయ ప్రాంగణంలో సిగరెట్టు నిషేధం కదా ?"

"కానీ నా కది వర్తించదు. అంతమాత్రంచాత దేవుడిమీద నాకు నిర్లక్ష్యమని చెప్పను. నేను సిగరెట్టు కాలుస్తున్నది అలంకార నిమిత్తం కానేకా దసలు."

"దేవుణ్ని నిర్లక్ష్యం చేయడం చేయకపోవడ మనేది వేరే విషయం. సిగరెట్లు కాల్చడ మనేది ఆరోగ్యానికి మంచిది కాదన్న ఉద్దేశ్యంతో, అతిగా కాల్చడమనే జాడ్యానికి దేవుడి పేరుమీదా, దయ్యం పేరుమీదా మన పెద్దలు కొన్ని నిబంధనలు చేశా రని నా ఉద్దేశ్యం" అన్నాడు తాత.

"సరి సరి. మీ రిప్పుడు సిగరెట్లపైన ఉప న్యాస మిచ్చేలా ఉన్నారు. ఆ విషయాన్ని కొంచెం అవతలకు నెట్టి నన్ను రక్షించండి."

ఇద్దరూ కలిసి కట్టుగా నవ్వేశారు.

"గమనించలేదు గానీ, నీకూ మాటలొచ్చు" అన్నాడు తాత.

"సరిగ్గా ఇలాగే అన్నారు మునసబు."

"ఆయన తెలివైన మనిషి."

"నా కది తెలీదు. కానీ, మీనుంచి తెలుసుకోవా లని ఉంది. నిజం చెప్తారా తాతా."

తాత రాజారావు వైపు ఏమిటన్నట్టు చూశాడు. రాజారావు సిగరెట్టుని గట్టిగా ఒక దమ్ము పీల్చి, అందంగా పొగ వదులుతూ అడిగేడు—

52 వ పేజీ చూడండి






సొగసు గలిగించె సబ్బు,
దుర్గంధమును తొలగించును కూడా



# సంపూర్ణ సుందర వనిత

సంపూర్ణ సుందర వనితగా వుండండి. జి-11*తో గూడిన **సింథాల్** వాడండి. చర్మ సౌందర్యమును గలిగించే సబ్బులలో అత్యుత్తమ విలువైనది.

మీరు కూడా సుందర వనితవలె వుండండి, ఎందుకనగా, మనోల్లాసకరంగా పరిమళమొనర్చబడిన **సింథాల్** యందుగల **జి-11**, గుణవంతంగా దుర్గంధమును తొలగించును, సౌమ్యంగా చర్మమును పరిశుద్ధ పరచును అనిబుజువు చేయబడినది. బహు చక్కని జనులు చక్కగానుండుటకు **సింథాల్** వాడుచున్నారు.

సంపూర్ణ రక్షణకోసం, సింథాల్‌తో స్నానం చేసిన తరువాత జి-11తో గూడిన గోద్రెజ్ సింథాల్ టాయిలెట్ పౌడర్ వాడండి.

*"జి-11-ఏమిటి"? అనే ఉచిత సచిత్ర పుస్తకముల కోసం, గోద్రెజ్, బొంబాయి-12కు వ్రాయండి.

గోద్రెజ్ తల నూనెలో కూడా జి-11 వున్నది.

Godrej గోద్రెజ్ సబ్బులలో ఉత్తమ నామము

తయారయిన 'పూలకుండి' చిత్రం ఇది.



# కాగితం పూలు

వ్యాసం: ఎస్. నాగరత్నం

ఫొటోలు: ఎస్. రామకృష్ణ

కాగితాల పూలంటే మనందరికీ ఎంతో ఇష్టం. ఆ పూలను ఇంటి నిండా అలంకరించుకోవాలని, మనఇంటిని ఎంతో అందంగా తయారు చేసుకోవాలని ఉంటాం.

వాటిని తయారుచేయుటం చాలా తేలిక. వేర్వేరు సైజుల్లో, రంగుల్లో, వేర్వేరు రకాలలో తయారు చేసికోవచ్చును. మనం ఇప్పుడు చెప్పుకునే పద్ధతి ద్వారా కాగితాల పూలను తయారు చేసికోవటం వల్ల పెద్ద ఖర్చుకూడా అవదు,....వీటిని చక్కగా, మనకు కావలసిన విధంగా తయారు చేసుకుని, టేబుల్స్ మీద "ఫ్లవర్‌వేజుల్లో"ను, డ్రాయింగ్ రూముల్లోను అలంకరించుకుంటే, ఎంతో చూడ ముచ్చటగా ఉంటుంది.

కావలసిన వస్తువులు...... ఒక కత్తెర, రంగు రంగుల క్రేప్‌టిస్యూ కాగితాలు, రంగుల దారములు ఆరు — ఎనిమిది అంగుళాల పొడవుగల తీగెలు, సన్నని చీపురు పుల్లలు కొన్ని,

'టిస్యూ' కాగితాలలో ఎన్నెన్నో రకాలున్నాయి. కాగితాల పూల తయారీకి 'క్రేప్ పేపరు' ఎంతో చక్కగా ఉంటుంది. అందువల్ల పూలు — చాలా సహజంగా కనుపించే అవకాశం ఉన్నది.

'టిస్యూ', 'క్రేప్' కాగితాల్లోనొక దానిని తీసికోవాలి, పెద్ద 'షీటు'నేతీసికోవాలి. దాన్ని రెండుగా మడత వేయాలి. మళ్లీ మడత వేయాలి. చివరకు ఒక అంగుళం వెడల్పు వరకు వచ్చేదాకా కాగితాలను మడతలు వేస్తూ ఉండాలి. ఆ తరువాత కత్తెర తీసికొని, ఆ కాగితపు మడతలను "తామరపుచెవి" ఆకారంగా కత్తిరించి — అంటే పైన గుండ్రంగా క్రింద పొడుగ్గా ఉండాలి. అందులో వేర్వేరు సైజులలో కత్తిరించాలి. ఎందుకంటే కత్తిరించిన కాగితాలు, రెమ్మ రెమ్మలుగా, ఒకదాని మీద మరొకటి వస్తాయి కనుక. అంటే, మనం తీసికొన్న ఒక కాగితాలు దాదాపు నూరురెమ్మలను వేర్వేరుసైజులలో కత్తిరించవచ్చును. ఇవన్నీ కలిపితే పది నుంచీ పదిహేనువరకు పూలు తయారవుతాయి. అందువల్ల, ముందుగనే వేర్వేరు రంగుల కాగితాలు తీసికొంటే, పూలుకూడా రంగులు — రంగులుగా తయారవుతాయి.

"తామరచెవి" ఆకారంలో ఉండే కాగితాలను కత్తిరించుకున్నాం. డ్రాయింగ్ రూములో టేబులు మీదకు పనికొచ్చే పూలగుత్తులు ఎలా వేయాలో తెలుసుకుందాం.

పైన చెప్పినట్లు, చీపురు పుల్లలు, తయారుగా ఉన్నాయి. అవి సన్నంగాను పరిశుభ్రంగను ఉండాలి. అలాంటి చీపురు పుల్లలో నొకదానితో పైన కత్తిరించుకున్న కాగితాలను తీసికోవాలి. కాగితాలలోని గుండ్రని ప్రాంతాన్ని చీపురు పుల్లకు చుట్టివేయాలి. ఆ తరువాత కాగితాన్ని విప్పాలి. అప్పుడే పువ్వురేకు ఆకారం వస్తుంది. మనం 'ఫ్లవర్‌వేజు' తయారు చేసికొంటున్నాం కనుక, మధ్యలోని పువ్వు చాలా పెద్దదిగాను, ఆధారం గట్టిగాను ఉండాలి. అందుకోసం, పది, పన్నెండు అంగుళాలున్న పెద్ద పుల్లను ఒకదానిని తీసికొన్నా పరవాలేదు. దానికి ఆకు పచ్చని కాగితం అంటించివేస్తే, చాలా నాజూకుగా కనుపిస్తుంది.

మధ్యలో ఉన్న పెద్ద పువ్వు ఆకారానికి తగినట్లుగా మరికొన్ని చిన్న రంగు కాగితాలను అందంగా కత్తిరించాలి. ఆ తరువాత వాటిని మధ్యలోనించి పుల్లకు తగిలించి ఒక గుత్తిగా చేయాలి. పూలలోని కేశరాలను పోలివుండేందుకు పై విధంగా చిన్న కాగితాలను కత్తిరించవలెను.

ముందుగానే సిద్ధం చేసికొన్న కాగితం రేకులను ఇప్పుడు తీసికొని పైన తయారైన

# కాగితంపూలు చేసుకోడం హాబీగా చేసుకోండి

గుత్తికి తగిలించాలి. ముందు చిన్నవి తగిలించి, దారం చుట్టుకుంటూ, మనకు కావలసిన సైజు వచ్చే వరకు కాగితాల రేకులు చుట్టుతూనే ఉండాలి. ఈ కాగితాల రేకులను దగ్గర దగ్గరగా పెద్ద పువ్వుకు చుట్టటంతో అందమైన మరో పువ్వు తయారవుతుంది.

పెద్ద పువ్వు తయారయింది. పువ్వుయొక్క క్రింది భాగం ఖాళీగా ఉండకుండా, దానిని సన్నని, చిన్న సైజు కార్డు బోర్డుతో కప్పివేసి, అంటిస్తే, పై పూలరేకులు గట్టిగా ఉంటాయి.

చూడటానికి అందంగా కనుపిస్తుంది. ఈ క్రింది భాగాన్ని పచ్చ కాగితంతో చుట్టివేయాలి.

ఇక చిన్న పూలను తీసికోవాలి. వాటిని, చీపురు పుల్లకు అంటించే బదులుగా సన్నని తీగెకు గుచ్చాలి. తీగెకు గుచ్చటం వల్ల, ఎలా కావాలంటే, అలా వంచుకోటాని అవకాశం ఉంటుంది.

కాని ఒక విషయం మాత్రం గమనించాలి. ఒక్కో పూవురేకు ఒకే రంగును మాత్రమే కల్గి వుండాలి.

పూలు తయారుగా ఉన్నాయి గనుక ఇక ఆకులను లను తయారు చేయాలి. ఆకుపచ్చ కాగితం తీసి పైన చెప్పిన విధంగానే, మడతలు వేయాలి. మనం చేస్తున్న పూలకు అవసరమైన విధంగా, చిన్న పెద్ద ఆకులను పోలిన ముక్కలు కత్తిరించాలి. వీటికి వచ్చేందుకు తగిన మడతను ఏర్పరచాలి. అలాంటి మడతల కోసం :—

తరువాత "హనీకూంబ్ టవల్ (గరుకుచారలుండేది) నొకదాన్ని తీసికోవాలి. దానిమీద ఒక ఆకును ఉంచాలి. ఫోటోలో చూపిన విధంగా ఆ ఆకులు టవల్‌తో కప్పివేసి, దానిమీద అరచేతిని వుంచి, బాగా త్రిప్పాలి. అందువల్ల, "హనీకూంబ్" టవల్‌లోని నూలు మడతలు వెళ్లి కాగితపు ఆకుమీద పడగా, సన్నని మడతలు వస్తాయి. 'క్రేప్' మీద కాగితం యీ మడతలు రాగలుగుతాయి. అలానే, అన్ని ఆకులను తయారు చేసికోవాలి. ఇవి చిన్నవి గనుక అయితే, పూలకే అంటించివేస్తే సరిపోతుంది. అలాకాకుండా, యీ ఆకులు క్రోటన్స్ ఆకుల్లాగా పెద్దవే అయితే, తీగలకే అంటించటం మంచిది.

ఆకులు పూర్తి అయాక, వాటిమీద, పూలమీద వేర్వేరు రంగుల సిరా తీసికొని, చల్లితే, క్రోటన్స్ లాగా, అవి అందంగా కనపడతాయి.

తీగెలతో చేసిన పూలను, కాగితాల ఆకులను ఇప్పుడు మొదట్లో తయారుచేసుకున్న పెద్ద పువ్వుకు చుట్టాలి. అప్పుడే చక్కటి "ఫ్లవర్‌వేజ్" గుత్తి తయారవుతుంది. వీటిని రంగు రంగుల గ్లాసుల్లో పెట్టవచ్చును. కేవలం పూలనేకాక, ఇదే పద్ధతి ననుసరించి పూలతీగెలను కూడా చేయవచ్చును. ★





'క్రేప్ టిస్యూ' కాగితాన్ని తీసుకొని, వ్యాసంలో వివరించిన విధంగా మడతలు వేసి కత్తిరించుకోవాలి.



ఆ కత్తిరింపులను తీసికొని, గట్టిగావుండే చీపురుపుల్లకు మడతవేయాలి. చివరి వరకూ మడతలువేసిన తరువాత, ఆకాగితానికి 'రేకు'ల ఆకారం వచ్చే విధంగా విప్పాలి.



పూలు తయారుచెయ్యటం ఇప్పుడు ప్రారంభించాలి. క్రమేణా ఆకారం వస్తుంది.



పచ్చని కాగితంముక్కలను 'హనీకూంబ్' టవల్ మీదవుంచాలి. అందువల్ల, ఆకులకు చక్కని ఆకారం వస్తుంది.



కాగితంముక్కలను టవల్ మడతలోవుంచి ఎడమ అరచేతితో బాగా 'ఒత్తిడి' కలిగించాలి. అప్పుడు ఆకులరూపం వస్తుంది.



చివరికి పెద్ద పువ్వు తయారయింది.


ఎదురుచూడండి!

వనితాలోకంలో

ప్రత్యేక వ్యాసాల శీర్షిక!

హరికిషన్

## జరిగిన కథ

జానకిరాం ఎం. ఏ. పాసయినా ఉద్యోగం చెయ్యకపోవటం అతని భార్య గౌతమికే కాక తలిదండ్రులకు కూడా బాధ కలిగిస్తుంది. జానకిరాం అన్న కృష్ణమూర్తి జబ్బు మనిషి. అతని భార్య స్వాతి ఉద్యోగంచేసి ఇద్దరినీ పోషిస్తూ ఉంటుంది. స్వాతిని వివాహంచేసుకోవటంవల్లనే కృష్ణమూర్తి తలిదండ్రులకు దూరమవుతాడు. స్వాతి ట్యూషన్ చెప్పే తాసిల్దారుగారి కూతురు జ్యోతి మేనత్త కొడుకు మురహరి. తల్లిపోయిన తర్వాత జ్యోతిని పెళ్ళిచేసుకోనవలసిందని మేనమామ కేశవరావు మురహరితో చెబుతాడు. విశాఖపట్నంలో పరిచయం అయిన జయలక్ష్మి పట్ల ఆకర్షింపబడుతాడు మురహరి. గౌతమి కోపం వచ్చి పుట్టింటికి వెళ్లిపోతుంది. కాని అక్కడ తగిన ఆదరణ లభించదు. మురహరి జయలక్ష్మి సానుభూతికి చాలా సంతోషిస్తాడు. జానకిరాం తన అన్న కృష్ణమూర్తి యింటికి వెళ్తాడు. అన్నా, వదినెలు చాలా మంచివారని చెల్లెలితోనూ, తల్లితోనూ చెప్తాడు. స్వాతి విషయం తనవద్ద తేవద్దని తల్లి మండిపడుతుంది. నగేంద్ర బాల గౌతమికి తన కథ చెబుతుంది. పరిషత్తులో ప్రయోగించని వీణకు బహుమతి లభిస్తుంది. మురహరి జయలక్ష్మి పెళ్లి చేసికోనలేకపోతాడు. స్వాతి తాసిల్దారుగారింట్లో సమస్యలను ఎదుర్కొంటుంది. పుట్టింట్లో బాధల ననుభవిస్తున్న గౌతమి ఉద్యోగం చేయాలనే నిశ్చయానికి వస్తుంది. జయలక్ష్మి తన వైధవ్యపు గాథనంతా మురహరికి చెపుతుంది. తన ఇంటికి వచ్చిన జ్యోతిని, స్వాతి సముచితంగా సత్కరిస్తుంది. అస్వస్థుడైన మురహరికి, జయలక్ష్మి సేవలు చేస్తుంది. సెలవులివ్వగానే, ఇరువురూ స్వగ్రామాలు చేరుకొన్నా, ఒకరి నొకరు కలుసుకోలేకపోతారు... గౌతమి తాను చేసినపనికి చింతిస్తూ, భర్త జానకిరాంకు పుత్తరం వ్రాస్తుంది. అప్రయోజకుడై పోతున్నాడని, జానకిరాంను తండ్రి మందలిస్తాడు. జానకిరాం ఇంట్లో చెప్పకుండా వెళ్లి నగేంద్రబాలను కల్సుకొని ఆమె ద్వారా అన్ని విషయాలు తెల్సికొంటాడు. తనకు తానుగా గౌతమివస్తే స్వీకరించటానిక్కి సిద్ధంగా ఉన్నాననికూడా చెప్తాడు. జ్యోతి పుట్టినరోజు నాడు వాళ్ళ యింట్లో జరిగిన విందులో మురహరి జయలక్ష్మి ప్రేమించుకున్నట్లు చూచాయగా తెలుస్తుంది. జ్యోతి తల్లి స్వాతిని తనయింటికి రావద్దని పౌరుషంగా మాట్లాడుతుంది. బావ తన్ను ప్రేమించటం లేదనే విషయం స్పష్టంగా తెలిసిన జ్యోతి నిరాశతో మంచానపడుతుంది. డాక్టర్ టైఫాయిడ్ అని తేలుస్తాడు. మురహరిని పిల్చి స్వాతిని, జయలక్ష్మిని తన వద్దకు తీసికొని రమ్మని అర్థిస్తుంది.

# 32

స్వాతికి జ్వరం తగ్గలేదు. జ్వర తీవ్రతను మించి ఆమె మనస్సు దిగులుతో పరాభవంతో కొట్టుమిట్టులాడుతున్నది. ట్యూషన్లు లేవు, పంటు లేదు. మందు లేదు, ఆహారం లేదు. క్రమంగా శరీరం కృశించి పోతూనే ఉన్నది. ఇది వరకు కృష్ణమూర్తి ఆరోగ్యంలో ఏ మార్పు వచ్చినా ఆమె మనస్సు తల్లడిల్లి పోయెది. గుండెల్లో నొప్పిగా ఉన్నదంటే ఎంతో శ్రద్ధతో ఉపచారం చేసి, మనస్సుకు మాట పెట్టడానికి అనునయ వాక్యాలు చెప్పి, డాక్టరు చెప్పిన దానికి తగినట్లుగానే వేళకు మందిచ్చి, ఆహారమూ, పండ్ల రసమూ ఇచ్చి ఎంతో శ్రద్ధతోవెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండేది. ఇప్పుడు తనే మంచం దిగలేని స్థితికి వచ్చింది. కృష్ణమూర్తిని నేను ఈ స్థితికి తీసుకు వచ్చానా, నన్ను చేపట్టడంనుంచే ఎందుకూ పనికి రాకుండా అసమర్థునిలా, ఎవరూ పట్టించుకోని వ్యక్తిలా, జీవచ్ఛవంలా బతుకుతున్నాడా అని వాపోతుంది. ఒక వస్తువుని చెడగొట్టటం చాలా తేలికే. ఒక వస్తువును సృష్టించటం కొంచెం కష్టమైన పని. ఒక జీవితాన్ని నాశనం చెయ్యటం కూడా తేలికే. కాని ఆ నాశనమైన జీవితాన్ని, ఆ తరంలో బాగు చెయ్యటం కష్టసాధ్యం. వివాహం బాంధవ్యాన్ని కలుపుకోవాలి, బంధు కోటిలో పేరు ప్రతిష్ఠలు పొందాలి. ఫలాని వారి అమ్మాయి ఫలాని వారి కోడలని అంతా ఆనందంతో సంతోషంతో గౌరవ పురస్సరంగా చెప్పుకోవాలి. ఈ అమ్మాయి మా కోడలు అని అత్తగారు అమ్మలక్కలకు చూపించి మురిపించి, మురిసి పోవాలి. ఆ పిల్ల పొరుగిళ్ళకు వెళ్ళినప్పుడు ఫలాని వారి కోడలివా అమ్మా, ఫలాని అబ్బాయి భార్యవా అని గౌరవ మర్యాదలతో పలకరించాలి. పుట్టింటి వారు నీకేంతల్లి అల్లుడు ఎంతో మంచివాడు, ప్రయోజకుడు, సంపాదించి నిన్ను సుఖ పెట్టగలవాడు, నీ అత్తగారు మహాలక్ష్మి సమానురాలు. నిన్ను కడుపులో పెట్టుకుని కన్న కూతురులా ఆదరిస్తుంది. అని అనునయ వాక్యాలతో, సంతోష పరితప్త హృదయాలతో, ఆనంద బాష్పాలతో, హర్ష పులకాంకితులై అత్తవారింటికి కాపురానికి పంపించాలి. "మా కోడలు మా ఇల్లు మెట్టిన తరువాత మాకు చాలా కలిసొచ్చింది. మా వాడికి మంచి ఉద్యోగం దొరికింది. నిజంగా మా కోడలు మా ఇంటి మహాలక్ష్మిగానే వచ్చింది", అని మామ గారు పెద్దలతో చెప్పి సంతోషించాలి. ఆడ బిడ్డలు "మా వదినె, మా పెద్ద అన్నయ్య భార్య, మేమంటే ఎంతో అపేక్ష", అంటూ ఘనంగా చెప్పుకోవాలి.

ఆ తీరుగా ఆ వాతావరణంలో, అందరి ఆశీర్వచనాలతో కాపురానికి వెళ్ళి అందరితోనూ తలమానికంగా ఉంటంలోనే అత్తింటి కోడలుగా ఉన్న గృహిణికి ఘనత, గౌరవమూను.

కాని తనకా యోగ్యత ఈ జన్మలో లేదు. అలాంటి వాతావరణంలో వివాహమై తను కాపురానికి రాలేదు. అత్తవారిల్లు చూడ లేదు. అత్తమామలను ఆ ఇంటి కోడలుగా చూడ లేదు. మా పెద్ద కోడలని వారు చెప్పుకోలేదు. ఎవరూ, ఎప్పుడూ మాట్లాడుకోలేదు. అసలు తను ఆ ఇంటి కోడలిగానే పరిగణింప బడలేదు. మా కోడలు కాదు అనుకున్నారువారు. తమకూ వాళ్ళకు ఏమీ సంబంధం లేదన్నారు. భ్రష్టులుగా, వెలివేసిన వారినిగా, అగౌరవంగా ఈర్ష్య, క్రోధ దృష్టులతో చూడబడుతున్నారు.

ఈ జీవితంలో కాంక్షించినదీ అనుభవించినదీ ఏమీ లేదు. సర్వం వదలుకుని, సర్వ బంధువర్గాన్ని వదలుకుని, సర్వత్రా అగౌరవంగా చూడబడుతూ, సర్వేశ్వరుని దృష్టిలో ఇలాంటి నికృష్ట జీవితం గడపటం కూడా ఒక ఘనతేనా? మహనీయమైన మానవ జీవితానికి తమ వివాహం దాంపత్య జీవితం ఆదర్శనీయమైనదేనా? ఆ నాటి వివాహానికి వచ్చిన పెద్దలు ఈ వర్ణాంతర వివాహం ఎంతో ఆదర్శనీయమైందనీ, సాంఘిక జీవిత కట్టుబాట్లను వర్ణవ్యవస్థనూ సంఘటిత పరచి, పటిష్ఠం చేసిందనీ అన్నారు. సంస్కారవంతులైన యువతీ యువకులకు ఈ వివాహం మార్గదర్శకమన్నారు. కర్మిష్ఠులైన పెద్దల హృదయ కవాటాలు తెరిచి, సర్వ జనులూ ఒకటేననాని ఈ ఆదర్శ దంపతులు ఎలుగెత్తి చాటారన్నారు. పంచరత్నాలు చదివి తమ పాండిత్య ప్రకర్షను వెల్లడించుకున్నారు. ఆ నాటి వివాహ మహోత్సవ సందర్భమంతా పత్రికల వారు ప్రకటించారు. వధూవరుల పెళ్ళి ఫోటోలు పత్రికల్లో ప్రకటించి ఆదర్శ దంపతులుగా అభివర్ణించారు.

కాని నిత్యజీవితంలో, అనుభవంలోకి వచ్చేసరికి అంతా తారుమారయింది. వ్యతిరేక వాతావరణం ఏర్పడింది. పరిగణింపబడని దంపతులుగా ఈ పదేళ్ళా జీవితం గడిపారు.

ఈ జీవితమంతా చర్వితచరణం చేసుకుంది. స్వాతి. ఈ మహా యజ్ఞంలో సమున్నత స్థానం సంపాదించుకున్న సంస్కారప్రియులైన ఆదర్శ దంపతులుగా అందరూ ప్రశంసిస్తే, ఆచరణలో కొచ్చేసరికి యజ్ఞ పశువులే అయ్యారు.

కన్నీటితో దిండంతా తడిసింది. కడుపులోని వ్యథ అంతా కన్నీటి మయమే అయింది. కాని ఒక్క కోరిక మాత్రమే బలవత్తరంగా హృదయంలో హత్తుకు పోయి తిష్ట వేసింది. అత్త మామలకు పాదాభివందనం చేసి వారి ఆశీర్వచనం పొందాలి. మా పెద్ద కోడలు స్వాతి అని వారు చెప్పుకోవాలి. ఆ ఇంట్లో పెద్ద కోడలుగా కొద్ది కాలమైనా తిర గాలి. మా వదినె మా ఇంటికి వచ్చింది అని శ్రీలక్ష్మి సంతోషించాలి. ఇదే స్వాతి కోరిక, ఆకాంక్ష, మనో వ్యథ. ఈ మనోవ్యథతో కుమిలి పోతున్నది స్వాతి

ఆ సర్వేశ్వరుడు ఈ జీవితంలో నాకా వరాలను ప్రసాదిస్తాడా? నేనూ ఒక వ్యక్తిగా, గృహిణిగా, సంసార స్త్రీగా పరిగణింపబడతానా వారందరి దృష్టిలో?

అనుక్షణమూ ఈ ప్రశ్నలతోనే సతమతమై పోతూ, వ్యథతో కుమిలి పోతున్నది స్వాతి.

మగతగా కళ్ళు మూసుకు పడుకున్న స్వాతి కళ్ళు తెరచింది.

ఎదురుగా జానకిరాం, కృష్ణమూర్తి, మురహరి, జయలక్ష్మి కనిపించారు. అందర్నీ చూసి ఆశ్చర్యంతో లేని ఓపిక తెచ్చుకొని లేవబోయింది. జయలక్ష్మి సహాయంతో పక్క మీద కూర్చుంది స్వాతి.

"జ్యోతి రాలేదా మురహరి" అన్నది ఆదుర్దాగా.

"రాలేదు. ఆమెకు టైఫాయిడ్ జ్వరము" అన్నాడు మురహరి.

హతాశురాలైంది స్వాతి. మెల్లిగా పడుకుని అటువైపుకు తిరిగి కళ్ళు తుడ్చుకుంటూ "జ్యోతికి టైఫాయిడ్" అని ఆవేదనతో అనుకుంది మనస్సులో.

"వదినా" పిలిచింది జయలక్ష్మి.

ఇటు తిరిగి అందర్నీ చూసింది.

"జ్యోతికి ఎన్నాళ్ళనుంచి జ్వరం" అన్నది తడారిన నాలుక తడుపుకుంటూ స్వాతి.

"పుట్టింరోజు పండుగ అయిన మర్నాటినుంచి ప్రారంభమైంది. నాలుగు రోజులనాడే డాక్టరు టైఫాయిడ్‌గా తేల్చి చెప్పాడు" అన్నాడు మురహరి.

"పాపం, పిచ్చి పిల్ల, పిచ్చి వూహలతో గాలి మేడలు కట్టుకుంది. ఆ గాలి మేడలు తేలిపోగా, నా స్థితికే వచ్చిందన్న మాట" అన్నది మెల్లిగా.

"మీరు రాకపోవటం చేత చాలా బాధ పడుతున్నది. మిమ్మల్ని తీసుకురమ్మని పంపింది. మీరీ స్థితిలో ఉన్నట్లు జ్యోతికి తెలీదు" అన్నాడు మురహరి.

"అవును ఎట్లా తెలుస్తుంది, ఆమెను చూట్టానికి నాకూ సందర్భ పడలేదు. వారింటికి వెళ్ళినా ఇంక సందర్భ పడదేమో కూడా" అన్నది మనో వ్యథను మనస్సులోనే ఇముడ్చుకుని.

"నువ్వయినా వెళ్ళి చూశావా జయా" అన్నది.

"లేదు వదినా. వెళ్ళలేదు. ఇవ్వాళ వెళ్ళి చూస్తాను" అన్నది అభిమానంతో జయలక్ష్మి.

"అవును, వెళ్ళవని నాకూ తెలుసు. కాని నేను ప్రార్థిస్తాను నువ్వు వెళ్ళి జ్యోతిని చూసిరా జయా, నాకోసమైనా వెళ్ళిరా, నా మనస్సుకు సంతోషాన్నిచ్చే ఈ ఒక్క సహాయమైనా చెయ్యవా జయా" అంటూ ప్రాధేయపూర్వకంగా ఆమె చేతులు పట్టుకుంది.

## 33

జయలక్ష్మిని చూడంగానే వ్యథిత పీడితు రాలైన మనస్సుతో, రుద్ధపోయిన కంఠంతో కళ్ళప్పగించి చూస్తూ "వచ్చావా జయా, స్వాతివదిన నెను కూడా తీసుకురాలేకపోయావా" అని మనస్సు తనలో తనే "అవును ఇంక ఎందుకు వస్తుంది" అన్నది జ్యోతి. అందాలుచిందే ఆమె సోయగమంతా ఆమె ముఖంలోనే హరించిపోయింది. కాళ్ళూ, చేతులూ పుల్లలయిపోయినయ్యి. పొట్ట వీపుకు అతుక్కున్నట్లుగా ఉంది. కళ్ళు పీక్కుపోయి, చెంపలు గుంటలు పడ్డయ్యి. ఒక్కమాట మాట్లాడినా ఆయాసపడుతూ మాట్లాడుతున్నది. మందు దారి మందుది—రోగం దారి రోగంది.

ఈ కాలంలో వైద్యం కూడా అంతేవాసిగా ఉన్నది. ఫలాని రోగానికి ఫలాని మందని క్యాటలాగుచూసి మందులు వాడటంతప్ప రోగియొక్క జబ్బుని సమూలంగా తెల్సుకుని మందు ఇచ్చే వైద్యులు అరుదు.

జ్యోతి డాక్టరు కూడా టైఫాయిడ్ మందులూ, మాత్రలూ, ఇంజక్షన్లూ ఇస్తున్నాడు తప్ప మానసికంగా ఆమె బాధ ఏమిటో తెలుసుకోలేదు. మనిషి అంటే దేహమూ, ప్రాణమూ, ఊపిరితిత్తులే కాదు. మనస్సే మనిషి రోగానికి మూలము. అలాంటి మనస్సుని వదిలి మనిషిని పరీక్ష చేస్తే రోగాలు తగ్గటం కూడా అరుదైన విషయమే.

జ్యోతిని నిలువెల్లా ఒక్కసారి చూసి అప్రయత్నంగా బావురుమని, మళ్ళీ అదేం జరిగిందని అంటా అనుకుంటాగని పైట చెంగుతో నోరు మూసుకుని వచ్చే వెక్కుని ఆపుకుంది జయలక్ష్మి.

"జ్యోతి నువ్వు ఏనా జ్యోతివేనా, మరెవరైనా రోగిష్టిమారి పిల్లను తెచ్చి, ఇక్కడ పడుకోబెట్టి నాకు చూపిస్తున్నారా" అన్నది జయలక్ష్మి, జ్యోతి చేతులూ, కాళ్ళూ తడిమి చూస్తూ.



"అంత చిక్కిపోయానా జయా ! పోనీలే మనిషి జన్మ ఎత్తాక చిక్కకుండా, బలవకుండా ఉంటారా. అందులోనూ సన్నిపాత జ్వరంకదా" అన్నది మెల్లిగా.

"కాదు జ్యోతి ఇది జ్వరం కాదు, నాకు తెల్సు మనోవ్యాధి. దీనికి మందు లేదు. దానికే మా డాక్టరు టైఫాయిడ్ అన్నాడు. నాకు తెలుసు ఇది మనోవ్యాధ"ని అన్నది జయలక్ష్మి.

జ్యోతి దిగాలు పడి చూస్తున్నది. ఆమె మన

# ఎండమావులు

స్సులో సహస్రకోటి వ్యాకుల జ్వాలలు భగభగ మండు తున్నయ్యి. ఆ జ్వాలల వెలుగులో పసుపు బట్టలతో జయలక్ష్మి, మురహరి ఆ అగ్ని హోత్రం చుట్టూ సప్తపది తిరుగుతున్నట్లు లీలగా కనిపించారు.

"నాకు దిగులేమిటి జయా. నాకు దిగుల్లేదు. ఒక సుఖం వెనుక ఒక దుఃఖం ఉంటుంది. ఒక దుఃఖం వెనుక ఒక సుఖం కాచుకు కూర్చుంటుంది. మానవ జీవితమే అంత. అయినా నా వయస్సుకు నా జీవితంలో నేను ఏ కష్టాలనుభవించాను. ఎవరికి అన్యాయం చేశానని భగవంతుడు నన్ను పాప లోకానికి పంపుతాడు. పరిశుద్ధమైన మనస్సుతో పరితప్త హృదయంతో నువ్వూ మా మురహరి బావా ఒక ఇంటివాళ్ళు కావాలన్నదే నా కోరిక. ఈ కోరిక తీరితే నా మనస్సులోని ఆవేదన తగ్గినట్లే, నా జీవితం చరితార్థమైనట్లే. ప్రేమించని వారిని ప్రేమించుట అనేది ఆత్మ వంచనే అవుతుంది. నిన్ను మా బావ ప్రేమించాడు. మా బావను నువ్వు ప్రేమించావు. నేనూ ఉన్నానంటూ ఈ పరిస్థితుల్లో మా బావను నేను ప్రేమించటంలో అర్థమేమైనా ఉందా? అది ఆత్మవంచన కాదూ? ఆత్మద్రోహం చేసుకున్నట్లు కాదూ? ఏమంటావ్ జయా" అన్నది ఆయాసపడుతూనే.

జయలక్ష్మి నివ్వెర పోయింది. ఏం సమాధానం చెప్పటానికి తోచలేదు. దుఃఖాశ్రువులు మాత్రం జ్యోతి మీద పడకుండా ముఖం పక్కకు తిప్పుకుని కళ్ళు తుడ్చుకున్నది.

"నువ్వు విచార పడుతున్నావని నాకు తెల్సు జయా, ఎవరి మనస్సే వాళ్ళకు అద్దమువంటిది. సరే దానికేంగాని స్వాతి వదినె రాలేదేం. మురహరి వచ్చి చెప్పలేదా నేను రమ్మన్నానని." అన్నది.

అవమాన అఘాతంతో కృంగి పోయింది జయలక్ష్మి.

"జ్యోతి ఏం చెప్పేది, ఎట్లా చెప్పేది. స్వాతి వదినె కూడా నీ మాదిరే మంచాన అంటుకు పోయింది. ఆమె మనోవ్యాధి, ఎవ్వరూ తీర్చలేనిది. మనస్సు మంచిదయినా, వాక్కు మంచిదయినా నిష్కల్మషమైన హృదయురాలయినా జన్మతః ఆవిడ చేసుకున్న తప్పేదం ఆ పరమాత్ముడికే ఎరుక. ఇంత కాలం అంతా వెలి వేసినా ఓర్పుతో సహించాను. ఇంకా ఎంతకాలం నాకీ శిక్ష. నేను మా పెదనాన్నగారి కోడలిని కానా, నాకు ఆ ఇంట్లో వారి పాద సేవ చేస్తూ పడి ఉండే హక్కు లేదా, దాసీ దాని మీద చూపే ఆదరాభిమానాలు కూడా నా విషయంలో వారు చూప లేరా? జీవితాంతం ఇలాంటి ఏకాకి జీవితం గడపవలసిందేనా? నాకు నిష్కృతి లేదా? నన్ను వారింటి ఛాయలకు కూడా రానీయరా? అంటూ వాపోతున్నది స్వాతి వదినె. ఆమెను పీల్చి పిప్పి చేస్తున్న సమస్య, తహతహా, ఉద్వేగపూరితమైన కోరికా ఇదే" అన్నది జయలక్ష్మి.

జ్యోతి మూర్ఛపడి పోయిందిసూన్య దృక్కులతో చూస్తున్నది. ఏదో అనుమానం, అవమానం ఆమె మనస్సులోనుంచి, హృదయంలోనుంచి విస్ఫులింగాలుగా ఆమెఉచ్ఛ్వాస నిశ్వాసాల ద్వారాబయట పడుతున్నయ్యి. ఆ పరిస్థితి చూసి భయపడింది జయలక్ష్మి. "జ్యోతీ" అని పిల్చింది. "ఊ" అంటూ మూలిగింది జ్యోతి. వెంటనే లోపలికి వెళ్ళి జ్యోతి తల్లిని పిల్చుకొచ్చింది జయలక్ష్మి. తల్లివచ్చి జ్యోతి చేతులు రాస్తూ "ఏమిటమ్మా జ్యోతీ అట్లా ఉన్నావేం" అన్నది.

"ఎట్లా ఉన్నాను. నీ కళ్ళకు ఇట్లాగే ఉంటాను నన్ను ఇట్లా చేశావ్. స్వాతి వదినెను అట్లా చేశావ్, ఎందుకమ్మా మామీద ఇంత కక్ష"




మీ పాపకు సక్రమంగా
గ్రైమిక్స్ యివ్వండి
అతడు ఆరోగ్యంగా ఆనందంగా వుండేలా చూడండి
గ్రైమిక్స్ మీ పాప అవసరాలను దృష్టిలో పెట్టుకునే సున్నితమైన అతడి జీర్ణకోశాన్ని సరిగా వుంచుటకు. వాతము, శూలనొప్పి, అజీర్ణ వ్యాధులనుండి త్వరగా ఉపశమనము కలిగించుటకు ప్రత్యేకముగా తయారు చేయబడినది. పాలపళ్ల రోజుల్లోను, చనుపాలు మాన్పించే రోజుల్లోను కూడా మీ పాపను గ్రైమిక్స్ చిరునవ్వుతో ఉల్లాసంగా ఉంచుతుంది.
జ్ఞాపకముంచుకోండి—మీ పాప ఆరోగ్యం కొరకు సక్రమంగా గ్రైమిక్స్ యివ్వండి
గ్రైమిక్స్
బూట్స్ Boots వారిచే తయారుచేయబడింది మరియు లక్షలాది తల్లులచే నమ్మబడింది
NAS b87a

అన్నది కళ్ళు మూసుకుని తల్లి ముఖం చూడకుండానే.

"ఏమిటే ఈ మాటలు జ్యోతీ" అంటూ నౌకర్ని పిలిచి అయ్యగారిని పిల్చుకు రమ్మన్నది. ఈ లోగా జ్యోతి జయలక్ష్మితో "జయా. నువ్వు వెళ్ళి స్వాతి వదినెను చూడు. మా అమ్మ, నాన్నల తరఫున నేను వదినెను క్షమించమని వేడుకుంటున్నానని చెప్పు. వెళ్ళు త్వరగా" అంటూ జయలక్ష్మిని ఒక్క నెట్టు నెట్టింది. గుండెలు చిక్క బట్టుకొని వెళ్ళి పోయింది జయలక్ష్మి. జ్యోతికి సంధించింది. ఆ సమయంలో ఎక్కడలేని బలంకూడా వచ్చింది.

జయలక్ష్మి వెళ్ళేసరికి స్వాతి మంచం మీద అట్లాగే పడుకుంది. పక్క మీద కృష్ణమూర్తి కూర్చున్నాడు. ఎదురుగా కుర్చీలో జానకిరాం కూర్చున్నాడు. జయలక్ష్మిని చూస్తూనే "ఎట్లా ఉంది జ్యోతి" అన్నది ఆదుర్దాగా.

"ఎట్లా ఉన్నదని చెప్పను వదినా. శుష్కించి పోయింది. నీ మాదిరిగానే ఉంది. మంచానికి అంటుకు పోయింది." అన్నది జయలక్ష్మి కళ్ళు తుడ్చుకుంటూ.

ఒక్క సారి అదోలా జయలక్ష్మి వైపు చూస్తూ పిచ్చి నవ్వు నవ్వింది. ఆ నవ్వులో ఇద్దరి జీవిత వ్యధలు నిండి ఉన్నయ్యి. ఆ నవ్వులో నిరాశ, నిర్లిప్తతా లేదు. ఇంక మీరంతా ఏం చెయ్యగలరని సవాలు చేసినట్లుగా ఉన్నది. స్వాతి ముఖ కవళికలు, ఆ నవ్వూ చూసి జయలక్ష్మి కంపించిపోయింది.

"అవును జయా అనుకుంటూనే ఉన్నాను జ్యోతి మంచానికి అంటుకు పోతుందని. మనిషిని చులకనగా తీసి పారెయ్యవచ్చుగాని, మమతను తీసి పారెయ్యలేరు. ఒక్కో సమయంలో పరిస్థితుల ప్రాబల్యంవల్ల మమతను కూడా తీసి పారెయ్యవచ్చుగాని పురాకృత కర్మను తీసి పారెయ్యలేరు" అన్నది స్వాతి.

జయలక్ష్మి ఏమీ మాట్లాడలేక పోయింది.

"అవును జ్యోతి విషయం తేల్చేశాడు భగవంతుడు. ఆమె పరిస్థితి మనస్సూ నాకు తెలుసు. పోనీయండి" అంటూ జానకిరాం వైపు చూసి

"జానకిరాం, అత్త మామలూ, శ్రీలక్ష్మి నా కోరికను మన్నించలేదు కదూ" అన్నది తన అర చేతుల్లోని గీతల్ని చూసుకుంటూ.

"లేదు వదినా, వారిలో సాంప్రదాయ స్థిరమైన భావాలు కరుడు కట్టినయ్యి. వారి భావాలకు వెల్ల వేసి తెల్లగా చేసుకుంటున్నామని తృప్తి పడుతున్నారే గాని, అప్తులైన వారి మనస్సుల్లో అగ్ని రగిల్చి భగభగ మండేట్లు చేస్తున్నామని తెల్సుకోలేక పోయారు. ఈ పరిస్థితుల్లో వారు నిన్ను ఆదరించరు వదినా, ఆదరించరు" అన్నాడు జానకిరాం.

ఖిన్న వదనుడై స్వాతివైపు చూస్తూ కూర్చున్నాడు కృష్ణమూర్తి. అధైర్య పడ్డాడు. ఈ ప్రపంచంలో పుట్టి బుద్ధెరిగిం తరువాత ఇంత అధైర్యంగా అతనెప్పుడు ఉండలేదు. నేటి స్వాతి పరిస్థితే అతన్నింతగా కృంగ దీసింది.

ఆఖరుసారిగా అగ్ని పరీక్ష చేసుకుంది స్వాతి. ఈ అగ్ని పరీక్షలో శతకోటి దుఃఖాల అనుభూతులను దగ్ధం చేసి వేసింది. ఆ స్థితిలో అన్ని మమతలను, అన్ని కోరికలనూ దగ్ధం చేసి నిష్కళంక శుభ్రతర మూర్తిగా ప్రశాంతమైన వదనంతో అమాయకంగా అందర్నీ చూసింది.

ఆమె నరాల్లోని పటుత్వం తప్పి పోతున్నది. ఒక్క తృటిలో లేని చిత్త స్థైర్యం వచ్చి అవనత వదనమై కృష్ణమూర్తి వైపు చూసి అతని చేతులు తన గుండెల మీదికి తీసుకుంది.

"ఏమండీ, మన వివాహం శోభస్కరమైంది కాదూ, సాంఘిక విలువల గీటురాయికి వన్నె రానిది. అయినా పదేళ్ళు కాపురం చేశాము. గతమంతా ఒక జీవన్నాటకము మాత్రమే. ఆ నాటకాన్ని ఎవరూ హర్షించక పోయినా మనమే ఆ పాత్రలలో లీనమై నటించాము. నాటకం రసవత్తరంగా ఉన్నతరుణంలో ఎవ్వరూ హర్షించరేమా అని చూస్తే ఒక్క ప్రేక్షకుడు లేడు. ఆ జీవన్నాటకాన్ని మధ్యలోనే ఆపి వెయ్యాల్సొస్తున్నది. నాయకునిపాత్ర పోషణ ఇంకా ఉన్నా నాయకురాలు వేదిక మీదినుండి నిష్క్రమిస్తున్నది." అన్నది.

ఆమెలో ఇది వరకూ ఉన్న ఆత్మ విశ్వాసంనుంచి బయటపడినట్లుగా ఉన్నదామె ముఖ వర్చస్సు.

కృష్ణమూర్తి కన్నీటి బొట్లు సంతతధారగా ఆమె గుండెలమీద, చేతుల మీద పడసాగినయ్యి.

"ఏడుస్తున్నారా, తప్పు, మీరు విచారించ కూడదు. ఒక్క మాట" అంటూభర్త కళ్ళు తుడిచింది.

"ఈ స్వాతి ఎప్పుడూ ఎన్ని జన్మలకైనా మీదే. ఎన్ని జన్మలకైనా మీరే భర్తగా కావాలని నిండు హృదయంతో చెపుతున్నాను. మనమూ, మన జీవితాలు శాశ్వతం కాకపోయినా మన అంతరాత్మలు ఎప్పుడూ ఒకటిగానే ఉంటయ్యి. నా సహచర్యంవల్ల మీరు అనుభవించింది ఏమీ లేదు. చివరికి ఒక్క మనో వ్యధ మాత్రమే మిగిలింది. తల్లితండ్రుల్లోనుంచి , బంధు వర్గంలోనుంచి మిమ్మల్ని విడదీశాను. అజ్ఞాతవాసం చేయించిన అజ్ఞానురాలిని. ఈ శాపం నన్ను శపించి దగ్ధం చెయ్యక ఏం చేస్తుంది.? మీ చేతుల్లో, అమృత హృదయుడైన నా మరిది జానకిరాం సమక్షంలో వెళ్ళి పోతున్నాను. ఒక్క మాట. అత్తయ్యనీ, మామగార్నీ, శ్రీలక్ష్మినీ అందర్నీ క్షమించమని మనసార ప్రార్థించానని చెప్పండి వారి మీద ఈ నాటికీ గౌరవమూ, భక్తి భావమూ తప్ప నాకే దురభిప్రాయమూ లేదు. మనుష్యులు దూరమైనా వారి ఆశీర్వచనం నాకెప్పుడు ఉండనే ఉంది. పండువంటి వంశంలో చీడ పురుగులా ప్రవేశించినా నన్ను వారెవరూ నలిపి చంపి వేయలేదు.. ఇది వారి ఆశీర్వచనమే కదా" అన్నది.

అంతా నిశ్శబ్దంగా వింటున్నారు. ఆమె ప్రణయ నివేదనను వింటూ పిచ్చివాడుగా, అరవై ఏళ్ళు పైబడిన వృద్ధ మూర్తిలా అచేతనుడై కూర్చున్నాడు కృష్ణమూర్తి.

జయలక్ష్మి "ఇప్పుడే వస్తాను వదినా" అంటూనే సమాధానం కోసం ఆగకుండానే వెళ్ళి పోయింది.

"స్వాతియందు వారికి ఇష్టత లేకపోవచ్చు. స్వాతితో వారు మాట్లాట్టానికి ఇష్టపడక పోవచ్చు. స్వాతి శవం వారినేమీ చెయ్యలేదు కదా భౌతిక కాయంమీదనైనా వారికి కోపం లేకుండా ఉంటే నా ఆత్మ సంతోషిస్తుంది. దహన సంస్కారాలైనా శాస్త్రోక్తంగా చేయిస్తారు కదూ, లేకపోతే నా శవాన్ని కుక్కలు నక్కలు పీక్కుతింటూంటే మీ హృదయం ఆక్రోశించదూ" అన్నది స్వాతి.

"వదినా ఏం మాటలవి. నువ్వు పోవు, మమ్మల్ని వదలి ఎక్కడికి వెళతావు. నీ జబ్బు తగ్గి నువ్వు మళ్ళీ మాలో తిరుగుతావనే నా ధృఢనమ్మకం. ఈ అప్పగింతలన్నీ ఎందుకు చేస్తున్నావో నాకు తెలీటం లేదు." అన్నాడు జానకిరాం స్వాతి వైపు చూస్తూ.

స్వాతి పేలవంగా నవ్వింది.

"నాకు పిలుపు వచ్చింది జానకిరాం. ఇంక వెళ్ళాలి. అత్తవారింటికి వెళ్ళలేక పోయినా పరమాత్ముని సన్నిధికైనా వెళ్ళొద్దూ! నా పిచ్చిగాని పరమాత్ముని సన్నిధికి మాత్రం రానిస్తారా! యమచర అనుభవించొద్దూ" అన్నది.

జానకిరాం కళ్ళు చెమ్మగిలినయ్యి.

50 వ పేజీ చూడండి



# వేట

పాలడుగు వెంకటేశ్వరరావు

అడవిలోంచి జీపు పాములాగా పరుగెడుతున్నది సన్నటి కాలిబాట వెంట. పైన ఆకాశంలో చంద్రుడు వెన్నెల విరజిమ్ముతున్నాడు. చంద్రం మనస్సు మరింత ఉల్లాసంగా ఉన్నది. సన్నటి గాలికి చెట్ల ఆకులు సన్నగా తల వూపుతున్నాయి. వెన్నెల జల్లులు సందుల్నించి నేలమీద పడి అందమయిన తివాచీ మీద డిజైన్లలా ఉన్నాయి. దూరంగా పర్వత లోయల్లోనించి వచ్చే అస్పష్ట ధ్వనులు మినహా అంతా నిశ్శబ్దంగా ఉంది. పైన 'కాన్వాసు' గుడ్డలోంచి దూసుకుని వచ్చిన వెన్నెల చిరుపులు తార కపోలాల మీద ప్రతిఫలించి తిరిగి వెనక్కి పోతున్నాయి.

జీపు ఏటి గట్టు దిగి కాలిదారి వెంబడి లోయ లోనికి దిగింది. "వేగం కొంచెం తగ్గించి ఒక లైటు తీసేయండి. ఇక్కణ్నించి కొంచెం జాగ్రత్తగా ఉండాలి" కాలి బాటని శ్రద్ధగా పరిశీలిస్తూ అంది తార. ఒక వైపు లైట్లు తీసేశాడు చంద్రం. "నీ మాటల్ని బట్టి నువ్వు ఇదివరకు చాలాసార్లు చూసినట్లున్నావు వేటని." నవ్వాడు చంద్రం "వేట అంటే వారికి మరీ ఇష్టం. నాకు పెద్ద ఇది లేదు గాని ఆనందించగలను." తార పెద్ద కళ్లు అందంగా మెరిశాయి. "డిన్నర్ తరవాత వేట ఉంది. తప్పకుండా రమ్మన్నాడు నాగభూషణం. సరేనని ఒప్పుకున్నాను." చంద్రం నవ్వాడు. రోడ్డు మీద నిద్రపోతున్న చెవుల పిల్లులు జీపు ధ్వనికి బాటకి అటూ ఇటూ పరుగులు తీస్తున్నాయి. జీపు కొండ ఎక్కుతుండగా ఒక చోట కోడెత్రాచు ఒకటి అకస్మాత్తుగా బుస కొట్టి నిలబడి తల పైకెత్తింది జీపు ఆపాడు చంద్రం.

పాము తలవంచి జరజరా ప్రక్కకి వెళ్ళి పోయింది. జీపు కదిలింది.

మరో పావు గంటకి జీపు గమ్యస్థానం చేరింది.

* * *

జీపు ధ్వనికి బంగళాలోనించి ఇద్దరు నౌకర్లు పరుగెత్తుకొని వచ్చారు. వెనక నుంచి పళ్ళ బుట్టలూ, సీసాలూ తీసి లోపలికి చేరవేశాడు. చంద్రం తను ముందుదిగి తారకి చేయి అందించాడు. ఇద్దరూ నడుచుకుంటూ వెళ్ళారు. వరండాలో సోఫాలో నాగభూషణం సిగరెట్టు కాల్చుకుంటూ ఆకాశం వంక చూస్తున్నాడు. "గుడ్ ! సమయానికే వచ్చాడు. త్రోవలో ఎక్కడా ఇబ్బంది లేదుగదా !" నవ్వుతూ ఇద్దర్నీ పరామర్శించాడు నాగభూషణం. "ఇంత వరకూ ఏమీ క్రూర మృగాలు మా జోలికి రాలేదు." నవ్వాడు చంద్రం.

"ఇంకా భోజనం సిద్ధం కాలేదు. కాస్సేపు చదరంగం ఆడుదామా ?" అని బల్ల సర్దాడు నాగభూషణం. తారలోపలికి వెళ్ళిపోయింది. ఆటలో చంద్రాన్ని తీసి కట్టు చేయాలని శతవిధాల ఎత్తులు వేశాడు నాగభూషణం. కాని ఆడిన నాలుగు పందేల్లోనూ తనే తీసి కట్టయాడు. విసిగి, అదిమాని సిగరెట్లు కాల్చుకుంటూ కబుర్లు చెప్పుకున్నారు కాసేపు.

టైము పదింపావయింది. వంటయిందని కబురు వచ్చింది. ఇద్దరూ లేచి వెళ్ళారు. అప్పటికి తార మొహం కడుక్కుని డ్రెస్ మార్చుకుని వచ్చింది. డైనింగ్ టేబులు మీద తెల్లటి గుడ్డ పరిచారు. అందమయిన "చైనా క్రోకరీ" వెన్నెల్లో మెరుస్తోంది అందంగా అమర్చబడి.

"మీకు వేట ఇదే ప్రథమం అనుకుంటాను." అన్నాడు నాగభూషణం. "అవును. ఇది వరకు ఎప్పుడూ చూడలేదు. ఆడలేదు కూడా." నవ్వాడు చంద్రం. "నేను నమ్మను" అంది తార వంకరగా నవ్వుతూ. భోజనం అవుతున్నంతసేపూ ఏదో చెబుతూనే ఉన్నాడు నాగభూషణం. భోజనం ముగించి పానీయాలు పుచ్చుకున్నారు. నాగ భూషణం బాగా తాగాడు. "ఇక్కడికి నాలుగు మైళ్ళ దూరంలో టైగర్ వాలీ ఉంది. మంచె అదీ ముందు సిద్ధం చేసుకుని ఈ పాటికల్లా మనం అక్కడికి చేరుకుని ఉంటే ఈ రాత్రి తప్పకుండా ఏదో ఒకటి పడేదే ననుకోండి. అయినా మనది డైరెక్టు ఫైట్. పడితే పడుతుంది. లేకపోతే కనీసం రాత్రివేళ "వైల్డ్ లైఫ్" ఎలా ఉంటుందో చూసి రావచ్చు. మీ దగ్గర బేటరీ లైటు ఉందిగా ?" నాగభూషణం చెప్పుకు పోతున్నాడు. "ఒకసారి ఏమయిందో తెలుసా. జీపు మీద నేనూ నా మిత్రుడూ అర్ధరాత్రి పని మీద వెడుతున్నాము అడివిలోంచి. చాలా చోట్ల బాట మలుపులు తిరిగి ఉంది. అక్కడికీ జీపు మెల్లిగానే పోనిస్తున్నాము. నేను ఏదో ఆలోచిస్తున్నాను. ఇంతలో జీపు ఆగిపోయింది. నా వీపు తట్టి నా మిత్రుడు వణికి పోతున్నాడు. ఎదురుగా "హెడ్‌లైట్" కాంతిలో బాటకి అడ్డంగా రెండు చిరుత పులులు నుంచుని ఉన్నాయి. రెండూ జీపు వంకే తీక్షణంగా చూస్తున్నాయి. తుపాకీ ఎప్పుడూ నాతోనే ఉంటుంది, ఎక్కడి కెళ్ళినా! అది మీకు తెలుసు గదా !

"నేను మెల్లిగా తుపాకి తీసి గురిచూసి కాల్చాను. గురితప్పి ఒక దాని వెనుక కాలికి తగిలింది. భీకరంగా అరుస్తూ రోడ్డు ప్రక్కన పడి పోయింది. మళ్ళీ కాల్చటానికి ప్రయత్నించాను. ఆశ్చర్యం ! తూటాలు అయి పోయాయి. అశ్రద్ధ వలన చూడలేదు. సహజంగా దెబ్బతిన్న ఆ చిరుత మా పైకి లంఘించి ఉండాలిసి ఉంది. కాని మా అదృష్టమో ఏమో రెండూ అడవిలోకి దూసుకు పోయాయి. ఇంకా ఆగితే ప్రమాదం తెచ్చుకొన్నట్లు అవుతుందేమోనని నేను జీపు పోనిమ్మని నా మిత్రునికి చెప్పాను. అదే చాలన్నట్లు అతడు 'స్టార్టు' చేసి వేగంగా పోనిచ్చాడు."

గాఢంగా నిట్టూర్చి చంద్రం అన్నాడు. "ఆ పరిస్థితిలో అవి తిరగబడి నట్లయితే ఏం చేసేవారు ?" "చేసేదేముంది దైవం మీద భారం వేయటం తప్ప ?" అని నవ్వాడు నాగభూషణం. "అన్నట్లు ఈ గొడవలో నేను మరచేపోయాను. మనం బయలు దేరవద్దూ ?" అని లేచాడు నాగభూషణం

"ఈసారయినా తూటాలు ఉన్నవో లేవో చూశారా ?" నవ్వింది తార. "ఒకటి రెండు సార్లు చూశాను. అంతారెడీ. నేనూ, రాంసింగూ ముందుదారి తీస్తాము. మీరు మా వెనుకనే రండి. జాగ్రత్త ! అంతా రెడీయేగా ?" ముగ్గురూ లేచారు. అవతల జీపుల దగ్గర రాంసింగ్ ఎదురు చూస్తున్నాడు వీళ్ళ కోసరం.

* * *

జీపులు రెండూ బయలు దేరాయి. నాగభూషణం, రాంసింగూ, ముందు జీపులో ఎక్కారు. చంద్రం, తార ఇద్దరూ రెండోదాన్లో కూర్చున్నారు. రెండు జీపులూ కొండదిగి లోయలోనికి ప్రవేశించాయి. ఓ పావుగంట తరవాత ముందు జీపు వేగంగా దూసుకుని పోతున్నది అడివికి.

"వేగంగా పోనివ్వండి." హెచ్చరించింది తార. నవ్వాడు చంద్రం. "ఈ లోయల్లో ముందూ వెనకా చూడకుండా పోతే ప్రమాదం తారా ?

"అది సరేగాని, ఈ రాత్రి నువ్వు ఎంత అందంగా ఉన్నావు తారా !" "నేనేనా ? ఈ రాత్రి కూడానా?" నవ్వింది తార. "రెండూనూ.... కాదు అంతానూ" ఆమె భుజం వెనుకగా చెయ్యి పోనిచ్చాడు చంద్రం "మత్తెక్కిన కళ్ళకి అంతా అలాగే ఉంటుంది." అంది తార అతని చేతిని తొలగిస్తూ" "బాగా అన్నావు. అది సరే గాని ఇన్నాళ్ళూ నన్నొదిలి ఎలా ఉండ గలిగావు తారా ? అసలు ఈ రాత్రి ఇక్కడికి రావటానికి ఎందుకొప్పుకున్నానో తెలుసా ? నీ కోసమే."

తార నవ్వింది. ఆ నవ్వుకి అర్థాలు అనేకం.

"నాగ భూషణంతో ఎలా ఉన్నావు ఇన్నాళ్ళూ? నువ్వు ఇన్నాళ్ళూ నా మనస్సంతా ఆక్రమించి నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నావు" తార నిశ్చలంగా వెన్నెల్లోకి చూస్తోంది. "నువ్వు నాకు దక్కనందున విరక్తి చెందాను మొదట్లో, కొన్నాళ్ళు పిచ్చిగా తిరిగాను. ఏదో యాంత్రికంగా బలవంతంగా చదువు పూర్తిచేసి ఉద్యోగంలో చేరాను. అదృష్టం కలిసి వచ్చి ఈ నాటికి పెద్ద ఆఫీసరు నయ్యాను. ఇప్పటికీ నాకు పెళ్ళి చేసుకోవాలని ఎవరితోనో సంసారం చెయ్యాలనీ ఆశలేదు. కారణం ఏమిటో నీకు తెలుసుగదా ! నా ఉద్యోగం సంపాదన, హోదా.... ఎవరికి కోసం ? ఎవరిని ఆనందింప చేయటానికి ? ఆలోచిస్తే నాకు పిచ్చెక్కుతుంది. ఇప్పటికీ మించి పోయిందేమీ లేదు. నాగభూషణం ఆర్థిక పరిస్థితులు నీకు తెలుసా ? వ్యాపార విషయాలు నీతో మాట్లాడుతాడా ? మీ ఇద్దరూ అన్యోన్యంగా ఉంటారా ?" ఉద్వేగంగా తారవంక చూశాడు చంద్రం.

తల అడ్డంగా వూపింది తార.

"నాకు తెలుసు తారా ? నువ్వు సుఖపడటం లేదు. నాగభూషణం బాగా మారిపోయాడు ఈ మధ్య. అతనికి మన సంగతి తెలిసింది. అతడు నిన్ను సరిగా చూడటంలేదు. నీ పెదిమలపై విరిసే హాసానికి మనస్సులో పునాది లేదు. నువ్వు దుఃఖాన్నీ, అశాంతినీ కప్పెట్టడానికి సంతోషాన్నీ,

ఉల్లాసాన్ని నటిస్తున్నావు. నీ హృదయంలో అగ్ని గోళాలు రగులుతున్నాయి. నాగభూషణం అను మానపు కళ్ళు నిన్ను పరీక్షిస్తున్నాయి. అస్తమానూ అతను రోజా నిన్ను వేటాడుతున్నాడు చాటుగా. ఇందాక నిన్ను నా జీపులో రమ్మని చెప్పటంలో ఆంతర్య మేమిటి ? ఇప్పుడు తను రాంసింగ్ జీపులో కూర్చోవట మెందుకు ? అతను మన ఇద్దర్నీ పరీక్షిస్తున్నాడు తారా ! దాని పర్యవసానమేమిటో నాకు తెలియటం లేదు.

"నీ మనస్సు సున్నిత మయినది. నువ్వు ఈ బాధని భరించలేవు. నాతో వచ్చేసెయ్యి తారా ? అతని నుండి నేను నిన్ను కాపాడుతాను నా మనస్సనే పువ్వుల్లో నిన్ను పూజిస్తాను." చంద్రం జీపు ఆపి తార వంక చూశాడు. వెన్నెల్లో మెరిసిన బుగ్గల మీద కన్నీరు చూసి అదిరి పడ్డాడు చంద్రం. ఆమె కన్నీటిని కొన గోటితో తుడిచి బుజ్జగించాడు. ఆమెను మృదువుగా కౌగలించుకో బోయాడు. తార అతని చేతుల్ని దూరంగా తోసి జీపు పోనిమ్మన్నట్లు సైగ చేసింది.

"ముందు ఈ సంగతి చెప్పు తారా ! నువ్వు అతని బాధని భరించలేవు. నేను చూడలేను. నాగభూషణం పైకి కనిపించేటంత సౌమ్యుడు కాదని నీకు తెలుసు. అతనితో జరిగిన నీ రిజిష్టర్ మ్యారేజి గడువు పూర్తయిందన్నావుగా మొన్నటితో ? ఇంక అతని నుండి వచ్చేయటానికి పెద్ద ప్రతిబంధకం ఏమీ లేదు. పైగా అతని ఆర్థిక పరిస్థితులు ఇప్పుడు బాగా చెడిపోయాయి. ఈ మధ్య చేపట్టిన నాలుగు పెద్ద కంట్రాక్టులూ అతనికి నష్టం తెచ్చిపెట్టాయి. ఇప్పుడు ఈ రాత్రి అతను నాకు ఇచ్చిన డిన్నర్ ఎందుకో నేను వూహించ లేకుండా ఉన్నాను. ఏమయినా నాగభూషణం చిత్రమయిన మనిషి.

"నన్ను త్రోసి రాజని నాగభూషణాన్ని వివాహం చేసుకున్నావని నేను బాధ పడటంలేదు తారా ? నీ మీద కోపం కూడా లేదు. నీ మీది నా ప్రేమ అచంచల మయింది. దానికి తిరుగులేదు. నాకు తెలుసు. పదేళ్ళ క్రితం నీ మనస్సు స్థిరం లేకుండా పరుగులు తీసేది. మంచీ చెడూ తెలియ చెప్పటానికి వెనక ఎవరూ లేరు. నీ కాలేజి చదువు పూర్తవటమూ ఒక్కగా నొక్క ప్రేమ మయుడయిన నీ తండ్రి అప్పుడే మరణించటమూ, తొందరపాటువలన నువ్వు నన్ను కాదని నాగభూషణాన్ని వివాహం చేసుకోవటం అంతా దైవికం. అప్పటి నీ మనస్సు కొండలలో ఎగిరెగిరి పడే నదిలాటిది. ఈ పదేళ్ళలోనూ, జీవితంలో ఆటూ పోటూ తగిలి నీ మనస్సు కొక్క నిశ్చలత ఏర్పడింది. నాగభూషణం నీ శరీరాన్ని వాంఛించాడు. నీ హృదయం అతనికి అవసరం లేదు. నాకు నీ మనస్సు కావాలి. నా మనస్సు ఎప్పుడో నీ కిచ్చేశాను. ఇక నయినా నా దగ్గరికి వచ్చేసి నాకు, శాంతిని ప్రసాదించు తారా ! ఆత్మీయతా, అనురాగమూ లేని సంసారం అగ్ని గుండంతో సమానం సుమా" ఆవేదనతో చంద్రానికి కన్నీరు జలజలా రాలింది. జీపు జంక్షన్ దగ్గరికి వచ్చి ఆగింది. అక్కణ్ణించి మూడుదారులు చీలాయి. ఒకటి పట్నానికి, రెండవది ఇంకొక దారిని ఇందాక బయలుదేరిన బంగళాకీ, మూడోవది క్రింది లోయలోనికీ వెడతాయి. ఏదో ఒకటి తేల్చుకోవాలనే నిశ్చయంలో ఉన్నాడతను. "ఇందాకటి నుంచి ఒక్కడినే మాట్లాడుతున్నాను. నా మనసులో ఉన్న సంగతి నీకు వివరించాను. ఇప్పుడు నేను నిర్ణయించుకున్నాను తారా ! నువ్వు లేనిదే నేను బ్రతకలేను. నీ అంగీకారమో అనంగీకారమో ఇప్పుడు చెప్పాలి. ఇంకా ఆశ నన్ను వదిలి పోలేదు. లేకపోతే ఇది చూడు." అని జేబులోంచి ఎర్ర కాగితపు పొట్లం బయటకు తీసాడు చంద్రం. "ఇది సైనైడు. రెండు నిముషాలు చాలు." కంగారుగా అతని చేతుల్లోంచి ఆ పొట్లం లాక్కొనటానికి ప్రయత్నించింది తార. "ఇప్పుడే అంత ప్రమాదం తలపెట్టనులే. రేపు తెలుస్తుంది నీకు దీని ఫలితం." పొట్లాన్ని జేబులో పెట్టాడు. చంద్రం పిచ్చిగా నవ్వుతూ.

" నీ మౌనం నన్ను వేధిస్తున్నది తారా ! నా మాటలకు అంగీకరించావా ? ఇంత కాలం నుంచి నేను చేసిన తపస్సు, నా నిరీక్షణ ఫలించాయనుకోనా ? నువ్వు ఒప్పుకొన్నట్లే గదా ? నీ మౌనాన్ని అంగీకారంగా తీసుకోనా ? ఇప్పుడే జీపుని సరాసరి పట్టణానికి మన ఇంటికి పోనిస్తున్నాను. నీ నిర్ణయం తెలియచెయ్యి." తార వైపు చూశాడు చంద్రం. ఆమె ఆలోచిస్తూ అలాగే కూర్చున్నది. అతను వంగి ఆమె పెదిమలను మృదువుగా ముద్దు పెట్టుకున్నాడు. ఆమె అతని నుండి తప్పించుకొనటానికి ప్రయత్నించలేదు. కాని ఆమె శరీరం ఒక్క క్షణం పాటు ఉలిక్కిపడటం అతడు పసిగట్టాడు. కారణం తెలుసుకోటానికి అతను ఆసక్తి చూపలేదు.



# వేట

"ఇప్పుడు తిన్నగా మన ఇంటికే వెడుతున్నాము. ఏమయినా మాట్లాడవలసి వస్తే నాగభూషణంతో నేను మాట్లాడి సరి చేస్తాను. సరేనా ?" జీపు వేగంగా బయలుదేరింది వెన్నెలను చూసుకుంటూ. ఇప్పుడు చంద్రం ఒక చెయ్యి ఆమె భుజాల వెనకగా వేసి కారు నడుపుతున్నాడు. చలిగాలి చెవుల్ని చూసుకు పోతోంది. ముందు వెడుతున్న జీపు అడవిలో కనపడకుండాపోయి మువ్పావుగంటయింది. వేటని దక్కించుకొని ఉత్సాహంతో ఉరకలు వేడుతున్న వేటగాడిలా ఉల్లాసంగా సిగరెట్టు కాలుస్తున్నాడు చంద్రం.

*　　　*　　　*

అకస్మాత్తుగా జీపు కొండఎక్కి బాట చివరి వరకు వచ్చి ఆగిపోయింది. దిగి చూస్తే అది బంగళా. భోజనాలు చేసి ఎక్కణ్ణించి అయితే బయలుదేరారో అదే బంగళాకి తిరిగి వచ్చారన్న మాట ! "దారి తప్పి తిరిగి బయలుదేరిన చోటికే వచ్చాము. వాళ్ళ జీపు ఇంకా వచ్చి ఉండదు. లోపల నీ సామానేమయినా ఉందా ? నా కోటు మరచి పోయాను. తీసుకుని వస్తాను. జస్ట్ ఒక్క నిముషం." అని బంగళాకేసి నడిచాడు చంద్రం. వరండాలో నౌకర్లు నిదురపోతున్నారు. హాలులో దీపాలు వెలుగుతున్నాయి. నాగభూషణం కూర్చుని తుపాకిని శుభ్రంగా తుడుస్తున్నాడు తాపీగా ! తలవంచుకుని.

చంద్రానికి ఆశ్చర్యం వేసింది. "అరె ! మీరెప్పుడు వచ్చారు ? రాంసింగ్ ఏడి ?" ఎదురుగా కూర్చుంటూ అడిగాడు. "వచ్చారా ? వస్తారని నాకు తెలుసనుకో. అతన్ని పనిమీద పంపించాను లే. రాత్రిలోగా మనం మాటలు పూర్తి చేసుకో వచ్చును. తార ఏది ? జీపులోనే ఉందా ? గుడ్ ! నీ ఓవర్‌కోటు ఇదిగో. తీసుకుని అల్లా కూర్చో. చంద్రం !" నాగభూషణం కళ్ళు ఎర్రగా జ్యోతులా మెరుస్తున్నాయి. "మనమిలా వచ్చామంటే అడ్డదారిని. ఎందుకో వచ్చేదామనిపించింది. అంతే." "మేము వెళ్తాము. ఇప్పుడు నీ మనస్సు సరిగా లేదు. తరవాత మాట్లాడుకో వచ్చును." చంద్రం లేవబోయాడు. "కాదు కాదు. నేను సరిగానే ఉన్నాను. మనం మాట్లాడుకోవటానికి ఇదే మంచి సమయం. తారను గురించనుకుంటున్నావా ? పిచ్చివాడా ! ఆ సంగతి నేను ఎప్పుడో తేల్చేశాను. ఆ విషయంలో నా నుంచి నీకు ఏ బాధా ఉండదు. మనం మనుష్యుల్ని కట్టేయగలం కాని మారే మనసుల్ని బంధించ గలమా ?" చంద్రం మనస్సు ఆశ్చర్యంతో నిండి పోయింది. అతను ఇంత తేలిగ్గా వదులుతాడనుకోలేదు. "తార విషయం నువ్వు తెలిసే మాట్లాడుతున్నావా ? నాగభూషణం?" ఆశ్చర్యంగా అడిగాడు చంద్రం "పిచ్చివాడా ! నాకు అన్నీ తెలుసు ! తాడును తెగేదాకా లాగే స్వభావం గాదు నాది. నేను తార గురించి బాధ పడటంలేదు. ఇప్పుడు నీతో కావలసిన పని నాకు ఒకటుంది. అది అయితే ఇక మీ మార్గం నిష్కంటకమే ననుకోవచ్చును."

"నాతో కావల్సిన పనా ?" ఆశ్చర్యం ప్రకటించాడు చంద్రం. "తిన్నగా అసలు విషయమే మాట్లాడుదాము. అవును. నీతోనే కావాలి. ప్రస్తుతం నా సంగతి నీకు తెలుసు. ఆర్థికంగా బాగా చితికి పోయాను. కంట్రాక్టుల్లో బాగా పడిపోయాను. ఇప్పుడు నువ్వు చేయూత నిస్తేనే గాని నిలద్రొక్కు కొనలేదు. లేకపోతే నా పని బజారున పడటమే అవుతుంది. ముఖ్యులయిన ఇద్దరు మార్వాడీ అప్పుల వాళ్ళు 'డిక్రీ' తెచ్చారు, నా మీద రెండు రోజుల క్రితం. ఇప్పుడు ఒక లక్ష రూపాయలకి నువ్వు సాయం చేశావా ? నేను ఒడ్డున పడతాను. ఇవాళ మనం ఇక్కడ కలవటంలో ముఖ్యోద్దేశం ఇదే"

"లక్ష రూపాయలా ? నేనా ? ఎక్కణ్ణుంచి తెచ్చి ఇవ్వగలను ? ఎట్లా ?" చంద్రం భయంతో వణికి పోతున్నాడు.

"ఎట్లాగంటావా ? అది నేను చెబుతాను. నువ్వు కష్టపడక్కర్లేదు, పిచ్చివాడా ? అంత భయపడుతావు దేనికి ? చాలా సులభమయిన విషయమిది."

---

పసిపిల్లవాడు: అమ్మా, భూమి మీదకి దేవతలు ఎప్పుడయినా వస్తారా? వస్తే, తిరిగి ఎగిరి పోతారా ?

తల్లి: వచ్చి, ఎగిరిపోతుంటారు బాబూ! ఎందుకలా అడిగావ్!

పిల్లవాడు: మరేమో, నిన్న నాన్నగారు మన ఇంట్లో పని మనిషితో "నువ్వు దేవత"వి అంటున్నారు...

తల్లి: ఓహో! అలాగా!... ఆ పనిమనిషి, త్వరలోనే ఎగిరి పోతుందిలే.

శంకర్రావు (విశాఖపట్నం)

---

నాగభూషణం వంగి బాగ్‌లోంచి కొన్ని కాగితాలు బయటికి తీశాడు.

"ప్రస్తుతం ఈ అడివంతా నీ అధికారం క్రింద ఉంది. వచ్చి తనిఖీ చేసి నిన్ను ప్రశ్నించే వాళ్ళు లేరు. ఇరవై వేల టన్నుల కలప కొట్టి లాట్లు కంటించిన పనికి సంబంధించిన అగ్రిమెంట్లుకి సంబంధించిన కాగితాలు ఇవి. వీటి మీద నీ సంతకం పడిందా ? ఓ వారం రోజులలో బిల్లు చేయించుకుని ఈ గండం నుంచి బయట పడతాను."

"టెండర్లు పిలవలేదు. అసలు పని జరగందే. పైగా ఆ కలప వేలం వేయటం ఇదంతా ఎలా సరిపెట్టడం ? నాకంతా అయోమయంగా ఉంది అదీగాక ఈ మధ్యన సి. ఐ. డి..... ! ?!" అన్నాడు చంద్రం నిబ్బరంగా.

"పిచ్చి వేషాలు వేయకు చంద్రం. ఇదిగో ఇది చూశావుగా ఎలా మెరుస్తుందో ? నిండు ప్రాణాల్ని నిముషాల్లో తీసేయగలను.... నువ్వు ఇటువంటివి ఇదివరకు ఎన్నోసార్లు సరిపెట్టావు. ఆ సంగతి నీకు తెలుసు. ఆ కలప 'లాట్ల'న్ని మొన్నటి వరదల్లో కొట్టుకు పోయాయని రిపోర్టు పంపటం నీ కంత కష్టమయిన పని కాదని నాకు తెలుసు."

"కాని...." చంద్రం మాట్లాడ బోయాడు.

"ఇక నేను నీ నుంచి ఏమీ విన దలుచుకోవ లేదు. నా సంగతి నీకు తెలుసుగా. చె ప్పనతో మొండి వాడిని. తొందరగా పనికానీ, అవతల తార నీ కోసం ఎదురు చూస్తోంది."

"నేనూ అతిగా నిన్ను విసిగించ దలుచుకోలేదు. కాని ఒక్కసారి ఈ కాగితం చూడు. తరవాత ఏం చెయ్యమన్నా చేస్తాను." చంద్రం జేబులోంచి వెతికి కాగితం ఒకటి బయటికి తీసి నాగభూషణానికిచ్చాడు.

అది చదువుతున్నంతసేపూ నాగభూషణం ముఖంలో రంగులు మారాయి. అతని మోహం వికృతంగా మారటం మొదలెట్టింది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు భారంగా వస్తున్నాయి.

"ఎప్పుడు వచ్చారు మీరు ?" పలకరించింది అప్పుడే వచ్చిన తార. ఆమె వచ్చిన సంగతి ఎవరూ గమనించలేదు. ఈ గొడవలో పడి. "ఇంతకీ నువ్వు చెప్ప దల్చుకున్నది నీ సంతకానికి ఇప్పుడు విలువ లేదని అన్నమాట. అయితే.... నువ్వు ఇప్పుడు సస్పెన్షన్‌లో ఉన్నవా? సుందరసింగ్ కంట్రాక్టు కేసులో!! అయిపోయింది అంతా అయిపోయింది! అయితే ఇక మిగిలింది ఒక్కటే...." అని లేచి నాలుగడుగులు వెనక్కి నడిచాడు నాగభూషణం తుపాకీ పట్టుకుని నిశ్చలంగా.

చంద్రం వణికి పోతున్నాడు లేచి నిలబడి. మృత్యువు ఇంకెంతో దూరంలో లేదు తనకి.

"నిరాయుధుణ్ణి చేసి చంపేయటం ధర్మం కాదు." ఏడుస్తూ అరిచింది తార. "ష్....ష్. అవతల నౌకరుగాళ్ళు వస్తారు. రెండు నిమిషాలే. నీ ఇష్ట దేవతని తలుచుకో చంద్రం ముందు నువ్వు నేను నీ వెనకాలే వస్తున్నాను. భయపడకు." గర్జించాడు నాగభూషణం. బయట ఆకాశంలో చంద్రుణ్ణి మేఘాలు కప్పాయి. వెన్నెల మసకగా తెల్లబోయింది.

తుపాకీ ఎత్తి గురిచూసిన నాగభూషణానికి చంద్రాన్ని అడ్డంగా ఆనుకుని నిలబడి తీక్షణంగా చూస్తూ మరణానికి సిద్ధంగా ఉన్న తార కనిపించింది. ఒక నిమిషం అలానే నిలబడి తుపాకీ దించి వేశాడు. విసురుగా, జుగుప్సగా నాగభూషణం. "ఛీ! పొండి అవతలకి" అన్న గర్జన విని ద్వారం వేపు పరుగులు పెట్టాడు చంద్రం తారతో అదే చాలన్నట్లు. ద్వారం దాటుతూండగా ప్రేలుడు విని ఇద్దరూ ఉలిక్కిపడి వణికి పోయారు. అప్పుడే ఎదురుగా వస్తున్న రాంసింగ్ "క్యాసాబ్" అంటూ లోపల ప్రవేశించాడు.

నాగభూషణం క్రింద పడి ఉన్నాడు. అతని నుదుటి నుంచి నెత్తురు ధారగా ప్రవహిస్తోంది. "సాబ్ ! సాబ్ !" అని పలకరించిన రాంసింగ్ సమాధానం చెప్పటానికి నాగభూషణం లేడు. కాంతా, కనకాలు రెండూ పోగొట్టుకున్న నాగభూషణం ప్రాణాలు కూడా కావాలని వదిలేశాడు. ★

**1-5-1964 శుక్రవారము మొదలు**
**7-5-1964 గురువారము వరకు**

**మేషం :**

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రతి క్షణమూ యేవో సందేహాలు కలుగుతూ ఉండడం వలన యే వ్యవహారంలోను ఒక స్థిర నిర్ణయానికి రాలేరు. కాని ప్రయత్నించిన ప్రతి పనీ నెరవేరుతూ ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో గత వారం యేర్పడిన అనుకూల పరిస్థితి ఈ వారం కూడా ఉంటుంది. దాని ఫలితం కూడా అనుభ విస్తారు. ఉద్యోగస్థులపై అధికారుల ఆదరణను పొందుతారు. వ్యాపారస్థులు నూతన వ్యాపారాల్లో లాభాన్ని సంపాదిస్తారు. ఆరోగ్యం మొత్తం మీద బాగా ఉన్నా ఆకస్మికంగా అనారోగ్యం చేయుగల సూచనలు ఉన్నాయి. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో పూర్తిగా అనుకూల వాతావరణం యేర్పడుతుంది. వారం మధ్యలో కొంచెం అనవసరమైన శ్రమ కలుగుతుంది. 6, 7 తేదీల్లో ధన లాభం, సంతోషం.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి,

హోరా హోరిగా పోరాడి లాభం లేదని నిరాశ చెందిన తర్వాతగాని యే పనీ సానుకూల పడదు. సామాన్యంగా జరుగవలసిన పనులకు కూడా ఆటంకాలు రావడం వలన మానసికంగా శాంతి ఉండదు. వృత్తి వ్యాపారాల్లో, మీ పరిస్థితి అంత ప్రోత్సాహకరంగా ఉండదు కాని నష్టం యేమీ జరుగదు. మీరు యెంత పొదుపుగా ఉందామనుకొన్నా వూహించని ఖర్చులు చేయవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో అభివృద్ధి ఉండదు. ఆరోగ్యం బాగానే ఉంటుంది గాని మానసికంగా విశ్రాంతి ఉండదు. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలు ఫలిస్తాయి. విలువైన వస్తువులు కొంటారు. వృత్తి రీత్యా చేయ వలసిన ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పుణ్య కార్యాలు నిర్విఘ్నంగా నెరవేరతాయి.

* * *

**మిథునం :**

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర పునర్వసు 1, 2, 3 పా.)

ప్రయత్నించిన పనులన్నీ నెరవేరుతూ ఉండడం వలన కొంత శ్రమ పొందినా మీరు లక్ష్య పెట్టరు. అధికారుల వలన జరుగ వలసిన పనులు అనాయాసంగా జరిగి లాభిస్తుంది. ఇంతవరకు మీరు రాదనుకొన్న డబ్బు చేతికి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో ఆదాయం పెరుగుతుంది. వ్యాపారంలో పెద్ద మార్పులు, భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. కొన్ని అనవసరమైన పనులలో దిగి మీ అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చేసుకొనే ప్రమాదం ఉంది. ఆరోగ్యం

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | ర కు<br>బు గు | శు | శు రా |
| శ | వారఫలం | | |
| | | | |
| చం కే | | | |

మహేష్

గతవారం కంటే బాగుంటుంది, కుటుంబంలో వారం మధ్యను కొన్ని భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. సంతానానికి అనారోగ్యం చేయువచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంత లాభించును. ప్రేమ వ్యవహారాల్లో అనుకూలత ఉంటుంది.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ వారం కూడా గత వారం వలెనే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి వీల్లేదు. ఆర్థికంగా సామాన్యంగా ఉన్నా మిగిలిన అన్ని విషయాల్లోను బాగా ఉంటుంది. ఉద్యోగస్థుల శక్తి సామర్థ్యాలు పై అధికారుల చేత గుర్తింపబడతాయి. వృత్తిలో పెద్ద మార్పులు రావడానికి ఇంకా కొంతకాలం పడుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కాని వారాంతంలో కొంచెం అనారోగ్యం చేయవచ్చును. మీరు చేసే ఆలోచనలలో బంధువుల పాత్ర విశేషంగా ఉంటుంది. రాజకీయాల్లో పూర్తి ప్రోత్సాహం లభిస్తుంది. భవిష్యదభివృద్ధికి మార్గం యేర్పడుతుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి అంతరాయాలు రావచ్చును.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం బాగా ఉంటుందని చెప్పవచ్చును. వృత్తి వ్యాపారాల్లో గత కొద్ది వారాలుగ యేర్పడిన ప్రతిష్టంభన తొలగి పోతుంది. మీరు ఇంతవరకు చేస్తున్న ఆలోచనలకు ఒక రూపం ఇస్తారు. నూతన వ్యాపారాలు కొన్ని ప్రోత్సాహకరంగా ఉన్నట్లు కన్పిస్తాయి కాని వాటిని పూర్తిగా నమ్మడానికి వీల్లేదు. ఉద్యోగుల పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఆదాయం పెరిగి డబ్బుకు ఇబ్బంది పడనక్కరలేని పరిస్థితి యేర్పడుతుంది. ఆరోగ్యం కూడా ఇది వరకటి కంటే బాగా ఉంటుంది కాని దూర ప్రయాణాలు చేయడం మంచిది కాదు. వైజ్ఞానిక రంగంలో మీ బుద్ధి చురుకుగా పని చేస్తుంది. శుభ కార్యాల విషయంలో మీరు సాధించిన అభివృద్ధి సంతృప్తికరంగా ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో అంతగా ప్రోత్సాహం ఉండదు.

* * *

**ఈ వారము ధరలు**

ధాన్యం ధరలో కొంచెం ఎక్కువ తక్కువలు వచ్చినా వారాంతానికి మాత్రం కొంచెం తగ్గుతుంది. అపరాల ధరలో పెద్ద మార్పులు ఉండవు. బెల్లం ధర నిలకడగా ఉంటుంది. నువ్వులు, నూనె ధరలు ఇంతవరకు ఉన్న ఎక్కువలో కొంచెం తగ్గవచ్చును. అలంకార వస్తువుల ధరలు పెరుగుతాయి.

**కన్య :**

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం మీ ఓర్పుకు, నేర్పుకు పరీక్షా సమయం మీరు యెంత జాగ్రత్తగా ఉన్నా యేవో చిక్కులు యేర్పడి మిమ్మల్ని వేధిస్తూ ఉంటాయి. వృత్తి వ్యాపారాల్లో ప్రతికూలత యేర్పడుతుంది. ప్రయత్నించిన పని యెంత చిన్నదైనా పూర్తయేసరికి చాలా శ్రమపడవలసి వస్తుంది. ఇంతవరకు మీకు సహాయంగా ఉన్న వారు కూడా మీ యెడల శత్రుభావంతో ప్రవర్తిస్తారు. ఉద్యోగస్థులు ఈ వారం చాలా జాగ్రత్తగా ఉండాలి. చిన్న విషయాలకు కూడా అధికారుల మందలింపులకు గురికావలసి వస్తుంది. ఆరోగ్యం కూడా సామాన్యంగా ఉంటుంది. కుటుంబ పరిస్థితిలో పెద్ద మార్పులు ఉండవు. బంధువులు కూడా తమ పనుల నిమిత్తం మిమ్మల్ని ఒత్తిడి చేస్తుంటారు. రాజకీయాల్లో తీవ్ర ప్రతిఘటనను యెదుర్కో వలసి వస్తుంది.

* * *

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

మీరు ఇంతవరకు చేసిన కృషికి ఫలితం లభించిందనే భావం ఈ వారం మీరు పొందుతారు. ఇంతవరకు అనిశ్చితంగా ఉన్న వ్యవహారాల్లో కొంత స్థిరత్వం యేర్పడుతుంది. వృత్తి వ్యాపారాల్లో పరిస్థితి అనుకూలంగా ఉన్నా సాహసముతో కూడిన వ్యాపారాలు చేయడం మంచిది కాదు. ప్రయత్నం చేసిన పనులు కొంచెం ఆలస్యంగా నెరవేరుతాయి. అధికార వర్గం వల్ల ప్రోత్సాహం లభిస్తుంది. ఉద్యోగస్థులకు అనుకూలంగా చిన్న చిన్న మార్పులు జరుగవచ్చు. ఆరోగ్య విషయంలో ఈ వారం జాగ్రత్తగా ఉండాలి. జారి పడడం వంటి ప్రమాదాలు జరుగవచ్చు. ఆర్థికంగా ఇంతవరకు ఉన్న ఒత్తిడి చాల వరకు తొలగి పోతుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ హోదా పెరుగుతుంది. బంధువుల సమస్యలు కూడా మిమ్మల్ని యెదుర్కొంటాయి.

* * *

# వారఫలాలు

వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

అప్పుడప్పుడు [illegible] నా మొత్తం [illegible] ఉంటుంది. గతవారం ప్రయత్నం చేసిన పనులకు తగిన ప్రయోజనాన్ని యీ వారం సాధిస్తారు. వృత్తి వ్యాపారాల్లో మీరు కొన్ని మొగమాటాలకు లొంగడంవలన చాలా శ్రమ కలుగుతుంది. [illegible] [illegible] పెరిగిపోయినా ఇబ్బంది లేకుండా [illegible] చేతికి వస్తుంది. ప్రభుత్వ ద్వారా ప్రయోగాలు చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఉద్యోగస్థులకు శ్రమకు తగిన ప్రోత్సాహం లభిస్తుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో మీరు వూహించని పరిణామాలు రావచ్చును. దానివల్ల ముమ్మందు మీకు మంచి కలుగుతుంది. మీరు సహాయం చేద్దామని అనుకొన్నవారికి తోడ్పడగల్గుతారు. 1, 2 తేదిల్లో ధనలాభం, గౌరవం.

*　　*　　*

ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో పెద్ద మార్పులు ఉండవు. ప్రయత్నించిన పనులు నెరవేరుతున్నట్లు కనబడినా పూర్తిగా ఫలితం చేతికి అందేవరకు నమ్మడానికి వీలులేదు. ముఖస్తుతి మాటలు చెబుతూ మీద్వారా తమ పనులు సాధించడానికి ప్రయత్నించే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. డబ్బుకు సంబంధించిన లావాదేవీల్లో కొన్ని చికాకులు రావచ్చు. ఉద్యోగస్థులు కొన్ని ముఖ్యమైన విషయాల్లో పొరపాటు నిర్ణయాలు చేసి తరువాత పశ్చాత్తాప పడుతారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. మనస్సు ప్రశాంతంగా ఉండదు. రాజకీయాల్లో మీ మిత్రులు కూడా శత్రుపక్షంతో చేరడంవలన బలాబలాలు తారుమారు కాగల ప్రమాదం ఉన్నది. చాలా జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

*　　*　　*

మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు.

ఈ వారం బాగా ఉంటుందని చెప్పడానికి అవకాశములేదు. ఇంతవరకు ప్రశాంతంగా ఉన్న వ్యవహారాల్లో కూడా కొన్ని చిక్కులు ఏర్పడి మనస్సు పశాంతిలేనట్లు బాధిస్తాయి. ఎవరిని నమ్మవచ్చునో, ఎవరిని నమ్మకూడదో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. వ్యాపారంలో మార్పులకు ఇది సమయం కాదు. నూతన వ్యవహారాల్లో ధన నష్టం రావచ్చును. ఉద్యోగస్థులు అకారణంగా అధికారుల ఆగ్రహానికి గురి అవుతారు. మీరు ఎదుటివారి మంచిని కోరి ప్రస్తావించినా వారికి అదిచెడుగానే కన్పిస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ పరిస్థితుల్లో మార్పులు ఉండవు. విద్యారంగంలో మీ కృషికి అంతరాయం వస్తుంది. స్త్రీ మూలంగా కలహం రావచ్చును. ముఖ్య వ్యవహారాల్లో స్నేహితుల సలహా కూడా వినడం మంచిది.

*　　*　　*

కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

వృత్తి వ్యాపారాలో పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. నూతన వ్యాపారాల్లో అవకాశాలు ఎండమావులవలె కన్పిస్తాయి. ప్రయత్నిస్తే నష్టం కలుగుతుంది. వృత్తిలో పోటీ పెరుగుతుంది. కాని, దానివల్ల నష్టం ఏమీ కలుగదు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో గతవారంలో వచ్చిన చిక్కులు చాలవరకు సర్దుకొంటాయి.


MAITHON


మైథాన్ ఎసి లేక డిసి 900 యమ్‌యమ్, 1200 యమ్‌యమ్, 1400 యమ్‌యమ్, 1600 యమ్‌యమ్.

AEI

సీలింగ్ మరియు టేబుల్ పంకాలు


డిలక్స్ 400 యమ్‌యమ్ టేబుల్ మోడల్
- తీసి తగిలించడానికి వీలైన గార్డ్
- కావలసినట్లు పెట్టుకోవడానికి వీలైన ఆసిలేటింగ్ హెడ్
- వుండవలసిన ఆకారంలో సమపాలుగా వుండే అల్యూమినియం బ్లేడ్‌లు
- మూడు తరగతుల స్పీడ్
- అనేక ఎనామిల్ రంగులలో

మేలిరకం విడి భాగాలను నిపుణత్వంతో కూర్చి పకడ్ బందీగా తయారుచేసినవి మాత్రమేగాక, అనుభవజ్ఞులు, పొందికైన నిపుణులు ఎఇఐ సీలింగ్ పంకా లను టేబుల్ పంకాలను సర్వదా కని పెట్టి వుంటారు. అది హై పవర్ ఆపరేషన్‌కు అయినా, లో పవర్ కన్‌సమ్‌షన్‌కు అయినా ఎఇఐ పంకా లనే పేరుపెట్టి అడిగి తీసికోండి.

అసోసియేటెడ్ ఎలక్ట్రికల్ ఇండస్ట్రీస్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
క్రౌన్ హౌస్, 13, రాజేంద్రనాథ్ ముఖర్జీ రోడ్, కలకత్తా-1
బ్రాంచిలు: బొంబాయి . న్యూఢిల్లీ . మద్రాసు . బెంగుళూరు . కోయంబత్తూరు . నాగపూర్

AEI-47A TEL

రాబోయే డబ్బును వూహించి వాగ్దానాలు చేయడం మంచిదికాదు. వారాంతంలో ఆరోగ్యం విషయంలో జాగ్రత్తగా ఉండాలి. కొంతమంది స్వార్థపరులైన బంధువులు కుటుంబంలో భేదాభిప్రాయాలు కల్పించడానికి ప్రయత్నం చేస్తారు. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది. విద్యారంగంలో మీ కృషి పరిగణనలోనికి వస్తుంది. ధనిష్ఠ నక్షత్ర జాతకులకు మిగిలినవారి కంటే బాగా ఉంటుంది. 1, 2 తేదీల్లో శుభవార్తాశ్రవణం గౌరవం.

* * *

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

వృత్తి వ్యాపారాల్లో మంచి పేరు వస్తుంది. కాని దానివల్ల ఆర్థికంగా ప్రయోజనం ఉండదు. మీ ఆలోచనలకు తగిన అవకాశం చిక్కనందున నిరుత్సాహం కల్గుతుంది. ఆదాయం మామూలుగా ఉన్నా అనవసరమైన ఖర్చులు చేయవలసి రావడం వలన కొంత ఇబ్బంది రావచ్చును. ఉద్యోగస్థులు ముఖ్యమైన నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. వ్యాపారంలో కొన్ని మార్పులు వాటంతట అవే వస్తాయి. కాని, వాటివల్ల ఆట్టే లాభం ఉండదు. వృత్తి రీత్యా ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇంకా ఒక దారికి రావు. సాంఘిక కార్యక్రమాల్లో శ్రమకు తగిన ఫలం ఉంటుంది. సత్పురుషుల సహవాసం లభిస్తుంది. వారాంతంలో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. 3, 4 తేదీల్లో ధనలాభం, సంతోషం.

# జన్మదినఫలం

## మే-1

ఈ సంవత్సరం మొత్తంమీద బాగా ఉంటుందని చెప్పవచ్చును. వృత్తి వ్యాపారాల్లో సంవత్సర ప్రారంభంలోనే కొన్ని అనుకూలమైన మార్పులు వస్తాయి. ఆదాయం పెరుగుతుంది. కాని, అనవసరమైన ఖర్చులు చేయవలసి వచ్చుటచే మీకు తృప్తి ఉండదు. ఉద్యోగస్థులు అనుకూలమైన స్థానములకు మార్చబడగల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో చేసే వ్యాపారాలు రాణిస్తాయి. కాని సాహసముతో కూడిన వ్యాపారాల్లో అనుకూలత ఉండదు. స్థిరాస్థి వ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది. గృహ నిర్మాణాది ప్రయత్నాలు సాగుతాయి. స్నేహితులే మిమ్మల్ని మోసం చేయడం వలన కొన్ని చికాకులు వస్తాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబంలో కొన్ని భేదాభిప్రాయాలు వచ్చి ముఖ్యమైన వ్యవహారాలు వాయిదా పడతాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. రాజకీయవేత్తలకు మంచి సమయం.

## మే-2

గత కొద్ది సంవత్సరాల కంటె ఈ సంవత్సరం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు ఎదురు చూడని మార్పులు వచ్చి మీకు లాభం కలుగుతుంది. ఉద్యోగస్థులు కొంత ఉన్నతస్థానం కోసం ప్రయత్నం చేయడానికి మంచి సమయం. వ్యాపారస్థులు నూతన వ్యాపారాలు ప్రారంభిస్తారు. భాగస్వాములతో చేసే వ్యాపారం సామాన్యంగా ఉంటుంది. కోర్టు వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావచ్చును. విలువైన అలంకార వస్తువులు కొంటారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఇదివరకు మీయందు ఆదరంలేని బంధువులు కూడా మీకు అనుకూలంగా ఉంటారు. శుభకార్యాల విషయంలో ప్రోత్సాహం ఉంటుంది. పెద్దలకు అనారోగ్యంచేసి కొంత ఆందోళన చేయవచ్చును. విద్యార్థులకు క్లాసు వచ్చుటకు అవకాశం ఉన్నది. ఫిబ్రవరి, మార్చి నెలలో ధన వ్యయం, శ్రమ.

## మే-3

ఈ సంవత్సరం మొదట అంత బాగా లేకపోయినా క్రమంగా అన్ని వ్యవహారాలూ సానుకూల పడతాయి. వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. వ్యాపారస్థులకు ఆదాయం పెరుగుతుంది. కాని, ఆకస్మికంగా నష్టం వచ్చే సూచనలు ఉన్నాయి. సంవత్సర ప్రారంభంలో ఉద్యోగస్థులకు చికాకులు, అననుకూలమైన స్థానమునకు మార్పులు రావచ్చును. ఆరోగ్యం మొత్తంమీద బాగా ఉన్నా జీర్ణ సంబంధమైన అనారోగ్యం చేస్తుంది. దూర ప్రయాణాలు చేస్తారు. సాంఘిక కార్యక్రమాల్లో పలుకుబడి పెరుగుతుంది. మీ బుద్ధి కుశలత పదిమందిచేత గుర్తింపబడుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. ప్రేమ వ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కాగలరు. వస్త్ర వ్యాపారులకు, కంట్రాక్టర్లకు అనుకూలమైన కాలం.

## మే-4

ఈ సంవత్సరం సాధారణంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు కొన్ని చికాకులు వచ్చినా స్నేహితులు మీకు సకాలానికి తోడ్పడతారు. అధికారులవలన జరుగవలసిన పనుల నిమిత్తం చాలా శ్రమ పడవలసి వస్తుంది. వృత్తిలో కొంతమంది కొత్తవారు పోటీ వచ్చి మీకు ఆందోళన కలిగిస్తారు. ఆర్థికంగా బాగా ఉన్నా సమయానికి డబ్బు రాక కొంత ఇబ్బంది పడతారు. మీరు గత సంవత్సరం ఆలోచించి వదలివేసిన వ్యాపారం మీరు ఇప్పుడు చేసి లాభం సంపాదిస్తారు. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం సంతోషం లభిస్తాయి. రాజకీయాల్లో కొత్త బాధ్యతలు స్వీకరించవలసి వస్తుంది, కాని ఫలితం తక్కువ. అగ్నివల్ల గాని, విషజంతువులవల్లగాని ప్రమాదం రావచ్చును. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## మే-5

ప్రపంచ దృష్టిలో ఇది మీకు మంచి సమయమే. కాని వాస్తవంగా పరిస్థితి అందుకు భిన్నంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు సిద్ధాంతరీత్యా బాగానే ఉంటాయిగాని ఆచరణలో మీకు అంతగా తోడ్పడవు. ఇదివరకు పరిష్కారమయిపోయిన తగాదాలు సంవత్సరం మధ్యలో తిరిగి తలయెత్తి కొంత అశాంతిని కలిగిస్తాయి. నూతన వ్యాపారాలు ప్రారంభించడానికి ఇది సమయం కాదు. ఉద్యోగస్థులకు స్థానచలనము కలుగవచ్చును. కొత్తవారితో పరిచయం కలుగుతుంది. దానివల్ల మున్ముందు మీకు విశేషమైన ప్రయోజనం ఉంటుంది. మీ ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబంలో ఎప్పుడూ ఎవరికో ఒకరికి అనారోగ్యం చేస్తూ ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ స్థానాన్ని నిలబెట్టుకొంటారు. విద్యార్థులు శ్రమపడి చదువవలసి ఉంటుంది. నవంబరు, డిశంబరు నెలల్లో ప్రయాణాలు.

## మే-6

ఈ సంవత్సరం శుభా శుభమిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో శ్రమ పెరుగుతుంది కాని ప్రయోజనం ఆట్టే ఉండదు. మీరు ఆలోచించిన దానికి అవకాశము రాక, అవకాశము వచ్చినదానికి ఆలోచన తట్టక విసుగూ, చిరాకూ కల్గుతాయి. వస్తువులుకాని అవసరమైన కాగితములు కాని పోయే ప్రమాదం ఉంది. సంవత్సరం మధ్యలో కొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు. అందులో కొంత లాభం కలుగుతుంది. వ్యాపారంలో నష్టం రాకపోయినా కొన్ని వ్యవహారాల్లో అనవసరంగా డబ్బు ఖర్చు చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. కొంతమంది మిత్రులు మీకు తోడుగా నిలబడతారు. ఆరోగ్యంలో పెద్ద మార్పులు ఉండవు. కుటుంబంలో శుభకార్యాలోచనలు వాయిదా పడవచ్చును. బంధువులకు సహాయం చేస్తారు. రాజకీయాల్లో ప్రయోజనం గల కార్యాల్ని సాధిస్తారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## మే-7

జీవితంలో ముఖ్యమైన సంవత్సరాల్లో ఈ సంవత్సరం కూడా ఒకటి. ఈ సంవత్సరంలో మీరు చేసే వ్యవహారాల ప్రభావం వచ్చే సంవత్సరాలమీద కూడా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమంగా అభివృద్ధి ఉంటుంది. వ్యాపారస్థులకు ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. వృత్తిలో ఇంతవరకు ఉన్న పోటీ తగ్గుతుంది. ఉద్యోగస్థులకు భవిష్యదభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది. మీ అభివృద్ధిని సహించలేక కొంతమంది వ్యక్తులు మీకు వ్యతిరేకంగా వదంతులను ప్రచారం చేస్తారు. ఆరోగ్యం బాగా ఉంటుంది గాని అప్పుడప్పుడు బలహీనత కలుగుతుంది. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీరు కొన్ని కార్యక్రమాలకు నాయకత్వం వహిస్తారు. కళారంగంలో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. విద్యార్థులకు క్లాసు రావచ్చును.



# సంపెంగ పొదలు



గంగాధర్ — సి. ఆనందారామం

## జరిగిన కథ

గిరి, హరి, హరి చెల్లెలు దుర్గ బాల్య స్నేహితులు. హరి, ఉమల మధ్య అనురాగం నెలకొంటుంది. గిరి చూపే భాతృవాత్సల్యాన్ని, దుర్గ హర్షించ లేకపోతుంది. దూరపు బంధువు శంకర్‌ను గిరి తన ఇంటికి ఆహ్వానిస్తాడు. గిరి సలహాపై దుర్గ శంకర్‌ని హృదయ పూర్వకంగా ప్రేమిస్తుంది. వారిద్దరు వివాహం చేసుకొంటారు. హరంటే ఇష్టంలేనట్లు ఉమ ప్రవర్తిస్తుంది. హరి కృంగిపోతాడు. శంకర్, దుర్గల వైవాహికజీవితంలో చెలరేగిన కలతలను సరిదిద్దటానికి గిరి ప్రయత్నం చేస్తూవుంటాడు. దుర్గ చిన్ననాటి స్నేహితుడు ప్రసాద్ ఆమె సంసారంలో కలతలు రేపటానికి ప్రయత్నిస్తాడు. గిరి హరినిగురించి నచ్చచెప్పటానికి ఉమవద్దకు వెళ్తాడు. దుర్గ మనశ్శాంతికొరకు పుట్టింటికి వెళ్తుంది. తనను ధిక్కరించి వెళ్లినట్లు భావించి శంకర్ ఉగ్రుడౌతాడు. పుట్టింటికి వెళ్ళిన దుర్గ కొంతకాలం తర్వాత శంకర్‌కు మశూచి అని తెల్సి తల్లీ, అన్నా చెప్పినా వినకుండా భయలుదేరి శంకర్‌వద్ద కెళ్తుంది. శంకర్ ఆమె రాకకు ఆనందభరితుడౌతాడు. జానకి హరికి జరిగిందంతా చెప్పి ఉమ విషయంలో కూడా సందేహాలను తీర్చుకోమని తనకు ఉమ వ్రాసిన ఉత్తరాలో ముఖ్యమైన కొన్నింటిని హరికిస్తుంది.

## 26

హైదరాబాదు.
4—7—1956

డియర్ జానీ!

నా వివాహ శుభలేఖకోసం ఎదురుచూసే నీకు నా ఉత్తరం ఆశ్చర్యం కలిగించవచ్చు. నీకేమిటి? నాకే అంతా తమాషాగాఉంది. మన దుర్గ నా ఒడిలో తలపెట్టి ఏడ్చింది, తాను గిరిని ప్రేమించానని, కానీ అతడు తిరస్కరించాడనీ చెప్పింది. దుర్గను సంతోషపెట్టడానికి దుర్గ తరఫున లేని చనువు తీసికుని గిరితో మాటలు పెంచుకున్నాను. గిరి ఎవరని ఆశ్చర్యపడతావు కదూ! మా బావకు ఆత్మీయుడైన స్నేహితుడులే! అతనితో మాట్లాడిన క్షణంనుంచీ నాలో విచిత్రమైన మార్పు కలిగింది. నాకు తెలియకుండానే అతని ఆకర్షణకు లొంగిపోయాను. మా బావమీద నాకున్నది కేవలం వాత్సల్యమనీ, ప్రేమకాదనీ అనిపించసాగింది. క్రమంగా ఆ భావన నాలో బలపడింది. బావను పెళ్ళి చేసుకోలేకపోయాను. చేసికోననీ, చెప్పలేకపోయాను. అందుకే కాస్త వూపిరి తీసుకుందామని మెడిసిన్‌లో చేరాను.

ఏమంటావూ? నాది చంచలమైన మనసని తిట్టావా? నిజమేనేమో?

తొందరగా సమాధానం వ్రాయవూ? నీ పెళ్ళి విశేషాలన్నీ వివరంగా వ్రాయి.

నీ
ఉమ.

హైదరాబాదు
6—9—1958

డియర్ జానీ!

దుర్గ వివాహం జరిగింది. పెళ్ళికొడుకు చాలా బాగుంటాడు. చదువుకోలేదు. వ్యాపారంలో నిపుణుడు. గిరి ప్రోత్సాహమే ఈ వివాహానికి కారణమంటది దుర్గ.

ఇన్నాళ్ళుగా వూగిసలాడిన నా మనసు ఒక నిశ్చయానికి వచ్చేసింది. బావను, బావగా అభిమానించగలనేకాని, భర్తగా ఆరాధించలేను. నా మనసులో గిరి తిష్ట వేసుకు కూర్చున్నాడు. గెంటినా పోవటం లేదు.

నేను ఎంత కలివిడిగా ఉందామని ప్రయత్నించినా, నాతో చాలా ముభావంగా ఉంటున్నాడు గిరి. మునుపున్న కొద్దిపాటి స్నేహం కూడా లేకుండా పోయింది. బహుశా నేనంటే అతనికి ఇష్టంలేకపోయి ఉండచ్చు. అయినా, అతనిని ఆరాధించకుండా ఉండలేను జానీ! నా ఆరాధన అతడు స్వీకరింపకపోనీ, అతనిని నా మనస్సులో ధ్యానించుకుంటేనే చాలు, నాకు ఎక్కడలేని తృప్తి కలుగుతుంది.

బావ సంగతి తల్చుకుంటే నాకెంతో వ్యధ కలుగుతుంది. వ్యంగ్యంగా ఎన్నిసార్లు నా అభిప్రాయం వ్యక్తపరచినా, అర్థం చేసుకోడు— మా బావది ఎట్లాంటి ఆవేశమో, ఉద్రిక్త స్వభావమో నీకు తెలుసుగా. తనగోలేమో తనది తప్ప ఇంకేమీ ఆలోచించడు అయినా పాపం తన తప్పేమిఉంది? చిన్నతనం నుంచీ, నన్ను తన దానినిగా భావించాడు. ఎక్కువగా ఈ విషయాల్ని గురించి ఆలోచించని నేను కూడా మొన్నటివరకూ, అతని భావనకు ప్రోత్సాహమిచ్చాను. నా నోటితో బావకు అసలు విషయం ఎలా చెప్పగలనూ? బావనూ భగవంతుడినీ, ఈ దోషం క్షమించమని ప్రార్థించటంకంటె నేను చెయ్యగలిగిందేముంది?

అల్లకల్లోలంగా ఉన్న నా మనసుని, నీ ఉత్తరాలు కొంత ఓదారుస్తున్నాయి. తిరుగుటపాలో జవాబు వ్రాయాలి మరి! నీ

ఉమ.

హైదరాబాదు
27—10—61

డియర్ జానీ!

నీ ఉత్తరం ఈసారి నా కెంత ఆశాభంగం కలిగించిందో చెప్పలేను. అన్ని విషాద వార్తలు వ్రాసావేం? దుర్గ సంసారంలో కలతలా? నీవారికి గుండె జబ్బా?! అబ్బా! పరిపూర్ణతను ప్రసాదిస్తే మనం తనను మర్చిపోతామని కాబోలు— ఏ ఒక్కరికీ పరిపూర్ణమైన ఆనందాన్ని ప్రసాదించడు భగవంతుడు.

నేను గిరికి ఎన్ని ఉత్తరాలు వ్రాసినా సమాధానం వ్రాయలేదు. మొదట్లో పొడిగా, ఒకటి, రెండు వాక్యాలతో సమాధానమిచ్చాడు. కానీ, తరువాత అది కూడా లేదు. దురదృష్టవంతురాలిని జానీ! అతని హృదయంలో నాకు స్థానంలేదు. ఈ ఆవేదన నేను భరించలేను. బావతో ఉన్న విషయం ఉన్నట్లు చెప్పేస్తాను. పోనీ అతడైనా తన కనుకూలమైన యువతిని వివాహమాడి సుఖపడ్తాడు.

మీవారికీ, మీ అన్నయ్యకూ నా నమస్కారాలందజేయి. ఉంటా! నీ

ఉమ.

తేజ్‌పూర్
28—9—62

డియర్ జానీ!

మన దేశాన్నంతనీ అట్టుడికినట్టుడికించిన ఈ యుద్ధం నా జీవితానికి వరమయింది. ఏ దారీ, తెన్నూ కానక కొట్టుకుంటూన్న నాకు చక్కని మార్గం చూపించింది. ఇక్కడకు వచ్చేసాను. పావం! బావ ఎంత బాధపడ్డాడనుకున్నావే? దుర్మార్గురాలిని. అతనికంత ఆవేదన కలిగించిన నేను ఎంతటి శిక్షకయినా అర్హురాలిని. కానీ ఏం చెయ్యను అశక్తురాలిని. ఇక నా తలిదండ్రుల ఆవేదన వర్ణించటానికి మాటలు దొరకటం లేదు. బావ దుఃఖాన్నంతటినివురిపించగల స్త్రీ ఎవరైనా, అతని జీవితంలోనికి తొందరగా వస్తే బాగుండును.

విచిత్రం గిరి కూడా ఎంతో బాధ పడ్డాడు. నేనంటే కనీసం స్నేహభావమైనా, లేని పెద్ద పెద్ద మనిషి. అంత బాధపడటమెందుకు! బహుశా తన మిత్రుడు హరి కోసమై ఉంటుంది. వాళ్ళ స్నేహం ఎంత గాఢమైనదనుకున్నావూ! అట్లాంటి స్నేహం పొందగలగటం కూడా అదృష్టమే !

ఇక్కడ జీవితం నాకు బాగుంది. ఇక్కడి వాతావరణమే తమాషాగా ఉంది. ఎనిమిదయినా సరిగ్గా తెల్లవారదు. నాల్గింటికే చీకటి పడుతుంది. ఎటు చూసినా కొండలూ, గుట్టలు జనులందరూ మంచి దృఢకాయులు, కష్టజీవులు, సరదాలకు అవకాశం చాలా తక్కువ. కానీ, ప్రతిది చాలా ఖరీదుగా ఉంటుంది. మొన్న ఒక తువ్వాలు ఏకంగా పదిహేను రూపాయలు చెప్పాడు. నేను ఆశ్చర్యంగా చూస్తే "ఇండియాలో తయారైంది మేడం!" అన్నాడు గొప్పగా— నాకెంతో నవ్వు వచ్చింది. ఈ యుద్ధం గొడవలు లేక మునుపు వీళ్ళంతా ప్రశాంతంగా జీవించేవారనుకుంటా! కానీ, ఇప్పుడందరూ గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకొని ఉన్నారు. అయినా మంచి ధైర్యవంతులు. స్త్రీ, పురుష, బాల, వృద్ధ భేధం లేకుండా అందరూ సైనిక శిక్షణ పొందుతున్నారు. సైరన్ మ్రోత వినంగానే ఏ పని చేస్తున్న వాళ్ళుం ఆ పని వదిలేసి క్రింద పడుకోవటం చాలా తమాషాగా ఉంటుంది. నిజంగా శత్రు సైనికులు రాకపోయినా శిక్షణ కోసం ఇలా జరుగుతుంది.

రామకృష్ణ పరమహంస నీతి కథల్లో ఒక కథ గుర్తుందా? ఒక దొంగ తనను పట్ట వచ్చినవారి నుంచి తప్పించుకోవటానికి సన్యాసి వేషం వేసుకుంటాడు. కానీ, ఆ వేషంలోని ఉదాత్తత, అతనిని నిజంగా సన్యాసిని చేస్తుంది, నా విషయమూ సరిగ్గా అట్లాగే ఉంది. మొదట్లో నా నిరాశను భరించ లేక, ఇక్కడకు వచ్చినా, ఇప్పుడిది వదిలి రాలేను. మన దేశం కోసం ప్రాణాలను ధార పొయ్యడానికి సిద్ధ పడిన త్యాగమూర్తులకు నేను చెయ్య గలిగిన సహాయం చెయ్యటంలో నాకెంతో సంతృప్తి కలుగుతుంది. ఇట్లాంటి అవకాశం దొరికినందుకు నేనెంతో గర్విస్తున్నాను.

సెలవు. నీ,

ఉమ.

తేజ్‌పూర్.
15—10—62

డియర్ జానీ!

నా ఆనందాన్ని నీ కెలా వర్ణించనే! వరద గోదావరిలా, నా హృదయం, ఆనందంతో పరవళ్ళు త్రొక్కుతూంది. నా జన్మ వ్యర్థం కాలేదు. సార్థకమయింది. అసలు విషయం చెప్పకుండా సోది చెప్తున్నానని విసుక్కుంటున్నావా? అయితే విను.

గిరి ఇక్కడకు వచ్చాడు. ఒక్క రోజు ఉన్నాడు. ఆ ఒక్క రోజులోనే, నా జీవితానికంతకూ సరిపోయే, ఆనందం కలిగించాడు. ఇన్నాళ్ళకు నేను గిరి హృదయంలో నాకు స్థానముందని గ్రహించాను. గిరీ, తన నోటితో తను ఒప్పుకున్నాడా విషయం. అయినా తన ప్రాణ మిత్రుని భార్యగా మాత్రమే నన్నెప్పుడూ గౌరవిస్తానని చెప్పాడు. హరి, నేను లేకుండా బ్రతకలేడు కనక, హిందూ సమాజంలో అవివాహితురాలైన స్త్రీ మసలటం కష్టం గనుక నన్ను హరిని పెళ్ళిచేసుకోమని బ్రతిమాలాడు. అందు కొరకే తను వచ్చినట్లు చెప్పాడు. ఈ జన్మలో తను నన్ను వివాహం చేసికోవటం అసంభవం, అని వ్యంగ్యంగా దృఢంగా చెప్పాడు.

అతని మాట మీద గౌరవంతో, బావ మీద జాలితో బావను పెళ్ళి చేసుకుని అతనిని మనసార ప్రేమించలేక పోయినా, భార్యగా నా కర్తవ్యం నెరవేర్చి, అతనిని సుఖ పెట్టాలనే నిశ్చయించుకున్నాను. బావకు ఉత్తరం వ్రాసాను. నా ఉద్యోగం వదలనని కూడా వ్రాసాను. ఉద్యోగం వదిలితేనే గాని పెళ్ళి చేసుకోనని బావ సమాధానం వ్రాసాడు. ఇంతలో ఉంది బావ ప్రేమ! పాపిత బావకు నా మీద గాఢానురాగమని ఇన్నాళ్ళూ ఎంతో ఆవేదన పడే దానిని. ఇప్పుడెంతో తేలికగా ఉంది. పెళ్ళి చేసుకుంటే ఒకటే సంసారం. ఇప్పుడు దేశమంతా నా సంసారమే! గిరిని ధ్యానించుకుంటూ, జీవితమంతా ఇలాగ గడిపేస్తాను. అన్ని అపార్థాలకూ, అతీతమైన వృద్ధాప్యంలో అతని సన్నిధికి చేరుకుంటాను. నన్ను స్వీకరిస్తాడనే నా నమ్మకం. ఆ సమయం కోసం నిరీక్షిస్తూ ఉంటాను.

అల్లరి దుర్గ అప్పుడే తల్లి కాబోతుందా? నేనక్కడికి వస్తే పాపకు మంచి బహుమానాలు తెస్తానని చెప్పు. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోమని చెప్పు.

సాధారణ పరిస్థితులలో అక్కడికి రావటం నాకు పడదు. ఏదైనా అత్యవసర పరిస్థితి ఏర్పడితే, నాకు టెలిగ్రాం ఇయ్యి.

జై. జై! నీ

ఉమ.

పార్కులో కూర్చుని ఉత్తరాలన్నీ చదివిన హరి వాటిని మడచి జేబులో పెట్టుకున్నాడు. అక్కడి ప్రతిఒక్కరూ తన ముఖం లోకి వింతగా చూడటం గమనించాక కానీ హరికి తన కళ్ళ వెంబడి నీళ్ళు కారుతున్నాయని అర్థం కాలేదు. సిగ్గుపడి రుమాలుతో ముఖం తుడుచుకుని బయలుదేరాడు. అతని హృదయం క్షోభతో కుమిలి పోతూంది. అమాయకురాలిని దుర్గను తానెంత క్షోభ పెట్టాడు. ఎప్పుడూ ప్రాణానికి ప్రాణంగా ఉండే గిరిని ఎంత పొరపాటుగా అర్థం చేసుకున్నాడో? రెక్కలు కట్టుకుని వాలి, అతనిని గట్టిగా కౌగలించుకో

34 వ పేజీ చూడండి



# రెండు జెళ్ళు

జయదేవ్



......సార్! సార్! మీరు పట్టుకున్నదీ ............
ON LOVE by ROMEO




పందెం! ఆ అమ్మాయికి రెండు జెళ్ళనీ......
కాదు ఒకటే




మీరు కొన్న పాతిక మూర్ల పూలూ అమ్మ గారి ఒక్క జడకే సరిపోయింది!! మరింకో జడకో?




అరె! బ్రష్ తిరిగి పోయిందే ఎలా?
















మాటు! దీన్ని చదువు అన్నప్పుడు మీరు నవ్వారుండో - అదోలాం ఫీలయితే - అప్పని సరిగా మీరు రెండు జెళ్ళు వేసుకుని ఉన్నారన్న మాట! ఔనా? ....

వాలనీ, క్షమాపణ చెప్పుకోవాలనీ, తహ తహ లాడసాగింది హరి మనసు.

దుర్గ హరి ముఖం చూడగానే కంగారుగా "ఏమయిందన్నయ్యా!" అంది. హరి దుర్గ చేతిని తన చేతిలోకి తీసుకొని "నన్ను క్షమించు దుర్గా! పిచ్చివాడినయి, నేను బాధపడిందే గాక నిన్నూ గిరినీ కూడా క్షోభ పెట్టాను. నాకంటే కూడా గిరే, నీకు నిజమైన అన్న" అన్నాడు.

దుర్గ తేలికగా నిట్టూర్చింది. హరి చేతిని ఆప్యాయంగా నిమురుతూ "నీ మనసు నవనీతం అన్నయ్యా! ఒళ్ళు తెలియని ఉద్రేకం లేక పోతే నువ్వు బంగారు తండ్రివి. జానకి అంతా చెప్పిందా?"

"అవును."

"నేనే చెప్దామనుకున్నాను. కాని నువ్వు వినిపించుకునే లాగ లేవు. ఏది లేక నోరు మూసుకున్నాను. ఒక్క నా విషయమేనా? ఇంకా చెప్పిందా?"

హరి బరువుగా నిట్టూర్చాడు.

"అన్ని సంగతులూ తెలుసుకున్నాను." అన్నాడు.

దుర్గ జాలిగా అన్న చెయ్యి నిమురుతూ ఏదో అనబోయేటంతలో శంకర్ వచ్చాడు.

దుర్గ సంభ్రమంగా "గిరి ఏడీ?" అంది.

శంకర్ దిగాలుగా "రాలేదు. కొన్ని కారణాల వల్ల ఇక్కడకు రాకూడదని నిశ్చయించుకున్నాడట. తన మనసులో మన మీద కోపమేమీ లేదట! ఎప్పుడూ మనసారా మన సుఖం కోరుతుంటాడట!— నీ ఆరోగ్యం జాగ్రత్త అని చెప్పాడు. ఎన్ని విధాల బతిమాలినా, ఇక్కడకు రావటానికి మాత్రం ఒప్పుకోలేదు. విధిలేక వచ్చేసాను" అన్నాడు.

దుర్గ ముఖం మలిన మయింది. హరి ముఖం వంక చూపులు తిప్పింది. హరి లజ్జతో ముఖం దించుకున్నాడు.

దుర్గ కన్నీళ్ళతో "హరి అన్నయ్యా! మనకూ గిరికీ, ఋణం తీరిపోయిందా?" అంది.

హరి చటుక్కున లేచి "దిగులు పడకు దుర్గా! గిరిని నేను తీసుకు రాగలను." అని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

## 27

టేబిల్ మీది ఉత్తరం ఫేన్ గాలికి అల్లలాడుతూంటే గిరి మనసుకూడా గతంలో పరిభ్రమించింది. ఆ నాడు దుర్గ విషయంలో తనతో తగవు పెట్టుకుని వెళ్ళి పోయిన హరి మళ్ళీ తనతో మాట్లాడలేదు. ఎన్నో సార్లు తాను మాటలు కలపాలని ప్రయత్నించినా, మోటుగా ముఖం తిప్పించి, వెళ్ళి పోయాడు.

ఇన్నాళ్ళకు ఈ ఉత్తరం. తనతో మాట్లాడవలసినంత అవసరమైనా సంగతులేమొచ్చాయో హరికి?

మనసు పరిపరి విధాల పోతూంటే, దడదడలాడుతున్న గుండెలతో హరి ఇంట్లోకి ప్రవేశించాడు గిరి.

గిరిని చూడగానే హరి ఒక్క పరుగున వచ్చి గిరిని గాఢంగా కౌగిలించుకున్నాడు. హరి కౌగిలిలో సమస్తమూ మరిచి, గిరి కూడా, హరిని ఆప్యాయంగా యంగా గుండెలకు హత్తుకున్నాడు. ప్రాణమిత్రులిద్దరూ, సమస్తమూ మరిచి, ఒకరి కళ్ళలోకి ఒకరు సంతృప్తితో సంతోషంతో చూసుకున్నారు.

అంతలో గిరి తెలివి తెచ్చుకుని "హరీ! నువ్వెప్పుడూ నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తూనే ఉంటావు. మళ్ళీ ఏమొచ్చిందో చెప్పు" అన్నాడు.

హరి ముఖం చిట్లించి నవ్వుతున్న పెదిమలను

# సంపెంగ పొదలు

31 వ పేజీ తరువాయి

పంటితో నొక్కి పట్టి "దుర్గ కొడుకును కందని తెలిసి, ఇక్కడే కూర్చున్నావా? మేమంత కానివాళ్ళమయి పోయామన్న మాట!" అన్నాడు. గిరి మొదట తెల్ల బోయాడు. అంతలోనే అతని కంతా అర్థమయింది. వర్ణింప నలవి కాని ఆనందంతో అతని కెక్కడ లేని హుషారూ వచ్చింది. చేతులు జోడించి "ఈ దాసుడు తమ ఆజ్ఞకు సర్వదాబద్ధుడు" అన్నాడు.

"అయితే, రైల్వే స్టేషనుకి పద!"

"చిత్తం! ఏ ఊరికో అడగవచ్చా!"

"అవసరం లేదు—"

సూటు కేసూ అదీ!! ........

"వెనున్నానులేహోయ్ పద! పద! "

ఒకరి వెనుక ఒకరు వస్తున్న హరి, గిరిలను చూసి దుర్గ సంభ్రమంతో "గిరి" అని కేక వేసింది. గిరి దుర్గ దగ్గిరగా వచ్చి ఆమె తల నిమురుతూ "ఉద్రేక పడకు. విశ్రాంతి తీసుకో!" అన్నాడు. దుర్గ కళ్ళనుండి జాలువారుతున్న ఆనందాశ్రువులను తన చేతులతో తుడిచాడు అతని కళ్ళు కూడా చెమ్మగిల్లాయి. ఆప్యాయంగా "పిచ్చి పిల్లా!" అన్నాడు. శంకర్ చేతిని మృదువుగా నొక్కుతూ "శంకర్! నీ దుడుక్కుకు కళ్ళెం వేసేవాడూ, మా దుర్గకు అంగ రక్షకుడు, జన్మించాడు. ఇంక ఆటలేం సాగవు. జాగ్రత్త" అన్నాడు.

దుర్గ అందుకుని "పాపం! ఈయన ఆటలేం ఉన్నాయి గిరి! ఏదో ఆ మాత్రం బలహీనతలెవరికైనా ఉంటాయి." అంది. గిరి పకపక నవ్వాడు

"అహ్హో! భర్త గారి మీద ఈగ వాలనీయదు. లెంపలేసుకుంటున్నానులే దుర్గా !"

చిన్న సూటుకేసు చేత్తో పట్టుకుని ఎంతో గాభరాగా అక్కడకు వచ్చిన ఉమను చూసి హరి తప్ప అందరూ ఆశ్చర్య పోయారు. ఉమ కూడా అంతే ఆశ్చర్యంగా అందరి వంకా చూసి సూట్ కేస్ క్రింద పారేసి, సోఫాలో కూలబడి "హమ్మయ్య! అందరూ సుఖంగా ఉన్నారు. నాకు కాస్త మంచి నీళ్ళియ్యండి ఎవరైనా?" అంది.

శంకర్ గ్లాసుతో మంచి నీళ్ళందిచ్చాడు. గిరి ఆశ్చర్యంగా ఉమ వంకా, హరివంకా చూడ సాగాడు. హరి పెదవుల మీది కొంటె చిరునవ్వు అతనికేదో అనుమానాన్ని కలుగ జేసింది. గుండెలు దడదడ కొట్టుకున్నాయి.

తన ముఖానికి పట్టిన చెమటను చేతిరుమాలుతో తుడుచుకుంటూ "అలా వైరిచ్చావేం బావా! ఏం కొంప మునిందోనని హడలి పోతూ పరుగెత్తుకొచ్చాను. ఎందుకిలా చేసావ్?" అంది ఉమ.

హరి నవ్వుతూ "కొంపలు మునిగాయి కనుకనే వైరిచ్చాను. ఈ గిరి చూడు లేకపోతే, పెద్ద పెద్ద త్యాగాలు చేసి గొప్ప వాడై పోదామనుకుంటున్నాడు. నేనా, సాగనిచ్చేది?"

హరి మీసాలు మెలేసుకున్నాడు.

గిరి ముఖం ఎర్రబడింది. "నేను త్యాగాలు ఏమీ చెయ్యలేదు. నా వస్తువు దేనినైనా వదులుకుంటే కదా, త్యాగం చెయ్యటానికి? ఇక చేస్తే నువ్వు చెయ్యాలిప్పుడు గొప్పతనానికి."

"పోనీలేహోయ్! నేనే చేస్తాను త్యాగం! ఇలా రా **ఉమా!" అంటూ ఆయోమయంగా నిల్చున్న** ఉమను బలవంతంగా గిరి దగ్గరకు లాక్కొచ్చి, ఆమె చేతిని గిరి చేతిలో పెట్టబోయాడు— గిరి వెంటనే, తన చేతిని వెనక్కు లాక్కుని "నాటకం లోలాగ చెయ్యకు ఇది నాకెంత మాత్రమూ ఇష్టం లేదు" అన్నాడు గిరి.

హరి అంతకంటే తీవ్రంగా "ఇది నాటకం కాదు నీ నాటకానికి భరత వాక్యం. నా మరదలిని అన్యాయం చేస్తే చూస్తూ ఊరుకుంటాననుకున్నావా?" అన్నాడు.

గిరి ఆవేదనతో "నా మాట విను హరీ! నువ్వూ ఉమా భార్యా భర్తలయితే చూసి సంతోషించాలని కోరుకుంటున్నాను." అన్నాడు. హరి స్నేహ స్వరంతో "నేనూ, సరిగ్గా అదే కోరుకుంటున్నాను గిరీ! నేనేదో త్యాగం చేస్తున్నాననీ అనుకోకు. ఉమ నా ప్రేమను అంగీకరించి ఉంటే, ప్రపంచంలో ఏ మరే విలువ కోసమైనా ఆమెను వదులుకునే వాడిని కాదు. ఇప్పుడు నేను ఉమను చేసుకున్నా, మా ఇద్దరిలో ఎవరమూ సుఖ పడలేము. మీరైనా సుఖ పడండి. నన్నెప్పుడూ మీ స్నేహితుడిగా భావించండి." అన్నాడు. అతని కంఠం స్వల్పంగా గద్గదికమయింది.

దుర్గ సంతృప్తిగా అందరి వంకా చూస్తూ "మీరంతా నావాళ్ళని చెప్పుకోటానికి గర్వంగా ఉంది. దేవతలు." అంది. గిరి అడ్డు తగిలి. "దేవతలు అని మమ్మల్ని అవమానం చెయ్యకు దేవతలంటే అసలు ఉద్వేగాలే లేని వాళ్ళు. కాని, మాకు, ఈర్ష్యలూ, కోపాలూ, ద్వేషాలూ, ఆకర్షణలూ, ప్రలోభాలూ, అన్నీ ఉన్నాయి. కాని, మా బలహీనతలు, మేము గుర్తించ గలిగాం. వాటిని సక్క దిద్దుకోవటానికి ప్రయత్నించాం. మీరు అసలైన మానవులు అంటే మమ్మల్ని నిజంగా పొగిడిన దానివవుతావు." అన్నాడు. శంకర్ "అయితే ఇక ఉమ తేజ్ పూర్ వెళ్ళదా?" అన్నాడు. ఉమ వెంటనే "తప్పక వెళతాను." అంది.

శంకర్ గిరి వంక చూసాడు. గిరి నవ్వి "ఉమ ఇష్టానికి నేను అడ్డు రాను" అన్నాడు.

శంకర్ ఆశ్చర్యంగా "ఇద్దరూ చెరొక చోటా.." అని మాట పూర్తి చేయక ముందే, గిరి అడ్డు తగిలి ఇద్దరమూ చెరొక చోటా ఎందుకూ? నేనూ అక్కడికే వెడతాను." అన్నాడు.

శంకర్ ఆశ్చర్యం మరింత అధికమయింది.

"ఇక్కడ ఇంత మంచి ప్రాక్టీస్ వదులుకుని వెడతావా, ఆడదాని సంపాదనతో బతుకుతావా?"

గిరి నిరసనగా అన్నాడు —

"నా భార్య చదువుకున్నది కావటానికీ, ఉద్యోగస్తురాలు కావటానికీ, నాకభ్యంతరం లేనప్పుడు ఆవిడ నాకంటే ఎక్కువ సంపాదిస్తే మాత్రం నేనెందుకు అభ్యంతరం పెట్టాలి? మా మధ్య అనురాగ బంధం తప్ప ఎక్కువ తక్కువలు లేవు."

ఈ సమాధానం శంకర్ మనసుకు అంగీకారం కాకపోయినా, గిరితో వాదించలేక ఊరుకున్నాడు.

తన భర్తతో బయల్దేరుతున్న ఉమకు వీడ్కోలివ్వటానికి స్టేషన్‌కు వచ్చిన జానకి "ఉమా! నీ అంగీకారం లేకుండా నీ ఉత్తరాలన్నీ హరికి చూపించాను. మా అందరి క్షేమమూ కోరి అలా చేశాను. క్షమించు." అంది.

ఉమ జానకిని కౌగిలించుకుని "నువ్వు నాకు మహోపకారం చేసావు. క్షమించటమేమిటి? ఎన్ని జన్మలకయినా నీ ఋణం తీర్చుకోలేను." అంది.

గిరి నవ్వుతూ "మీరింత వారని అనుకోలేదు" అన్నాడు.

జానకి గిరి వంక తిరిగి "గిరిగారూ! మీకందరికీ అనవసర మనస్తాపం కలిగించిన అన్నయ్య తరఫున నేను క్షమాపణ వేడుకుంటాను." అంది.

"మన జీవితాలు సంపెంగ పొదలవంటివి. తీయని పరిమళాన్ని వెదజల్లే ఆ పుష్పాల మాటున ప్రచ్ఛన్నంగా కాలనాగులు కూడా ఆవాసాన్ని కల్పించుకుంటాయి. మనసుల్ని పవశింప చేసే ఆ దివ్య సుగంధాలతోపాటు వొడలు జలజదరింప చేసే ఆ విషవాయువులు కూడా మనం భరించక తప్పదు."

"జానకి గారూ! నేటి మన సమాజం అహమహమికతో ముందుకు పరుగెత్తుతూంది కానీ ఈ పరుగు సమసౌష్ఠవంగా లేదు. కొంత భాగం మరీ ముందుకు ఉంటే, కొంత మరీ వెనుకబడి ఉంది— ఒక నిర్దిష్టమైన క్రమంలో స్థిరమైన విలువలను ఏర్పరచుకోని మన సమాజంలో మన మంతా ఉక్కిరి బిక్కిరి అవుతున్నాం ఇందులో ఒకరిని ఒకరు నిందించుకోవలసింది కానీ, క్షమార్పణ కోరుకోవలసింది కానీ ఏమీ లేదు."

అవునన్నట్లు రైలు కూసింది. గిరి, ఉమ, జానకి దగ్గర సెలవు తీసికొని పెట్టెలో ఎక్కి కూర్చున్నారు

ఒకరి చూపులకు ఒకరు పరవశించి పోతున్న ఆ దంపతులను ఒక స్టేషన్ నుండి మరొక స్టేషన్‌కు చేర్చాలనే ఆత్రుతతో రైలు ముందుకు సాగింది.

—ఐపోయింది. ★






# రామచరిత మానస్

తులసీదాసు



తెలుగు ముంగర శంకరరాజు

## 29

వాహాతతి క్షతగాత్రుడగుట గాంచి నృపాలుడు రోషముతో కన్నులెఱ్ఱజేసి శాత్రవ భయంకరముగ ధనుష్టంకారమొనరించి, ఆకర్ణాంతము నారి లాగి, శర సహస్రములు పుంఖానుపుంఖములుగా వదలి, వైరినివహములపై బాణపాతము వర్షించెను. ఆ శరపాతమునకు దశకంఠుని రథము విరిగెను. సారథి తల తెగి క్రింద బడెను. అశ్వములు నేలకూలెను. పతాక ధ్వజములు ఖండఖండలై విరజిమ్మబడెను. విరథుడైన రావణుడు తటాలున మరొక రథముపై కెగిరి, దండతాడిత భుజంగము కరణి రోషోగ్రుడై బుసలు కొట్టి పది త్రిశూలములు ప్రయోగించి రాముని రథాశ్వములు నేల కొరుగునట్లు చేసి బిట్టార్చెను.

దేవ హయములు తిరిగి నిల్ద్రొక్కుకుని లేచెను. రాముడు సంగ్రామాభిరాముడై పరాక్రమించి ఒక్కసారిగా నూరు బాణములు దశకంఠుని తలలకు గురిపెట్టి కొట్టెను. కమల వనములో తుమ్మెదలు ప్రవేశించు భంగి బాణములు రావణుని తలలో దూరి వాని శిరములను భుజములను ఖండించెను. కానీ రెప్పపాటులో రావణునికి క్రొత్తగా తలలు భుజ దండములు మొలచి వచ్చెను. నరపాలుడు పునః పునః దానవుని తలలు తెగి క్రిందబడునట్లు కొట్టెను. కానీ యథా పూర్వము వానికి తలలు చేతులు మొలచుచుండెను. ఇట్లనేక మార్లు జరిగెను. పలుమార్లు రామ బాణావళిచే ఖండింపబడిన రాక్షసేశ్వరుని తలలు భుజములు బాణములకు గ్రుచ్చుకొని రాహువు కేతువువలె పైకెగురుచుండెను. ఆ శిరోఖండముల సంఖ్యాకములై ఆకసమున వర్తించుచూ — అంగదుడెక్కడ! ఆంజనేయుడెక్కడ దాగె! రాముడేడీ! లక్ష్మణుడేడీ! — అని వికృతస్వరమున పలుకుచుచుం వానరులను భయభ్రాంతులను జేయుచుండెను.

రామరావణులు మహారథికులు. వారి సంగ్రామము సర్వలోక భీతావహముగా సాగెను. [illegible] వంతకు విశ్వస్నైర్యము [illegible] పోరాడెను. ఆ సమయమున వాడొక కరాళశక్తిని సూటిగా ప్రత్యర్థిపై ప్రయోగించెను. ఆ ప్రాణాంతకశక్తి విభీషణుని మీదికి పోవుచుండుట గమనించి తటాలున రావణానుజుని వెనుకకునెట్టి తాను స్వయముగా దాని ముందట నిలచెను. ఆశక్తి హృదయమును దాకుటచే రామమూర్తి కొంత తడవు స్పృహదప్పి నేలబడెను.

## విభీషణుడు రావణు నెదుర్కొనుట

శ్రీరాముడు శక్తితగులుటచే మూర్ఛిల్లుట విభీషణుడు ఆగ్రహోదగ్రుడయ్యెను. అతడు అగ్రజుని కెదురు నడచి రూక్ష స్వరముంబున రావణు నిట్లు ధిక్కరించెను.

"రావణా! శిరో పుష్పములు సమర్పించి శివుని పూజించియుంటివి. మహేశ్వరుని వరప్రభావము వలన కోటితలలు పుట్టుచుండునంత వరకే నీవు జీవించగలవు. జానకీనాథుని ధిక్కరించి జగములేల దలచిన మూర్ఖమతీ! ఇప్పుడు నీ తలలపై మృత్యువు తాండవించుచున్నది."

అని భర్జించి విభీషణుడు రావణుని గదతో మోదెను. వాడా దెబ్బనుండి తేరుకుని తమ్మునిని తీవ్రముగా ఢీకొనెను. ఆ యన్నదమ్ము లిద్దరు రోషోద్దీపితులై బాహాబాహి మల్ల యుద్ధము చేయసాగిరి. విభీషణుడు పెద్ద కాలము ద్వంద్వ యుద్ధముచేయుచూ అలసిపోవుట గమనించి మహావీరుడప్పుడు భూరి భూర మొకదానిని కొని తెచ్చి, దానితో దానవ వీరుని ప్రహరించి వాని రథ హయ సారధులను మర్దించెను. విభీషణుడా సమయమున అవధేశునొద్దకు పోయెను.

దేవాంతకుడు ఆంజనేయునిపై బడెను. మారుతి వానికి చిక్కక ఆకాశమునకెగరెను. మారుతి వాలము పట్టుకొని వాడుకూడా పైకెగసెను. వినువీధిలో ఆ వీరులిద్దరు కొద్దికాలము కజ్జలగిరి సుమేరు పర్వతములవలె ఘోరముగా పోరాడిరి. మహావీరుడు 'బోలో రామ్' అని కేకబెట్టి రావణునొక పిడిగ్రుద్దు గుద్దెను. నిశాచరుడా ప్రహారమునకు సలగినుండి వచ్చి నేలబడెను. పునః రావణ హనుమంతులిద్దరు భూమిపై ముష్టి యుద్ధమునకు పూనుకొనిరి.

భల్లూకములు హనుమంతునికి సహాయము వచ్చెను. సురవైరి ద్విగుణీకృతోత్సాహముతో వానర సేన నెదుర్కొని మాయా యుద్ధమునకు పూనుకొనెను. కటకములోని ప్రతికపివీరునికి ఒక్కొక్క రావణుడు ప్రత్యక్షమయ్యెను. ఆ పావ భూమి యందెల్లెడల అసంఖ్యాకులగు రావణులవతరించుట గాంచి దేవతలు దిగులొందిరి. వానర భల్లూక యోధులు భయాశ్చర్యకంపితులై "హా, రామ లక్ష్మణులారా! రక్షింపుడు! రక్షింపుడు!" అని వెఱ్ఱి కేకలు బెట్టి ఆరుతైరి.

అత్తరి అవధ భూపతి ఒక్క బాణ ప్రయోగముతో రావణుని కృత్రిమ రూపములన్నిటిని తెగటార్చి వాని మాయనుండి వానరులకు విముక్తి కలుగజేసెను. తద్వారా ఆజిలో అసురేశుడు ఒక్క రూపుతోనే నిలబడియుండెను. స్వర్లోకవాసులాశుభ పరిణామమునకెంతయు సంతసించి శ్రీరామునిపై సుమన వృష్టి కురిపించిరి.

రావణుడు దేవతల దుడుకుతనమునకు రోషోన్మత్తుడై పైకెగసి దేవతలమీద కురికెను. దివిజులు హా హాకారములు చేయుచూ భయాక్రాంతులై పలాయన మంత్రము పఠించిరి. అప్పుడంగదుడు వియత్తలమున రావణుని వెన్నంటి, వాని కాళ్ళు పట్టుకుని త్రిప్పి భూమిపై కొట్టెను.

నేలపై బడిన నిశాటుడు నిముసములో లేచి కోపావేశముతో కన్నుల అగ్ని జ్వాలలు గ్రక్క పదిచేతుల పది ధనుస్సులు పుచ్చుకొని శరపాతముచే శాఖాచరులను దారుణముగా ధర్షించెను. ప్లవంగ వీరులు తమ పాషాణ శిలాఖండములతో ప్రాణములకు తెగించి రావణుని దాడి నెదుర్కొనిరి. కమలములపై తుమ్మెదలు విహరించునట్లు నలనీలులిద్దరు వాని వాని తలలచుట్టూ తిరుగుచూ అనేక విధముల హింసింప మొదలిడిరి. వీరి ఆగడములకు వాడాగ్రహించి నలనీలుర పాదములు ఒడిసి పట్టుకొని నేలకేసి కొట్టి బిట్టార్చెను.

దశాననుడంత మరింత భీకర రూపముతో విజృంభించినవాడై, శక్తిశూల ఖడ్గ గదా ప్రహారములతో వానరానీకమునంతటినీ నిముషములో నిర్జించి శాత్రవ భయంకరముగా సింహనాదము చేసెను. ఆ సమయమున ఋక్షరాజు జాంబవంతు డెచటినుండియో వచ్చి బలముకొద్దీ పౌలస్త్యుని పాదములతో తన్నెను. ఆ తీవ్ర చరణాహతికి తలలు దిమ్మెక్కినట్లయి దానవ నాథుడు నేలబడి స్పృహ గోల్పోయెను.

అప్పటికే దినాంతమై చీకట్లు క్రమ్ముటచే సారథి మూర్ఛాగతుడైపడి యున్న రావణుని తో రథము తోలుకొని లంకలోనికి పోయెను.

## త్రిజట సీత నాశ్వాసించుట

"తెహి నిసి సీతా పహి జాయీ,
త్రిజటా కహి సబ కథా సునాయీ"

ఆ రాత్రి త్రిజట సీతకు రామరావణులకు జరుగుచున్న యుద్ధగతిని గురించి విశదీకరించి చెప్పెను. లోక కంటకుని తలలు యెన్నిమార్లు ఖండించినను తిరిగి మొలచుచుండిన వార్త ఆమెకు దుఃఖ పుట్టించెను. అప్పుడు భూపుత్రి

దీనస్వరంబున త్రిజటనిట్లు అర్థించెను.

"తల్లీ త్రిజటా! సురాంతకుని శిరములెందుకిట్లు మాటిమాటికీ మొలచుచున్నవి ఆ పుష్కరుడు మరణించుటకు మార్గోపాయమేమిటి! త్రిజటా! ఏ దుర్దినము నా యెదుటికి మాయా మృగమును తోలియుండెనో, యే దుర్విధి నాచే లక్ష్మణమూర్తిని దుర్భాషలాడించెనో, యే వక్ర రేఖ నన్ను దీర్ఘ వియోగాగ్ని క్రాలునట్లు చేసెనో ఆ ప్రతికూల దైవమే రావణునికి తెగిన తలను తిరిగి సృష్టించుచున్నది ఓ త్రిజటా! భగవంతుడే నాకు ప్రతికూలుడై యున్నాడు"

కాని దీనాలాపములకు దనుజకాంత హృదయము ద్రవించిపోయెను ఆమె సానుభూతి పూర్వకముగా వైదేహినిట్లు ఊరడించెను.

"అమ్మా వైదేహీ! దిగులొందక ధైర్యమవలంబించుము రావణ వధ నిక్కము, వానికి కాలమాసన్నమైనది సుర వైరిని వధించుటకు ఒక్క రామ బాణము చాలునని నమ్ముము. కానీ రావణుని హృదయము ఛేదించుటకు రాము డెందులకో సంశయించుచున్నట్లు తోచుచున్నది జానకీ! సర్వ లోకములు సాకేతవాసునిలోనున్నవి. ఆ సౌమ్యమూర్తి సదా నీ హృదయములో నివసించుచున్నాడు నిన్ను రావణుడు తన యెదలో నిలుపుకొని యున్నాడు. ఇందుచే, శోక నిద్రావణుని హృదయము ఛేదించిన లోకములకు కీడు మూడునేమో యని స్వామి సందేహించు చుండవచ్చునని నే నూహించుచున్నాను" అని పలికి త్రిజట తిరిగి సీత నిట్లా శ్వాసించెను —

"మైదిలీ రామబాణమునకు రావణుడు నిల్కుట నిక్కము. అందుకు కొంత వ్యవధి కావలసి యుండును. ఎందులకన, రాఘవుడు రావణుని తలలు తెగగొట్టుచునే యుండును. ఇట్లు మాటి మాటికీ శిరచ్ఛేదనము జరుగుచుండుటచే నిశాచర నాథుడు చిత్తశాంతి లేక నిన్ను విస్మరించును. అప్పుడు రామధనుర్ముక్త శిలీముఖ జ్వాలలు రావణాసురుని దహించివేయగలవు."

అని ధైర్యోక్తుల సీత నూరడించి త్రిజట నిజ నివాసమునకేగెను. ఆ రాత్రి వైదేహి వామాంగములదరి శుభ నిమిత్తములు తోచెను.

## రావణ సంహారము

ఋక్షవీరుడైన జాంబవంతుని ముష్టిఘాతమునకు అసురనాథుడు స్పృహ కోలుపోగా సారథి వానిని స్వగృహము చేర్చియుండెను అట్లు మూర్ఛాగతుడై పడియున్న రావణుడు అర్ధ రాత్రికి కన్నులు తెరచి తనకు గలిగిన పరాభవమునకెంతయు వెచ్చనూర్చి సారథి నిట్లు తూలనాడెను — "ఓరీ మూర్ఖా! రణరంగమునుండి నన్నెందుకు వేరు చేసితివి? అధమా! నీ చర్య యెంత నీచమైనదీ, గర్హితమైనదీ తెలుసుకొనలేకున్నావు" అసురేశుడిట్లు ఆగ్రహావమానములకులోనై దుర్భాషలాడుచుండ దల్లున తెల్లవారెను. పౌలస్త్య వీరుడు పునః సకలాయుధ సంపత్తితో సమాయత్తుడై స్యందన మధిరోహించి సమరభూమికి ప్రస్థానము చేసెను

రణోత్సాహి రావణబ్రహ్మ కాలాంతకుని పగిది కదలివచ్చుట గమనించిన రామదండు — సంత తడవు హర్ష విషాదములకు లోనయ్యెను. తదుపరి వారు తరు శైల శృంగములు చేపట్టి అర్భాటము చేయుచూ పురోగమించి నిశాచర నాథుని యెదుర్కొని దారుణముగా పోరాడిరి వానరభల్లూకవీరులు వీరోన్మత్తులై విజృంభించి వైరి బలమును నిమిషములో నిరవశేషముగా నిర్జించి దశకంఠునిపై ముసురుకొని వానిని నానా విధముల నొప్పించసాగిరి

బహు బాహుడా వానర బాధల కోర్వలేక అదృశ్యుడై మాయా యుద్ధమునకు పూనుకొనెను తత్ప్రభావముచే నిముషములో యుద్ధభూమి భూత ప్రేత పిశాచ గణములతో నిండిపోయెను వికృతాకారులగు భూతగణములు వైరి భయంకరముగా వికటాట్టహాసములు చేయుచూ, కపాలములతో, రక్తము త్రావుచూ కదనభూమిపై కన్పట్టసాగిరి చిటపట అగ్ని జ్వాలలు రగుల్కొనెను పై నుండి ఇసుక వాన పడెను ఆపైన అనేకులగు ఆంజనేయులు ఆవిర్భవించి సాకేత పతిని చుట్టుముట్టి కేరింతలు గొట్టుచూ గంతులువేయజొచ్చిరి రాఘవుడా రాక్షసమాయకు ఆగ్రహావేశుడై నొప్పించి ఒక్క శిలీముఖమును అభిమంత్రించి వదలెను ఆ బాణ ప్రయోగముతో రాక్షస మాయ విచ్ఛిన్నమై రణాంగణము పూర్వ స్థితికి వచ్చెను

అప్పుడు పరస్పరాభిముఖులై నిలబడియున్న రామ రావణులతో సమరభూమి శోభించెను అపూర్వము అతి భీతావహమైన ఆ రామరావణుల ఘోర యుద్ధమును వర్ణించుట అనేక కోట్ల ఆదిశేషులకు కూడ అలవిగాని పని రామరావణ యుద్ధమునకు రామరావణ యుద్ధమే సాటి —

రామరావణ యోర్యుద్ధం
రామరావణయోరివ

రాముడు సంగరాభిరాముడై దీప్తిజెంది, దిక్తటంబులదురునట్లు ధనుష్టంకారము చేసి, శత శత నిశిత సాయకములు ప్రయోగించి శత్రువుని బాహువులను శిరములను ఛేదించెను రామధనుర్ముక్త సాయకానీక పాతమునకు రావణుని మస్తక—హస్తములు తెగి భూపతనమగుచుండెను కానీ వానికి తలలు చేతులు తిరిగి పుట్టుచుండెను. లోభికి ఉత్తరోత్తర లోభము ద్విగుణీకృత మగుచుండునట్లు పునః పునః పౌలస్త్యునికి శిరో భాగములు — బాహు దండములు యథా పూర్వము వృద్ధి బొందుచుండెను. పలుమార్లు బాణములు ప్రయోగించి, బహువిధముల ప్రయత్నించి, రాముడు రావణుని శిరములు ఛేదించుటయందు సఫలీకృతుడు కాజాలక పోయెను.

రాముడంత సుంత విసుగుకొని, పార్శ్వభాగమందున్న విభీషణుని సార్థక దృక్కుల జూచెను. అంతట రావణానుజుడు రఘుపతి వివశతను గ్రహించినవాడై —

"నాభికుండ సుధా బస యాకే
నాథ జియత రావను బలుతాకే

"నాథా! సురారి నాభిస్థలమందున్న అమృత భాండమున్నది. తత్ప్రభావముచే వాడు పునర్జీవితుడగుచున్నాడు కనుక మొదట ఆ అమృత భాండమును శోషింపజేయుము" అని సీతాపతికి సూచించెను.

విభీషణుని సూచనకు రఘువీరుడు అమిత ప్రసన్నుడై తక్షణమే మహాస్త్రమును కోదండమునకు సంధించెను. రఘూద్వహుడట్లు శర సంధానము చేసినపుడు దానవాళికి దుర్నిమిత్తములు తోచెను. నీచ జంతువులు కూతలిడెను. అంతరిక్షమున తోకచుక్కలు కనబడెను, దిశాంచలముల మంటలు వ్యాపించి అగ్రహము మేర్పడెను. మయ తనయ మండోదరి హృదయము అజ్ఞాత భీతిచే కొట్టుకొనెను రాజప్రాసాదములందున్న ప్రతిమలు కన్నీరు గార్చెను. భూమి కంపించి, గాలులు రేగి, పిడుగులు పడి, నెత్తుటి వానకురిసి, ప్రళయకాల భయోత్పాతములు కలిగెను.

రఘువీరుడంతట ప్రత్యాలీఢపదస్థుడై, ఆకర్ణాంతము నారిలాగి, గురిచూచి, ముష్కరునిపై 'ముప్పది యొక్క బాణములు వదలి పెట్టెను ఆ బాణ సమూహము కాలసర్పములవలె గమించి రావణుని దాకెను దశకంఠుని నాభికుండము — శిరము బాహువులు ఛేదింపబడి నేల దొర్లెను. అప్పుడు బాహు శిరో రహితమగు రావణుని కళేబరము కంపించునట్లు అడుగులువేయుచూ అవధేశుని కభిముఖముగా నడచెను. అట్లు తనపై బడుటకు ముందుకు వచ్చుచున్న రావణ కళేబరము కోదండ రాముడొక్క కోలతో రెండుగా ఖండించి ధరాతలముపై పడగొట్టెను దశరథనందనుని బాణములు రావణాసురుని తలలను చేతులను మండోదరి యెదుట చేర్చి తిరిగి స్వామి తూణీరమును చేరుకొనెను చైత్ర శుద్ధ దశమినాడు దానవపతి తన శరీరము విసర్జించెను. ఆ సమయమున దశకంఠుని తేజస్సు దాశరథిలో లీనమయ్యెను. రావణ వధానంతరము సమరాంగణమును శోభింపజేసిన కోదండము రాముని దివ్య వైభవమును శ్రీ గోసాయి తులసీదాసిట్లు స్తుతించెను

" —సుర సుమన వర్షహి హర్ష —
సంకుల బాజ దుందుభి గహాగహే,
సంగ్రామ అంగన రామ అంగ —
అనంగ బహు శోభాలహే,
శిర జటా ముకుట ప్రసూన బిచ —
బిచ అతిమనోహర రాజహీ,
జను నీలగిరి పరతదిత పటల —
సమేత ఉడుగున భ్రాజహీ,
భుజదండ సర కోదండ పేరిత —
రుధిర కన తన అతిబనే,
జయు రాయు మునీ తమాల పర
వై గీ విపుల సుఖ ఆపనే, —"

నిశ వీధిలో తటిల్లతా నక్షత్ర కాంతితో విరాజిల్లు నీలగిరి శృంగాగ్రమువలె, రణాంగణమున రామమూర్తి పుష్పాలంకృతమైన శిర జటాముకుటములతో శోభిల్లెను. శ్రమాధిక్యతచే యేర్పడిన స్వేదకణములతో శ్యామలాంగములు శోభించుచుండ, సమరాంగణమున ధీర గంభీరుడై నిలబడియున్న కోదండపాణి శ్రీరాముని దివ్య సుందర విగ్రహముపై ఆ సమయమున పుష్ప వృష్టి జరిగెను దేవ దుందుభులు మ్రోగెను, మునులు, వానరులు, నరులు హర్షోత్సాహముతో దిశలు ప్రతిధ్వనించునట్లు జయ జయ ధ్వానములు చేసిరి. కోసలేంద్రుని కృపా కటాక్ష వీక్షణాలచే సర్వలోకవాసుల నిరాపదతో నిర్భయులై సుఖించిరి.

# రామచరితమానస్

## మండోదరి విభీషాదులు అసురేశునికై విలపించుట

ప్రాణేశుని ఖండిత శిరములు గాంచి మండోదరి దుస్సహ దుఃఖా క్రాంతియై నేలబడి దుర పిల్లెను. రావణుని మరణవార్తకు శుద్ధాంత కాంతా జనమంతయు శోక వ్యాకులితయై క్షోభించెను. శోకార్తయగు రావణపత్ని మండోదరిని పరిచారి కలు రావణుడు నేలకొరిగిన రణస్థలికి తీసుకుని పోయిరి.

అమేయ బలసంపన్నుడగు తన జీవితేశ్వరుడు విగతజీవుడై ధరణీ తలమున దొర్లియుండుట గాంచి మండోదరి గుండెలు బాదుకొనుచు యెలుగెత్తి ఏడ్వసాగెను —

"హా ప్రాణేశ్వరా! అనన్యబల శౌర్య సంపన్ను డవగు నీకు యెట్టి దురవస్థ సంఘటిల్లెను! హా నాథా వీరాధి వీరా! నీ బల దర్పంబులకు జడిసి భూదేవి గడ గడలాడుచుండెను, సూర్యచంద్రాదులు తేజో విహీనులై వెలవెల బోవుచుండిరి, వాయు వరుణ ఇంద్ర కుబేరాది దిక్పతులు నీ ఘాటకు ఓర్వలేక దిగంతములకు పరుగులెత్తుచుండిరి. నీ వీర్య శౌర్యంబులు కాలునే ధిక్కరించి తేజరిల్లుచుండెను కొండంత బంధు బాంధవ బలము నీ అండ దండల నిలచియుండెను, జగములను గజగజ లాడించిన ఓ రణధీరా! రావణపతీ! నేడు నీకెట్టి దుర్మరణము సంప్రాప్తమాయెను! జగదేకవీరా! భూమిపై బడియున్న నీ దృఢ శరీరముపై గృధ్ర కాకములు కూర్చొని యున్నవే! నీ దండి బాహు దండములను నక్కలు నోట గరచుకొని తిరుగు చున్నవే! అయ్యో! నేడు నీకై యేడ్చుటకు బంధు శేషము కూడ లేకపోయెనా! నాథా! కాలవశుం డవై నా ప్రార్థన మన్నించకపోతివి, జగన్నాథుడు శ్రీపతితో వైర మపేక్షించి ఇట్టి దుర్దశకు ఒడి గట్టితివి. దుర్విధి ప్రేరణచే పరపీడనా తత్పరుడ వైనందున నేడు నీ కిట్టి దురవస్థ సంఘటిల్లెను గదా! ప్రాణేశ్వరా! జానకీవల్లభుడు దయా మయుడు. నీ దోసములు లెక్కించపక నీకు తన దివ్యధామము ప్రసాదించిన ఆ కరుణామూర్తి సాకేత పతికిదే చేయెత్తి మ్రొక్కులిడుచుంటిని...."

పతివ్రతా కాంతామణి తన భర్త మృతికై ఇట్లు నానావిధముల విలపించెను. మండోదరి పతిగతప్రాణ—సౌశీల్యవతి ఆమె జ్ఞానద్రష్ట యగుటచే దుఃఖార్తురాలైనను వివేకము కోల్పో కుండెను. సురులు, నరులు మునులు, సిద్ధులు బ్రహ్మ మహేశ్వరులు రావణపత్నికి పరమాత్మచింతన పట్ల గల ప్రగాఢ విశ్వాసమున కచ్చెరువొంది ఆమె పునీత చరిత్రను పలువిధముల శ్లాఘించి పరితుష్టులైరి.

విభీషణుడు పూర్వ వైరంబులు విస్మరించి, అగ్రజుడు అసువులు గోల్పోయినందుకు దుఃఖ వివశుడై దురపిల్లెను. శోక విహ్వలురై విలపించు చున్న రాక్షసస్త్రీల గోడు చూచినప్పుడు విభీష ణుని హృదయము వ్యథచెందెను. ఆ శోక సమయ మున దయానిధి దాశరథి దుఃఖదీనుడై విల పించుచున్న విభీషణుని ఉచిత ప్రసంగోక్తుల ఓదార్చి సఖా విభీషణా! గతించిన దానికై దుఃఖిం చక సోదరునికి ఉత్తర క్రియలు సొంతముగ నిర్వ ర్తింపుము—అని బోధించి పంపెను.

తదనంతరము రావణానుజుడు రామాజ్ఞను శిరసావహించి అగ్రజునికి అంత్యక్రియలు విధి విహితముగ ప్రగాఢభక్తి శ్రద్ధలతో జరిపించెను. ఆ సందర్భమున స్త్రీలు—వృద్ధులు, బంధువులు, మిత్రులు, ఆప్తులు మున్నగు రాక్షసు లనేకులు తుదిసారిగ రావణునికి తిలాంజలు లర్పించి అంజలి ఘటించిరి. పిమ్మట రాక్షసులు రఘుపతి గుణ గణములు కీర్తించుచూ నిజ నివాసములను చేరు కొనిరి.

## విభీషణునికి లంకారాజ్య పట్టము గట్టుట

అసురేశుని పరలోక క్రియలు పూర్తిగావించి విభీ షణాదులు రాముని సన్నిధికి వచ్చిరి. అప్పుడు రామమూర్తి లక్ష్మణమూర్తితో నిట్లనెను—

"సౌమిత్రీ! నీవు—సుగ్రీవుడు—అంగదుడు— నలుడు—నీలుడు—హనుమంతుడు మున్నగువారితో లంకకు పోయి, మనకు మిత్రుడు మహోపకారి యగు విభీషణుని లంకారాజ్య పట్టము గట్టి రావలసి

మూర్తి: ఏంరా! గోపీ అంత భయం భయంగా ఉన్నావేం?

గోపీ: అదేరా ఈరోజే ఆఫీసర్ క్యాంప్‌నుంచి తిరి గొచ్చాడా! మళ్లీ రేపు మా శ్రీమతి కూడా వస్తున్నట్లు ఉత్తరం వచ్చిందిరా!

మాధవ్ (మద్రాస్)

నది. నేను వనవాసవ్రతుండనై యున్నందున ఈ శుభ కార్య నిమిత్తమై లంకలోనికి రాజాలకున్నాను—"

అని అవధేశుడు ఆనతియ్యగా రామానుజుడంత విలంబనము సేయక వానర ప్రముఖులతో విభీష ణుని తోడ్కొని లంకానగరిలో ప్రవేశించెను. వారు రాజ్యాభిషేకమునకు కావలసిన సాధన సామగ్రి నంతయు సేకరింపజేసి, మంత్రి సామంత పురో హిత బంధు బాంధవుల సమక్షమున సర్వ లాంఛన ములతో విభీషణుని లంకారాజ్య సింహాసనముపై అధిష్ఠింపజేసి, శాస్త్రోక్తముగా రాజ్యతిలకము పెట్టిరి. నాటితో రావణ రాజ్యమునకు విభీష ణుడు రాజయ్యెను.

ఈ యుత్సవానంతరము రఘుకుల భూష ణుడు సమీర కుమారుని చేరబిలిచి—సీతకు తన యోగ క్షేమములు తెలియజేసి—రావలసినదని చెప్పి పంపెను. ఆంజనేయుడు లంకలో ప్రవేశించగనే అసురులు అనేక విధముల అతనికి స్వాగత సత్కార ములు చేసి సీతయొద్దకు తీసుకొనిపోయిరి. రావ దూత అల్లంత దూరమున నుండగనే జగదంబ అతనిని గుర్తించినదై—"వీరాగ్రణీ! వనచరులు క్షేమమా! రామచంద్రమూర్తి కుశలమా!" అని కుశలప్రశ్న వేసెను.

వాయునందనుడు వినీత భక్తితో వైదేహికి నమస్కృతుడై—రామలక్ష్మణుల కుశలము, పంక్తి కంఠుని వధ, విభీషణుని పట్టాభిషిక్తుని చేయుట —మున్నగు వృత్తాంత మంతయు సవిస్తర ముగ విన్నవించెను. ఈ శుభవార్త చెవుల బడ గానే అమందానంద పరవశత్వము చెంది ఆనందా శ్రువులు రాల్చి—"కపి పుంగవా! ఈ శుభవార్త నా కెరింగించినందులకు నిన్నేవిధముగ నేను సత్క రించగలను! వత్సా! ఆ సాకేతవాసుడు సోదర సమేతుడై సదా నిన్ననుగ్రహించుచుండుగాక! ఇదే నా యాశీర్వాదము. హనుమంతా! ఇక శీఘ్రమే నాకు ఆ కోమలశ్యాముని దర్శనభాగ్యము లభింప జేయుటకు తగు ప్రయత్నములు చేయుము—"

అని పలికి భూపుత్రి సుప్రసన్నయై సమీర పుత్రుని సాగనంపెను.

## సీతారామ సమాగమము

హనుమంతుని వలన వైదేహి క్షేమముగా నున్నదని విని సీతాపతి సంతోషించెను. ఆవల, విభీషణుడు, అంగదుడు, హనుమంతుడు ఈ ముగ్గురు అవధేశుని ఆదేశానుసారము జానకిని తోడ్కొని వచ్చుటకై లంకకు వెళ్లిరి.

అసురాంగనలు అవనిజకు అభ్యంగన స్నానాదు లొనర్చి, అమూల్య భూషణ వసనాదులచే ఆమెను అలంకరించి బంగారు పల్లకిలో కూర్చుండ బెట్టిరి. సకల రాజ మర్యాదలతో సీతాదేవి అధి ష్ఠించిన పల్యంకిక లంకనుండి నిర్గమించి రామస్కంధావారము చేరుకొనెను. వైదేహిని దర్శించుకొనుటకై వానర భల్లూక సమూహ ములు త్రొక్కిసలాడెను. రాముడు వానరుల తొట్రుపాటు గమనించినవాడై విభీషణుని పిలిచి "—సీత పల్లకి దిగి నడచివచ్చినట్లయిన వానరు లామెను తల్లినివలె దర్శించుకొన గలరు—" అని పలికెను. అందుమీదట జానకి పల్లకి దిగి పాద చారియై ప్రభువున్నచోటు చేరుకొనెను.

మునుపు అరణ్యవాసము చేయుచున్నపుడు రాముడు సీతను అగ్నిదేవుని కప్పగించి యుండెను. ఆమె ఛాయారూపమగు మాయ సీతయే ఇంత వరకు లంకలో నుండినది. ఇప్పుడు దశరథాత్మ జుడు మరల తన నిజ సీతను పొందగోరెను. తన్నిమిత్తమై రాఘవుడు సీతను అగ్నిప్రవేశము చేసి తన నిష్కళంకతను ప్రకటించుకొనుమని— లోకదృష్టికి సీతతో కఠోరముగ పలికెను. వానర రాక్షసులు శ్రీరాముని హృదయ కాఠిన్యతకు మిగుల వ్యథ చెంది కలవర పడిరి.

సీతాదేవి పతి ఆదేశమునకు ప్రతివచనము చెప్పక మరదితో—"లక్ష్మణా! అప్పుడు అగ్ని హోత్రుని సాక్షిగా నేను శ్రీరామచంద్రుని వివాహ మాడియుంటిని. మరలా ఇప్పుడు అగ్నిచే పునీతనై నా స్వామిని సమీపింతును. కనుక నీవు సత్వరమే అగ్నిగుండ మేర్పరచి నా ధర్మ ప్రవర్తనకు సహాయ పడుము—" అని దృఢస్వరమున పలికెను. సౌమిత్రి శోకస్వాంతుడై సుంతకాలము మౌనము ధరించి, తదుపరి అగ్రజుని అభిమతము తెలుసుకొని, కాష్ఠ ములు పేర్చి అగ్ని రగిల్చెను.

అప్పుడు మైథిలి అగ్నిహోత్రునకు అంజలి ఘటించి—హుతాశనా! నేను త్రికరణశుద్ధిగా సదా శ్రీరామునే స్వామిగా సేవించుచున్నాను.

నీవు నాకు చందన గంధమువలె చల్లదనము ప్రసాదింపుము— అని ప్రార్థించి ఆమె అగ్నిలో ప్రవేశించెను. ఆ ప్రచండాగ్నిజ్వాలలు మాయాసీతను క్షణములో దహించివేసెను. అప్పుడు అగ్ని దేవుడు ప్రత్యక్షమై—క్షీరసాగరుడు లక్ష్మీదేవిని శ్రీ విష్ణువుకు సమర్పించుకొనినట్లు—నిజ సీతను తీసుకొనివచ్చి హుతాశనుడు శ్రీరామునికి సమర్పించెను. జగదంబ జానకి శ్రీరాముని వామ భాగమున శోభించెను. ఆ శుభ సమాగమము పురస్కరించుకొని స్వర్లోకవాసులు సంతోషించిరి, దివ్య దుందుభులు మ్రోగెను. పుష్పవృష్టి జరిగెను. నర వానర రాక్షస మునీశ్వరులాది హర్షితులై— జయజయధ్వానములు చేసిరి.

"జానకీ సమేత ప్రభు
శోభా అమిత అపార
దేఖి భాలు కపి హర్షే
జయ రఘుపతి సుఖసార."

## స్వర్లోకవాసులు సాకేతనాథుని స్తుతించుట

యుద్ధానంతరము ఇంద్రసారథి మాతలి ఇనవంశ కులదీపకునికి సాష్టాంగ మొనర్చి, సెలవు తీసుకొని రథముతో ఇంద్రపురి కేగెను.

లంకేశుడు లోక కంటకుడు. ఆ దేవ ఘాతకుని నిర్జించి దాశరథి జగత్త్రయమును రక్షించెను. ఆ శుభ సమయమున దివిజులు దశరథాత్మజుని చెంగట నిలచి ముకుళితహస్తులై స్వామి నిట్లు స్తోత్రించిరి.

రావణ పాప మూల సురద్రోహీ,
సోఉ కృపాల తనధామ సిధాహి ॥
హమ దేవతా పరమ అధికారీ
స్వారథ రత తవ భక్తి బిసారీ ॥
భవ ప్రవాహ సంతత హమ పరే,
అబ ప్రభు పాహి శరణ అనుసరే ॥

"ఓ, సర్వజ్ఞా ! శ్రీరామచంద్రమూర్తీ ! రావణుడు కామక్రోధ లోభ మద మాత్సర్య పరాయణుడు అయినప్పటికీ ఆ దేవ శత్రువు తమ దివ్య సాన్నిధ్యము చేరుకొనగలిగెను. కానీ, మేము దివ్యులమై యుండియు సదా స్వార్థ చింతన గలవారమై ఉత్కృష్టము, ఉత్తమోత్తమమగు భక్తి మార్గమును విసర్జించి జనన మరణ దుఃఖ భరితమగు ఈ భవసాగరమున బడి కొట్టుమిట్టాడుచున్నాము. ఓ, దేవాదిదేవా ! దాశరథీ ! సమయ సందర్భములను బట్టి మీరు కాలానుగుణ్యముగ మత్స్య కూర్మ వరాహ నృసింహాది అవతారము లెత్తి దుఃఖార్తులై యున్న మమ్ము అందుకొని కష్టముల నుండి గట్టెక్కించితిరి. ఓ బ్రహ్మ స్వరూపా ! ఆ దేవతలు సదా మీ శరణాశ్రయులని విస్మరించక రక్షించవలసినది."

## కమలభవు డిట్లు కీర్తించెను

ఆపైన చతురాననుడు బద్ధహస్తుడై ముందుకు వచ్చి భక్తి పరవశుడై ప్రభువు నిట్లు స్తుతించెను.

"ఓ, కోదండపాణీ ! రఘువంశ విభూషణా ! సుఖధామా ! సచ్చిదానందరూపా ? సర్వ వ్యాపకా ! సాకేతనాథా ! కోటి మన్మథుల ధిక్కరించుట సుందర స్వరూపా ! మునులు, సిద్ధులు, కవులు సదా—సర్వదా నీ యకళంక కీర్తిని గానము చేయుచుందురు. బలధీరా ! భవరూప మనెడి మద గజమును మర్దించుటకు నీవు మృగరాజువు. పక్షీంద్రుడు పామును సాధించు భంగి నీవు నిర్జరారి నిశాచరనాథుని నిర్జించివైచితివి. గుణభూషణుడగు విభీషణుని అసుర రాజ్యమునకు అధిపతిగా చేసితివి. అమేయ బాహుబల సంపన్నుడవై దుష్టులను శిక్షించి భూభారము నివారించితివి. ఓ, రఘుకుల రామా ! నీవు గుణధాముడవు, జ్ఞాన స్వరూపుడవు, జన్మరహితుడవు, గుణ కర్మాతీయుడవు అఖండుడవు, అగోచరుడవు. ఓ వేదవేద్యా ! నీ సుందర ముఖారవిందము నిరంతరము చూడగలిగిన ఈ నరనరులు ఎంత సుకృతజన్ములు ! ఓ, జగత్సాక్షీ ! నీ పాద పద్మములను పార్వతీ పరమేశ్వరులు సేవించుచుందురు. ఓ, దయానిధీ ! దాశరథీ ! నీ కిదే నా భక్త్యంజలి. దేవా ! నీ చరణ కమలములపై నాకు అనన్య ప్రేమ కలిగియుండునట్లు అనుగ్రహింప వేడుచున్నాను.—" కమలభవు డట్లు పులకితగాత్రుడై అనేక ప్రకారముల అయోధ్యాపతిని కీర్తించెను.

## దశరథుడు దాశరథిని దీవించి దివికేగుట

ఇవ్విధముగ దేవత లందరు దివి నుండి దిగివచ్చి స్వామిని సన్నుతించు శుభ సమయమున దశరథ మహారాజు కూడ దేవలోకము నుండి దిగి వచ్చెను. మహారాజు తన బహిర్ ప్రాణమగు పుత్రుని గాంచి ప్రేమోత్కంఠచే పరవశుడై ఆనంద బాష్పములు రాల్చి ఆత్మజుని మనసార ఆశీర్వదించెను. పురుషోత్తము డంత భక్తిప్రమత్తతతో పితృ పాదములకు ప్రణమిల్లి, తదుపరి తండ్రికి జ్ఞానబోధ చేసెను. మహారాజు ముదమంది రామ బ్రహ్మకు నమస్కరించి వెంటనే పరమపదమునకు పయనించెను.

ఓ, గిరికుమారీ ! కుమారునిపై గల ప్రేమాతిశయముచే దశరథున కింతవరకు మోక్షప్రాప్తి కలుగకుండెను. సగుణోపాసకులు ద్వైత భావముతో నన్నారాధించుటంజేసి వారికి కైవల్యము సిద్ధించదు. అట్టి వారికి స్వామి తన భక్తిని ప్రసాదించుచుండును. అందుచే శ్రీరాముడు తండ్రికి బ్రహ్మజ్ఞాన ముపదేశించి తద్వారా ముక్తిని బొందునట్లు జేసెను.

## సురేశుడు కోసలేశునికి కృతజ్ఞతలు దెల్పుకొనుట

ఆ మంగళ సమయమున శచీపతి సాకేతపతి ముందట నిల్చి దోసిలొగ్గి గద్గదకంఠుడై దశరథ రాము నిటు ప్రార్థించెను—

"ఓ, శోభానిధీ ! భక్తాశ్రయా ! శరకోదండపాణీ ! రఘునాథా ! నీకు జయము కలుగుగాక. ఓ, ఖరదూషణ రావణాది రాక్షసాంతకా ! నేటికి మా బాధలు తొలగె, నీ చలువచే మేము నిశ్చింతులమైతిమి.

ఓ, సీతాపతి ! దీనబాంధవా ! నిజము చెప్పుచున్నాను. నాతో సమానుడు లేడను స్వాభిమానముతో నేను గర్వించి యుంటిని. స్వామీ ! నీ చరణ సందర్శనముచే నా దురభిమానము తొలగిపోయెను. ఓ, రమారమణా ! వేదోక్తమగు నిర్గుణ బ్రహ్మను ఇతరు లెందరు ఉపాసించినను నేను మాత్రము సగుణరూపుడగు శ్రీ కోసలరామునే సేవించుచుండెదను. ఓ, రామా ! సీతాలక్ష్మణ సమేతముగా నీవు సదా నా హృదిలో నివసింపుము, ఇదియే నా ప్రగాఢ వాంఛ. స్వామీ నా వేడికోలు మన్నించి నే నిప్పుడేమి చేయవలసి యుండునో ఆజ్ఞాపింప కోరుచున్నాను."

"సురపతి వినీత భక్తికి శ్రీపతి మిక్కిలి సంతసించి ప్రసన్న భావమున— "అమరేశ్వరా! నా నిమిత్తమై తమ ప్రాణములు విడనాడిన ఈ వానర భల్లూక సమూహమును బ్రతికించజేయుము—" అని సురనాయకుని కోరెను.

ఓ, వినతాసుతా ! అవధేశుని హృదయము అతి అగాధమైనది. ఆ మహామహుని భావ గభీరతను తెలుసుకొనుటకు మహామునులే సమర్థులు. సర్వశక్తి సంపన్నుడగు ఆ జగదీశ్వరుడు దేవేంద్రుని గౌరవించుటకై అట్లాదేశించెను— అని కాకభుశుండి గరుడికి స్పష్టము చేసెను.

స్వామి సంకల్పానుసారము సహస్రాక్షుడా క్షణము నందే అమృతము వర్షింపజేసి విగతజీవులై పడియున్న వానర భల్లూకములను పునర్జీవితులగునట్లు చేసెను. ఆ సమయమున హతులై పడియున్న అసుర సమూహములపై కూడ అమృత ధార వర్షించెను. కానీ, యుద్ధము చేయుచున్నప్పుడు రాక్షసుల మనస్సులు రామునిమీద లగ్నమై యుండినందున వారు కైవల్యపదము చేరుకొనిరి. అందుచే నక్తంచరుల శవములు వానరుల వలె సజీవము కాలేదు. వానరులు దేవాంశ సంభూతులైనందున వారి ప్రాణములు వారి పూర్వాంశములందు చేరెను. రావణుడు దుష్టుడైనను రామబాణము వానికి మునీశ్వరులకు లభ్యముకాని ముక్తిపదమును ప్రసాదించెను. ఆపైన స్వర్లోకవాసులు సీతానాథుని అనేకవిధముల సేవించి విమానారూఢులై నిజలోకములకు నిష్క్రమించిరి. (సశేషం)


పై వారమే!
కొత్త సీరియల్!
కూలిన గోడలు
ముప్పాళ రంగనాయకమ్మ
తృతీయ బహుమతి నవల ప్రారంభం!




ఇవాళ ఆదివారం, భాస్కరరావుకు సెలవు దినం. సెలవు రోజంటే భాస్కరరావుకు పర్వ దినం. ఎప్పుడో లేవవచ్చు. ఎప్పుడో భోజనం చేయవచ్చు. బుద్ధి పుడితే మళ్ళీ పడుకోవచ్చు, నిద్రపోవచ్చు. వెళ్ళాలనుకుంటే సినిమాకో నాటకానికో వెళ్ళవచ్చు. ఎక్కడైనా వెళ్ళి 'పేక' సమావేశంలో భాగం పంచుకో వచ్చు. ఏమి చేయాలని పిస్తే అది చేయవచ్చు. ఎవరి తాబేదారీ లేదు. వగరుస్తూ వెళ్ళి రైళ్ళు పట్టుకోవలసిన అవసరమూ లేదు ఆదివారం ఉండే ఖుషీతో రోజంతా ఎండలో కుస్తీ పట్టవచ్చు

కాని ఒకొక్క ఆదివారం నష్టమైపోతుంది అలాంటి రోజున సుఖం లేక పోతే పాయిరి, ఉట్టి పుణ్యానికి కష్టానికి లొంగిపోవాల్సి వస్తుంది. కాని ఈ సుఖ దుఃఖాలనేవి ఎవరి చేతుల్లోనూ లేవు. ఒక్కొప్పుడు ఇతరుల చేతుల్లో పోయి పడుతుంది. ఆదివారం తను మాత్రం చూస్తూ ఉండి ఎక్కడి నుంచి ఎక్కడికో పోతాడు. ఈ ఆదివారం భాస్కరరావు ఆదివారం కాదు. అతని తమ్ముడు నీలకంఠ రావుది ప్రయాణ మవుతూ మవుతూ డౌవహాకోటు చేతిమీద వేసుకుని ఎక్కినట్టు, నీలకంఠ రావు, భాస్కరరావు ఆదివారాన్ని చేత్తో పట్టుకొన్నాడు. భాస్కరరావుకు కబురు అందింది

భాస్కరరావు 'శ్రీఖండ్', పూరీ తిని (ప్రతి

ఆదివారమూ తీపి పదార్థం తినటం భాస్కరరావు అలవాటు) ఒక మాసపత్రిక తీసుకుని, పాన్ బీడా వేసుకుని, బరువైన తన శరీరాన్ని 'ఈజీచైర్'లో పడవేశాడు. 'శ్రీఖండ్' మత్తు కళ్లను ఆవరిస్తున్నది. అతని ఆలోచనంతా, మధ్యాహ్నం నాలుగు గంటలకు చూడబోతున్న నాటకాన్ని గురించే. టిక్కెట్లు తను అదివరకే కొన్నాడు. అతనితో భార్యా పిల్లలూ కూడా వెళ్ళబోతున్నారు. తెరచి ఉన్న మాస పత్రికను రొమ్ములమీద వేసుకుని భాస్కరరావు ఆలోచనామగ్నుడైనాడు. ఆ ఆలోచనల్లా, భార్యాపిల్లలు తిండీ తిప్పలూ పూర్తి చేసుకుని వేళ్టికి తయారవుతారా లేదా అనే, అలవాటుగా నాటకం మొదలైన పదిహేను నిముషాలకు వెళ్ళడం, ఇతరులు తమ వంక గుచ్చి గుచ్చి చూడటం అతనికి నచ్చదు. అందుకనే తయారు కమ్మని ఆజ్ఞాపించాడు గట్టిగా, ఇంతలో నీలకంఠరావు నౌకరు శంభూ వాకిట్లో కొచ్చి నిలబడ్డాడు. వాడిని చూడగానే భాస్కరరావు ముఖం ముడుచుకు పోయింది అతనికీ, శంభూకీ శత్రుత్వమనేది లేదు. కాని వాడు నీలకంఠరావు నౌకరు నీలకంఠరావు, భాస్కరరావుల మధ్య ఇప్పుడు నీ మాత్రము సఖ్యమూ మిగలలేదు. అందుకనే శంభూను చూడగానే అతని ముఖంలో విస్మయం కనుపించింది "ఏంరా ?" రౌద్రంగా అరిచాడు అతను.

కాని 'శంభూ' నోట్లో నుంచి జవాబు రాలేదు. మాట్లాడటానికి బదులు వాడు వణక సాగాడు. వాడి ముఖం వెలవెల బోయింది ఏడుపు ఎప్పుడు మొదలవుతుందో తెలీని విధంగా కళ్ళు నిండుకు వచ్చినై. వాకిట్లో నుల్చుని, పది, పదిహేను నిముషాలు వాడు, వణికిపోతూనే ఉన్నాడు. కాని, వెంటనే చేతులు పైకెత్తి వూరికే "త—త—" అనసాగాడు

భాస్కరరావుకు కోపం వొచ్చింది కోపంతో వాడి మీద విరుచుకు పడ్డాడు, "వెధవా— ఏమిట్రా అదీ— ఉరి పడుతున్నట్టు— ఏం జరిగిందో చెప్పు" ఈ ఆదివారానికి విఘ్నరూపంగా శంభూ భాస్కర్‌రావుకు తోచాడు. అతని భార్య వంటింట్లోంచి వచ్చి శంభూతో అన్నది. "చెప్పరాదూ— అసలేం జరిగిందో ?"

శంభూ గునుస్తూ ఏడవ సాగాడు. భాస్కరరావు బాధపడి అన్నాడు "అరే ఎందుకు ఏడుస్తావ్ —ఎవరో చచ్చిపోయినట్టు ?" నాలుకలో నరాలు లేనివాడిలా మాట్లాడటం భాస్కరరావుకు అలవాటు ఇప్పుడూ అలాగే అన్నాడు ఆ మాటతో శంభూ ఏడుపు ఆగిపోయింది "అది చెప్పటానికే వచ్చాను నేను—" అన్నాడు.

"అయితే చెప్పు— ఇంకేమిటి చూస్తూన్నావ్?"

"మీ తమ్ముడు నీలకంఠరావ్ పోయారు."

"ఏమిటి ?" బాంబు పడ్డట్టుగా అదిరిపోయి అన్నాడు భాస్కరరావ్.

"అవునండీ— మీ తమ్ముడు పోయారు. చచ్చిపోయారు—"

"ఏమిటీ ? ఏమిటి నువ్వనేది ?" నిల్చుని ఉన్న భాస్కరరావు ఒక్కసారి కుర్చీలో కూర్చోబడ్డాడు, "నువ్వు చెప్పేది నిజమేనా ?"

"నిజమేనండీ—"

"మా నీలకంఠుడు — మా వాడు — మా తమ్ముడు చచ్చిపోయాడా ?" భాస్కరరావు తలమీద ఆకాశం విరుచుకు పడ్డట్టయింది. కాళ్ళల్లో చేతుల్లో శక్తి నశించి పోయినట్లయింది. శ్వాస నాళము లోపలికి పీక్కు పోసాగింది. కళ్ళలో నుంచి ధారాపాతంగా కన్నీళ్ళు కారసాగినై.

"అయ్యా", శంభూ చేతులు జోడించి అన్నాడు

"నువ్వే ఇలా అయితే— ఆయన భార్యా పిల్లల సంగతేమిటి. ధైర్యం తెచ్చుకోబాబూ— ధైర్యం తెచ్చుకుని నాతోరా."

"శంభూ— నువ్వు నిజమే చెబుతున్నావా ?" భాస్కరరావు మళ్ళీ అడిగాడు. నీలకంఠ్ చచ్చిపోయాడనేది నమ్మశక్యం కాకుండా ఉన్నది అతనికి.

"బాబూ నీ కాళ్ళు పట్టుకు ప్రమాణం చేస్తాను. మీ తమ్ముడు చచ్చిపోయాడు. ఇందులో కల్పనేమీ లేదు కొన్ని గంటల క్రితం వరకూ ఆయన బాగానే ఉన్నాడు పది గంటలు కొడుతూండగా ఎక్కడి నుంచో వచ్చి భోజనానికి కూర్చున్నాడు మరదలుగారు వడ్డిస్తున్నది. పిల్లలు కూడా కూర్చొన్నారు కాని మొదటి ముద్ద నోట్లో పెట్టుకున్నాడో లేదో గుండెలో నొప్పి వచ్చింది. నొప్పి వచ్చిందంటూనే పడిపోయాడు. అందరినీ దగ్గరికి తీసుకున్నాడు మగతగా పడుకున్నాడు వళ్ళు కాలిపోతున్నది డాక్టరు వచ్చాడు. అప్పటికే అంతా అయిపోయింది శరీరంలో 'ఆయన' అనేది మిగలలేదు. ఆ నొప్పి వచ్చిందా అండీ— దానితో బాటు ఆయుస్సీ తీసుకుపోయింది" శంభూ ఆపాడు ఆపి అన్నాడు "మరి అయితే వస్తారుగా బాబూ."

భాస్కరరావు ఓ క్షణం ఆలోచనలో పడ్డాడు. పెదవులు తాకిన కన్నీళ్ళు పక్కకు జారినై. గట్టిగా ఒక నిశ్చయానికి వచ్చి లేచి శంభూ వెనక బయలుదేరాడు భాస్కరరావు దృష్టికి ఏదీ ఆనటంలేదు. ఏమి జరిగిందో అతనికి పూర్తిగా అర్థంకావటంలేదు లతని కళ్ళముందు నీలకంఠ్ మెదులుతున్నట్టున్నది సొంత తమ్ముడు వాడు తనకు. ఒక ఊళ్లో ఒక అన్నా తమ్ముడూ ఉన్నారు. వారిద్దరిమధ్య ఐక్యత లేకపోతే ఏం? నీలకంఠ్ తన తమ్ముడు, ఒక తల్లి కడుపున పుట్టినవాడు. ఒకే చెట్టుకు రెండు కొమ్మలు. ఒకే ఇంటికున్న రెండు తలుపులు, ఒకే వత్తిలో నుంచి వెలిగించిన రెండు దివ్వెలు వాటిలో ఒక దివ్వె యివాళ పోయింది ఎప్పుడో భవిష్యత్తులో ఆరిపోవలసినది ఇప్పుడే పోయింది ఇంటి తలుపుల్లో ఒకటి అనుకోకుండా పడిపోయింది చెట్టుకున్న రెండో కొమ్మ మీద ఇవాళ యముడు తన ప్రఘాతాన్ని కలుగ చేశాడు.

శంభూతో బాటు బండిలో వెడుతున్న భాస్కరరావుకు, తన చెయ్యొకటి విరిగిపోయినట్లు తన కాళ్ళలో ఒకదాన్ని ఎవరో సమూలంగా పూడబెరికినట్లు అనిపించ సాగింది. తన తలమీద గీత గీసి ఎవరో రెండు భాగాలు చేసినట్లనిపించింది. కాదు— కాదు— అలా ఎలా జరుగుతుంది. నా నీలకంఠుడు అలా ఎలా వెళ్తాడు ? వాడు నాకన్న చిన్నవాడు. వాడికింకా ఏళ్ళే ఏళ్ళన్నా నిండలేదు. ఇంత త్వరలో ఎలా పోతాడు ? వాడికి భార్యా పిల్లలూ ఉన్నారు వాళ్ళందరికీ విశ్వాసఘాతకునిలా జేయడు. జీవితం సగంలో ఎవరైనా అలా దెబ్బతీస్తారా ? సగం దారిలో ఎవరైనా అలా వదిలి వెళ్తారా ? అది సాధ్యమేనా ? "సాధ్యం కాదు." భాస్కరరావు బిగ్గరగా అన్నాడు

శంభూ, అతని భుజం మీద చెయ్యి వేశాడు. ఆ చేతిని భాస్కరరావు తన చేతిలోనికి తీసుకున్నాడు. ఆ చేతి ఆధారంతోటే నీలకంఠరావు ఇంటి దగ్గర క్రిందకు దిగి నిల్చుండి పోయాడు. ఒక్కసారి ఆకాశం విరిగి పడ్డట్టు అతను ఏడవ సాగాడు. రెండు చేతులతోనూ గుండెను పట్టుకుంటూ హడావుడిగా లోపలికి వెళ్ళి నీలకంఠరావును గట్టిగా పిలిచాడు. అతన్ని కదిలిస్తూ, "నే వచ్చానురా నీలకంఠ్, నేను భాస్కర్‌ని వచ్చాను. నేను నీ అన్నయ్యను వచ్చాను. నాతో మాట్లాడవా నీలకంఠ్, ఒక్కసారి కళ్ళు తెరచుకుని నా వంక చూడురా నీలూ ? చూడవు ? నాతో మాట్లాడవూ ? నా మీద కోపమా, చాలా రోజులుగా నీ దగ్గరికి రాలేదనీ, నిన్ను కలుసుకోలేదనీ కోపమా? అరే— అయినా నేను నీ సోదరుడనే, నీ అన్నయ్యను నా మీద కోపమా నీకు ? నీ మీద నాకు కోపమా ? నాకన్న ముందుగా నువ్వే వెళ్ళిపోయావా ? వెళ్తూ నాతో చెప్పనన్నా చెప్పలేదే ? నన్నడగలేదే ?"

దూరంగా జరిగి భాస్కరరావ్ నీలకంఠరావ్ వంక చూస్తూ ఉండి పోయాడు ఇంకా నీలకంఠరావ్ నిశ్శబ్దంగా నిద్రపోతూనే ఉన్నాడు. అతను చనిపోయాడని అనిపించటమే లేదు. గొంతు దాకా తెల్లని దుప్పటి కప్పి ఉన్నది. తల దగ్గరగా ఫూదొత్తులు వెలిగించి పెట్టి ఉన్నై.

నీలకంఠరావ్ తన వంక చూచి తనలో తానే నవ్వుకుంటున్నట్లనిపించింది భాస్కర్ రావ్‌కు. అతని చెయ్యి కూడా కొంచెం కదిలినట్లు భ్రమ కలిగింది వెంటనే నీలకంఠ్ రావ్ వంటిమీద చెయ్యి వేశాడు. చల్లని ఆస్పర్శతో ఒక్కసారి వెనక్కు వెళ్ళాడు

అతను వెనక్కి వెళ్ళగానే, ఏడ్చి, ఏడ్చి అలిసి పోయిన నీలకంఠరావ్ భార్య కుంకుమ పోగొట్టుకున్నది. భాస్కరరావ్ హృదయం పిండినట్టయింది. నీలకంఠరావు పిల్లల్ని దగ్గరికి తీసుకుని వాళ్ళని వోదార్చటానికన్నట్లు వీపు మీద తట్టసాగాడు

ఇంతలో ఎవరో వచ్చి నీలకంఠరావు భార్యను బలవంతాన అవతలికి తీసుకెళ్ళారు. నీలకంఠరావును తీసుకువెళ్ళే ప్రయత్నం జరుగుతున్నది. చనిపోయిన వాళ్ళని పంపించి వేయాల్సిన అవసరమున్నది తమ మధ్యలో ఉంచుకోవటం కుదరదు. ఆ మనిషికీ— తమకీ మధ్య ఎందుకో అంతరం ఏర్పడుతుంది. ఆ భావం భాస్కరరావుకు ఎందుకో చెడ్డ తలంపుగా తోచింది. లోకులు నీలకంఠరావును తీసుకు వెళ్ళడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. వాళ్ళు— అతనికోసం బట్ట తీసుకు వచ్చారు, దండ తీసుకు వచ్చారు. నీలకంఠరావు మెడలో పడుతున్న ఈ దండ మూడోది మొదటిసారిగా పడుగప్పుడు, తరువాత పెళ్ళప్పుడు, ఇప్పుడు ఇది మూడోసారి. చివరిసారి— అంతిమ

"ఆంధ్రసచిత్ర వారపత్రిక"లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

ఎండకు భయపడకు పాపా! ఇదిగో ఫ్రూటోల్ త్రాగు!—

మీ పిల్లలను వేసవి ఎండలనుంచి కాపాడగలది ఒక్క స్వాన్ బ్రాండ్ ఫ్రూటోల్ మాత్రమే!

ఇండియా క్యానింగ్ ఇండస్ట్రీస్,
విజయవాడ-3.
AGENTS FOR ANDHRA
ఆక్మీ ట్రేడ్ ఏజెన్సీస్, విజయవాడ-1.

# ప్రస్థానం

యాత్రకు సంబంధించినది. . . . నీలకంఠరావు ఇంకా కొంత కాలం బ్రతికి ఉంటే— అంటే షష్టిపూర్తి చేసుకున్నట్లయితే ఇంకొక హారం అతని మెడలో పడుండేది. కాని అతను పదమూడు సంవత్సరాలు ముందుగానే వెళ్ళిపోయాడు— ఆకు ముందునుంచి లేస్తూనే ప్రయాణమైనాడు మొదటి ముద్ద నోట్లోకి వెళ్ళి వెళ్ళకముందే— అతను వెళ్ళిపోయాడు. భాస్కరరావుకు తను ప్రొద్దున 'శ్రీఖండ్ పూరి' తిన్న సంగతి గుర్తు కొచ్చింది. అతనికి త్రేనుపులు రాసాగినై. నీలకంఠరావుక్కూడా శ్రీఖండ్ ఇష్టం. ఇవాళ తాను అతన్నెందుకు భోజనానికి పిలవలేదు? ఇంతకు ముందు మటుకెప్పుడైనా— భోజనానికి పిలిచారా? అతనికీ తనకీమధ్య ఎంతదూరం ఏర్పడినా— భోజనానికి పిలవటానికీ దానికీ సంబంధమేమిటి? సోదరుడుకదా అని తామెందుకు భోజనానికి పిలవ కూడదు. భాస్కరరావుకు ఒక్కసారి తన భార్యమీద కోపమొచ్చింది ఆమెకు ఎవరినీ భోజనానికి పిలవటమంటే ఇష్టముండదు. కావాలంటే కొద్దో గొప్పో పైసలిస్తుంది కాని, భోజనానికి పిలవదు ఆమెలో జీవం ఎప్పుడో ఎచ్చేది ఎంటింటి పనితో ఆమె సతమతమైపోయేది

ఆమె ఆరోగ్యం గురించిన ఖాతరువల్ల, తను సొంత తమ్ముణ్ణి సైతం భోజనానికి పిలవలేదు భాస్కరరావు తనని తనే తిట్టుకున్నాడు. ఇంతలో. . . .

గుంపు ఒక్కసారి పక్కకు తప్పుకున్నది ఇవాళ అందరూ, నీలకంఠరావును దబ్బున పంపించటానికి దోవ ఏర్పరచాలను కున్నట్లున్నారు ఇవాళ నీలకంఠరావు తనకాళ్ళ మీద తను నడవటం లేదు. లోకులు కాళ్ళూ తల పట్టుకుని ఒక డోలీ నెత్తినట్లు యెత్తారు. నీలకంఠరావును పిల్లి సంతి మర్యాదగా లేవతీయాలని వాళ్ళ ప్రయత్నము అయినా నీలకంఠరావ్ కుడిచేయి క్రిందకు వ్రేలాడుతున్నది అతని ముఖం కదులుతున్నది. అది చూచి వెంటనే భాస్కరరావు చెయ్యి పట్టుకున్నాడు. "ఇదుగో తల జాగ్రత్తగా పట్టుకోండి—" అని అరిచాడు

క్రొత్తగా ఉన్నవాళ్ళు హడావుడిగా ముందుకు పోయి తల సర్ది పట్టుకునే ప్రయత్నమూ చేశారు. కాని ఈ పనుల్లో ఆరితేరిన వాళ్ళు మటుకు అటువైపు దృష్టి అయినా సారించలేదు శవం తల అలా అల్లల్లాడుతుంది. వాళ్ళు నీలకంఠరావు శరీరాన్ని గట్టిగా కట్టివేశారు వళ్ళంతా గుడ్డతో కప్పివేశారు మెడలో హారం వేశారు ఆఖరికి భగవన్నామస్మరణ చేసి నలుగురు నీలకంఠరావును పైకెత్తి భుజాలమీద పెట్టుకున్నారు. నీలకంఠరావు భార్య ఏడుస్తూ వెనక పరుగెత్తింది అందరికన్న చిన్నపిల్ల నేలమీద పడి దొర్లసాగింది. మధ్య పిల్లలు తమ చెంపలు వేసుకో సాగారు వాళ్ళకన్న పెద్ద పిల్ల ఉన్నది బిగ్గరగా ఏడ్వసాగింది. అందరికన్న కన్న పెద్దపిల్ల ఎక్కిళ్ళు ఆపుకుంటూ "నాన్నా" అని బిగ్గరగా అరిచింది

భాస్కరరావు కూడా ఒక్కసారి "నీలూ" అని అరిచాడు, అరిచి పరుగెత్తూ ముందుకు వెళ్ళిపోయాడు. ముందువైపు పోతున్న మనిషి పీపుతట్టి, వెనక్కు పంపి తన భుజం ఆనించాడు నీలకంఠరావు పాడెకు. భాస్కరరావుకు ఏడుపు వస్తున్నది నీలకంఠరావు జ్ఞాపకాలు ఒకటొకటే రాసాగినై. అతని మంచి చెడ్డలను గురించి ఆలోచించ లేదనే వేదన కలిగించి, అతనికి పశ్చాత్తాపం కలుగసాగింది తాను అతని విషయంలో అపరాధం చేసినట్లు భావన కలుగసాగింది ఆ భారంతో, అతను తన భుజాలు మార్చుకో సాగాడు ఒకసారి ఈ ప్రక్కన, ఒకసారి ఆ ప్రక్కన ఒకసారి ముందువైపున భాస్కరరావు శవాన్ని మోయసాగాడు. బరువెక్కిన కొద్దీ అంత బరువూ భరిస్తూ వచ్చాడు భాస్కరరావు. చిన్నతనంలో నీలకంఠరావు తనంటే ఎంతో ఇదిగా ఉండేవాడు. తన దాంట్లో సగం భాస్కరరావుకు పెట్టేవాడు భాస్కరరావు బట్టలు కూడా ఒకొకసారి తనకే వాడు నీలకంఠరావు చిన్నతనంలో భాస్కరరావు బట్టలు ఇట్టే చిరిగి పోయేవి చెట్లెక్కడం— కొట్లాటల్లో ఇరుక్కోవటం, పరుగులెత్తటం, గంతులు వేయటంతో, అతని బట్టల్లో ఏదీ చిరగకుండా ఉన్నది లేదు ఇక చిరిగిన బట్టల ధ్యాస భాస్కరరావుకుండేది కాదు. చిరుగుతే చిరగటమే. పోతే పోయాయి. అసలు బట్టలు లేకపోతేమటు కేం? కాని నీలకంఠ తన బట్టలు అతని కిచ్చే వాడు "అన్నా, నువ్వేసుకో—" అనే వాడు. భాస్కరరావును ఎప్పుడూ ఎవరో ఒకరు కేకలేసేవాళ్ళు అతన్ని కేకలేసినప్పుడు నీలకంఠరావుకు ఏడుపు వచ్చేది కోపం వచ్చేది. భాస్కరరావు పక్షం పూని వాళ్ళతో పోట్లాడే వాడు. భాస్కరరావు ఇంటికి తిరిగి రావటం ఆలస్యమైతే తన సైకిలు మీద వెతకటానికి వెళ్ళేవాడు నీలకంఠరావుకు, భాస్కరరావుమీద తల్లికుండే ప్రేమ ఉండేది అందరూ భాస్కరరావుతో "వీడే నీ అసలు తల్లిరా! అనేవాళ్ళు ఒకసారి ఏదో విషయం మీద భాస్కరరావుకూ వాళ్ళ నాన్నకు ఘర్షణ జరిగింది. తండ్రంటే దుర్వాస మహాముని అన్న మాటే ఆయనకు కోపమే వస్తే చేసే పనులల్లా రెండే ఒకటి పిల్లల్ని బాదటం లేకపోతే వీధిలోకి గెంటి వేయటం. వాళ్ళకి తెలియు చెప్పటం ఆయనకు తెలీదు ఆ రోజు అలాంటిదే జరిగింది. భాస్కరరావు తండ్రి అతన్ని ఇంటి బయటికి నెట్టివేశాడు భాస్కరరావు కూడా— ఒక క్షణమైనా ఆలస్యం చేయలేదు. బయట పడ్డవాడు బయటపడ్డట్టుగా బయలుదేరాడు అతనికి ఏ విధమైన ఆలోచనా కలుగలేదు. అతని వయస్సెంతో కూడా ఎంతా? పన్నెండేళ్ళు! రోషంతో భాస్కరరావు ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. కాని నీలకంఠ అతని వెనక పరుగెత్తాడు అతనికి మటుకూ— పదేళ్ళున్నయ్యేమో? అయినా అతను భాస్కరరావును ఇంటికి తిరిగి రమ్మని బ్రతిమలాడాడు. కాని అతను వినలేదు అప్పుడు నీలకంఠ తనను కొనుక్కు తినమని ఎవరో ఇచ్చిన పావలా భాస్కరరావుకు ఇచ్చివేశాడు తనవంటినున్న కోటు— భాస్కరరావుకు తొడిగి, ఏడుస్తూ ఇంటికి తిరిగి వచ్చాడు భాస్కరరావు ఇల్లు వదలిపెట్టి వెళ్ళటం, నీలకంఠకు ఎంత బాధ కలిగించిందంటే ఆ రాత్రి అతనికి సరిగా నిద్ర పట్టలేదు కూడాను. నిద్రపోతూ పోతూ ఉలిక్కిపడితే లేచి "అన్నా"— అని బిగ్గరగా అరిచే వాడు. భాస్కర్ తండ్రి

మటుకు భాస్కర్ ఎక్కడికి వెళ్ళాడో అన్న సంగతే పట్టించుకోలేదు. వెళ్ళే మటుకు ఎక్కడికి వెళ్తాడు. అడవిలోకైతే పోడుగదా ? వెళ్ళుంటాడు మామ దగ్గరికో, అత్తయ్య గారింటికో, ఒక రోజున, వాడంతట వాడే తిరిగి వస్తాడు అనే ధైర్యంతో ఉన్నాడు.

కాని మూడు రోజులైనా భాస్కర్ తిరిగి ఇంటికిరాలేదు. తండ్రి కొంచెం వల్లబడ్డాడు. తల్లికి ఏదోవా తోచలేదు. అయినా, ఆమెకి భాస్కర్ ఇవాళో, రేపో తిరిగి వస్తాడనే నమ్మక ఉంది. కాని నీలకంఠ్‌కి ఆ ధైర్యం లేకపోయింది. ఏడ్చి ఏడ్చి ఇల్లదరగొట్టాడు. తిండి తినటం మానివేశాడు. నిద్ర మానివేశాడు అతని వళ్ళంతా ఒకటే వ్యథ. అప్పుడు నీలకంఠ్, కోసమైనా భాస్కరరావును ఇంటికి తీసుకురావలసిన అవసరం ఏర్పడింది. వెతకటం మొదలైంది. సాయంకాలానికి వూరిబయట తోటలో చెల్లెక్కి కీళ్ల నొప్పులు పోగొట్టుకుంటూ, సూర్యాస్తమయం చూస్తు దొరికాడు. వాడ్ని పట్టుకు ఇంటికెప్పుడైతే తీసుకువచ్చారో అప్పుడే నీలకంఠ్ జ్వరం తగ్గిపోయింది. భాస్కరరావు చూడగానేమంచం మీదినుంచి ఒక్కసారి లేచి కూర్చుని, 'అన్నా' అని భాస్కరరావుని కౌగలించుకున్నాడు. భాస్కరరావు నీలకంఠ్‌ను చిన్న పిల్లాడిని ఎత్తుకున్నట్టు ఎత్తుకున్నాడు. కాని అప్పుడు, మళ్లీ ఒకసారి నీలకంఠ్ రావును భుజం మీదికి ఎత్తుకోవలసి వస్తుందని అనుకోలేదు భాస్కరరావు భాస్కరరావుకు తన భుజం నొప్పిపుడుతున్నట్లనిపించింది. వులి వెనక పడినట్లు నడవటం — కాస్త ఆగి భుజం మార్చుకోవటం. భాస్కరరావుకు నచ్చదు. చిన్నతనంలో కూడా నీలకంఠ్ ఇంతే ఉండేవాడు ఇప్పుడుకూడా అంత పెద్దగా వళ్ళు చెయ్యలేదు. శరీరం సరిమానంగా ఉంది. సరిసమానమైన పొడుగూ, సరిసమానమైన వెడల్పూ, ఐనా భాస్కరరావుకు వోర్పు తగ్గలేదు. భుజంమీద ఉత్తరీయం వేసుకుని, దానిమీద నీలకంఠరావు బరువు మోస్తున్నాడతను.

వెనకనుంచి ఎవరో వచ్చి, భాస్కరరావు భుజం మీదచెయ్యివేశారు. అతను 'సోమేశ్'. భాస్కరరావుకూ, నీలకంఠ రావుకూ స్నేహితుడు. భాస్కరరావు వగర్పు చూచి అతనన్నాడు. "నువ్వు వూరికే వెంటరా. నేను భుజం పడ్తాను. నేనూ వాడి స్నేహితుడినేగా—"

భాస్కరరావు వెనకపడ్డాడు. శవవాహకులు ముందుకు వెళ్లిపోయారు. మనిషిలాటి మనిషి, సహజన్ముడైన ఒకడు సృష్టినుంచి, దృష్టి నుంచీ తొలగిపోబోతున్నాడు. ఐనా అతన్ని మోసుకువెళ్తున్న మనుష్యులు ఎంత త్వరగా వెళ్తున్నారో? ఎంత వేగంగా రోడ్డు గడచిపోతున్నది ? తమ భుజాల మీద బరువైన వస్తువును దేన్నో మోస్తూ ఒక సంచీ ఉన్నదని వాళ్ళ కనిపిస్తుండాలి. బహుశః ఏ క్షణాన్నో తమని పట్టి నాశనం చేస్తుందేమో అన్న భయంతో, యీ మనుష్యులు విలక్షణమైన వేగంతో వెళ్తున్నట్టనిపించింది. ఆ వేగం భాస్కరరావు సహించలేకపోయాడు. బాధతో భాస్కరరావు కాళ్ళూ, చేతులూ నొప్పి పుట్టినై. అంతఃకరణం కూడా నిండిపోయినట్లనిపించింది. విచారంలో శిరస్సు జడమైనట్లనిపించింది. అంతం లేని నిద్ర పోతున్న నీలకంఠరావు ముఖంమీద ఎండపడుతున్నట్లు కనిపించింది. "అరే — అరే"—అంటూ త్వర త్వరగా ముందుకు వెళ్ళి తనచేతులో ఉన్న గొడుగు తెరచి నీలకంఠరావు ముఖానికి పట్టాడు.

భాస్కరరావు అంటున్నాడు, "నీలూ, నువ్వు నాకు చాలా చేశావు. నేనంటే ఎంతో ప్రేమ చూపించావ్. చిన్నతనంలోనూ, పెద్దతనంలోనూకూడా నువ్వు నా కోసం చాలా చేశావు. నీభార్యకూ, నాభార్యకూ కలిసింది కాదు. నాభార్యతో మాటలుకూడా మానేశావు నువ్వు. అప్పటినుంచి వేరే వేరే ఇంట్లో కాపురం ఉంటూ వచ్చాము మేము. మన మధ్య మాటలూ ఆగిపోయినై. మన మధ్య సంబంధాలుకూడా తెగిపోయినై మనం ఒకళ్ళకింకొళ్ళం కానివాళ్ళ మైనాము. కాని నేను జబ్బుపడ్డట్టు తెలిసి నువ్వు పరుగెత్తుకుంటూ వచ్చావు. రాత్రనకా, పగలనకా జాగరణ చేశావు. 'బెడ్‌పాన్' సైతం నువ్వే ఎత్తి పోసేవాడివి. నీకు అసహ్యమనిపించలేదు. కాని. నేను........."

నీలకంఠరావుకు తానేమీ చేయనట్లు భాస్కరరావుకు అనిపించ సాగింది. నీలకంఠరావే జీవితాంతం తనకు సాయం చేశాడు. అతని జీవం మీద తాను జీవించాడు. అతని ఆధారం వల్లే తాను పెరిగాడు. వయస్సులో నీలకంఠరావు చిన్నవాడే కాని, పితృ ప్రేమ చూపించేవాడు. అతనే తనంటే శ్రద్ధ చూపించేవాడు, తనని భరించాడు. ఎంత మంచి మనస్సు కలవాడు— ఎంతటి త్యాగి— ఎంత ప్రేమ పూరితుడు. సినిమా, నాటకమూ చూస్తుంటేనే అతనికి ఏడుపు వచ్చేదంటే అతను ప్రత్యక్ష దృశ్యాల్ని చూస్తే ఎంతగా విచలితుడయేవాడో, ఎంత సున్నితుడో, వూహించుకోవాల్సిందే. అలాటి సోదరుడు ప్రపంచంలో ఎవరికైనా లభిస్తాడా ? లభించినప్పుడు తల్లికి చీరె తెచ్చాడు. తండ్రిని గౌరవించాడు చెల్లెలికి మిఠాయిలు పంపించాడు. తమ్ముడి 'ఫీజు' కట్టాడు. తనకోసం మటుకు ఏమీ చేసుకోలేదు. కుటుంబానికి సహాయం చేయాలని, నీలకంఠరావు తన కోసం రెండు జతలు తప్ప మూడోది కుట్టించుకోలేదు. చిరిగిన ధోవతులు కుట్టించుకుని కట్టుకునే వాడు ఒకపూట భోజనం చేసేవాడు. అలా అంతకాలంలో ఎంత డబ్బు దాచిపెట్టేవాడు. ఆ డబ్బు ఇంటికి పంపించేవాడు.

'నీలూ'ని గురించిన ఆలోచనలతో, భాస్కరరావు వెనక పడ్డాడు యాత్ర ముందుకు జోరుగా వెళ్ళిపోయింది నీలకంఠరావు అన్నయ్య వెనక వస్తున్నాడన్న లక్ష్యమే లేక పోయింది వాళ్ళకి. ఇంత వేగము వాళ్ళ కాళ్ళకు అదివరకున్నదా? భాస్కరరావు కోపంతో ఇదైపోయి మనసులోనే వాళ్ళని ఉద్దేశించి అంటున్నాడు. "ఇదుగో కాస్త మెల్లిగా నడవండయ్యా. మళ్ళీ వాడు ఈ త్రోవన రాడు. ఈ వూళ్ళో నలభై ఏళ్ళ నుంచీ ఉన్నాడు వాడు. వాడిని ఈ వూరి నుంచి కాస్త సావకాశంగా పోనీయండి. ఏ త్రోవనైతే తాను కొన్నివేల తడవలు వెళ్ళాడో ఆ త్రోవన ఒక్కసారి నిలిచి ఉండనియ్. మన మధ్య కాస్త వాడిని ఉండనియ్యండి. అరే— వాడు మీ స్నేహితుడు కాదూ ? వాడి స్నేహం మీరు అనుభవించ లేదూ ? వాడితో మీరు ఇష్టగోష్టి జరప లేదూ ? వాడు ఎప్పుడూ ఉపయోగ పడలేదూ? మరి వాడిని ఆ సర్వ భక్షకుడైన అగ్నిదేవుని స్వాధీనం చేయటానికెందుకి తొందర ? నిన్నటి దాకా వాడు మీకు కావలసి వచ్చాడు— ఇవాళ యముడు వాడిని బంధించి వేశాడని మీరు వాడిని మరచి పోయారు "

"అన్నా—," భాస్కరరావుకు నీలకంఠం రావు పిలుపు వినిపించిన భ్రాంతి కలిగింది, కాని



వెంటనే ఇక నీలకంఠరావు ఎప్పుడూ తనని పిలవ డనే భావమూ కలిగింది తనతో ఇక ఏ విషయమూ చెప్పడు. ఏదీ తనకు కావాలని ఇక అడగడు ఆ పిలుపు భాస్కరరావును అతను విస్మరించిన అంధకార బంధురమైన గుహ దగ్గరకు తీసుకు వెళ్ళింది

అప్పుడు భాస్కరరావుకు పదమూడేళ్ళ వయస్సు. నీలకంఠరావుకు పదకొండేళ్ళు ఇద్దరూ కలిసి స్కూలుకు వెళ్ళి వస్తూండేవాళ్ళు ఇద్దరూ హుషారుగా ఉండేవాళ్ళు ఇద్దరూ తెలివిగల వాళ్ళే. కాని నీలకంఠరావు ముక్కుకు సూటిగా పోయే వాడు. జవాబుదారీతనం ఉండేది అతని దగ్గర. ఎక్కువ ఆదర్శవాది కూడాను. అతని కన్నీ మంచి అలవాట్లుండేవి. వేళ పట్టున లేవటం, వేళకు చదువుకోవటం, వేళకు స్కూలుకు వెళ్ళటం, స్కూలు వదలగానే సరాసరి ఇంటికి తిరిగి రావటం 'చా' త్రాగేవాడు కాదు ఎవరికీ కష్టం కలిగించేవాడు కాదు ఇంట్లో అమ్మకి పనుల్లో సాయపడే వాడు క్రమ పద్ధతిలో నడిచే వాడు అందరినీ ప్రేమించి, వాళ్ళందరికీ సుఖం కలిగించే వాడు ఇదే అతని ఆదర్శ జీవిత క్రమం తల్లి తండ్రీ అతన్ని గురించి "ఈ కుర్రవాడు బుద్ధి మంతుడు" అనుకునేవాళ్ళు, మంచి కుర్రాడు అని అందరూ అనేవాళ్ళు. కాని భాస్కర్రావు ప్రవ ర్తన నీలకంఠరావు ప్రవర్తనకు పూర్తిగా విరు ద్ధంగా ఉండేది. పరీక్షల్లో ఎప్పుడూ ప్యాసయ్యే వాడు. అందులో ఫస్టుగానో, సెకండుగానో ఉండేవాడు చదువూ గిదువూ లేదు అతని బుద్ధి ఎంత సునిశితమైనదంటే, పుస్తకం ముందు పెట్టుకుని కళ్ళు ఒకసారి సరిగా తెరిచి చూస్తే చాలు, కాని ఈ పిల్లడు ఎక్కువసార్లు స్కూలు పోయేవాడు కాదు. వేళ్టికి తిరిగి వచ్చేవాడుకాదు ఆడుతూ పాడుతూ ఉండే వాడు గాలి పటాలు ఎగురవేస్తూ కూర్చుంటే గాలిపటాలే ఎగుర వేస్తూ కూర్చునేవాడు అందుకోసమని బడి ఎగగొట్టేవాడు బిళ్ళంకోడు ఆడటం మొదలు పెడితే బిళ్ళంకోడే ఆడుతుండేవాడు వేళా పాళా ఉండేది కాదు వాటి లక్ష్యమే ఉండేది కాదు స్నేహితులతో కబుర్లు చెబుతూవుంటే ఇక ఇంటి సంగతే ఉండేది కాదు. రాత్రి పది కొట్టింది



# ప్రస్థానం

ఇంటికి తిరిగి వచ్చేవాడుకాదు. ఇంటికి వచ్చేడంటే తండ్రిచేత దెబ్బలు తిని, భూగోళం పుస్తకంలో నవల పెట్టుకుని చదివేవాడు చరిత్రంటే అతనికి పిచ్చిప్రేమ స్కూలు బయట చరిత్ర కూడా అంతే లెక్కల పుస్తకంలో చరిత్ర పుస్తకం పెట్టి చదివే వాడు ఎవరైనా కొట్టారని దుఃఖంలేదు మాటలన్నారని లేదు. తన ధ్యాసేమిటో తనదే ఇంత చిన్న వయసు లోనే బీడీ త్రాగటం అలవాటైంది కుతిబుడితే బయటికి పోయి బీడీ పీల్చి వచ్చేవాడు ఆ బీడీల కోసం తండ్రి జేబులు వెతికేవాడు. ఇంట్లో కడుపు నిండుగా తినేవాడు కాదు రోజూ చద్దన్నం ముందుకు వచ్చేవాడు ఆ చద్దన్నం తిని నీలకంఠరావు సర్దుకునే వాడు కాని భాస్కరరావుకు చాలేది కాదు హోటల్లోకి వెళ్ళి గట్టిగా తిని జిహ్వారుచి తీర్చుకునేవాడు హోటలు వాడి దగ్గర అప్పయింది పాన్ దుకాణం వాడి దగ్గర అప్పైంది. వాళ్ళి ద్దరూ ఒకరోజున భాస్కరరావు తండ్రి దగ్గరికి వచ్చారు భాస్కరరావు తండ్రి ధనవంతుడు కాక పోయినా గౌరవం కలవాడు. కొడుకు దురలవాట్లు తెచ్చిన పరిస్థితి చూచి ఆయన అరికాలి మంట నెత్తికెక్కింది ఆయన అందరికీ డబ్బిచ్చి పంపించాడు ఆ డబ్బు మటుకెంత? పది, పన్నెండు రూపాయలు అవి ఆయన ఇచ్చి పంపించాడు కాని భాస్కర్‌ను మటుకు ఎలా చావగొట్టాడు జీవి తాంతం జ్ఞాపకం ఉండేటట్లు చేశాడు కొరడా చురుకు మీద చురుకు అతని మీద పడసాగింది. అతని వీపంతా నల్లగా అయింది దెబ్బలు పడ్డ అతని చొక్కా సయితం చిరిగి పీలికలైంది భాస్కర్రావు ఏడవలేదు. పోలీసుల దెబ్బల్లాంటి దెబ్బలు తిని కూడా అతను అసలు ఏడవలేదు పదమూడేళ్ళ ఆ బుడతడు ఏడవలేదు కళ్ళల్లో నీళ్ళన్నా నిండ లేదు దెబ్బలు తింటున్నాడు కాని తప్పైందని మటుకు ఒప్పుకోవటం లేదు తండ్రి మటుకు కొడుతూనే అంటున్నాడు "తప్పైందని ఒప్పుకో —ముక్కు పట్టుకుని క్షమాపణ కోరు"

"నే నెందుకు ముక్కు పట్టుకోవాలి నువ్వు శిక్ష వేశావు. నే ననుభవించాను ఇంకేమని క్షమాపణ కోరుకోను ? చాలకపోతే ఇంకా కొట్టు చొక్కా చిరిగి పోయిందా ? లాగు కూడా చిరగ గొట్టు, వీపు పగల గొట్టావుగా ఇక కాళ్ళూ చేతులూ విరగగొట్టు"— ఒళ్ళు పడగానే తప్పు తీరిపోతుంది— నేను క్షమాపణ కోరను—"

తండ్రికి మతిపోయినట్లయింది అలాగే కొడుతూనే ఉన్నాడు. చేతుల మీద కొట్టాడు. కాళ్ళ మీద కొట్టాడు. పదమూడేళ్ళ ఆ కుర్రాడు, జమదగ్నిలాటి తండ్రి దెబ్బలకు కాళ్ళూ చేతులు విరగ కొట్టుకుంటున్నాడు భాస్కర్ తల్లి ఆ దృశ్యం భరించలేకపోయింది ఇద్దరికీ మధ్య వచ్చి "కొట్టబోకండి" అన్నది, భర్త చెయ్యి పట్టుకోసాగింది. ఆ ఆవేశంలో ఆమెకూ ఒడా ఒక దెబ్బ తగిలింది అప్పుడు నీలకంఠ్ ఒక్క సారి ముందుకు వెళ్ళి తండ్రి కాళ్ళు పట్టు కున్నాడు ఆయన చేతులు పట్టుకోలేదు తండ్రి కాళ్ళమీద తల పెట్టి చేతులు జోడించి, "నాన్నా వాడిని కొట్టొద్దు. వాడు చచ్చిపోతాడు. వాడికి బదులు నేను క్షమాపణ కోరుతాను తప్పయి పోయింది నాన్నా—" అని నీలకంఠ్ తండ్రి కాళ్ళ మీద పడ్డాడు. అప్పుడు తండ్రి భాస్కర్‌ని క్షమించాడు. నీలకంఠరావును దగ్గరికి తీసు కున్నాడు.

భాస్కర్రావు కిప్పుడా దృశ్యం కళ్ళ ముందు కొస్తున్నది ఆ రోజున నాన్న నీలకంఠ్‌ని పొట్టలో పెట్టుకున్నాడు కాని నిజానికి తననే నీలకంఠ్ పొట్టలో పెట్టుకున్నాడు జీవితం పొడుగునా తనని పొట్టలో పెట్టుకున్నాడు తన మానం కాపాడుతూ వచ్చాడు. అలాటి వాడు ఈ రోజున వెళ్ళి పోయాడు. ఈ ప్రపంచంనుంచే వెళ్ళి పోయాడు. మిగిలింది వట్టి శరీరం. వట్టి మట్టి బొమ్మ కాని దాని ఆత్మ వెళ్ళిపోయింది. అలాటి ప్రేమ భావము తనకిక దొరకనే దొరకదు. ఆ ఆధారం ఇకముందు తన కెప్పుడూ దొరకనే దొర కదు ఈ పార్థివ దేహం నష్టమైపోతే ఇక ముందు చూదన్నా లభ్యం కాదు తనకు అతని ఆకృతి నష్టమై పోయాక— అతని ఆకృతి కేవలం స్మృతిలోనే తరంగిత మవుతుంది.

శవ వాహకులు పలుపులు తిరుగుతూ వెళ్ళు తున్నారు భాస్కర్రావు మనసులో ఆలోచనలు ఒక్కసారి ప్రత్యేకమైన మలుపులు తిరిగాయి. హైస్కూల్లో చదువుకునేటప్పుడు— నీలకంఠ రావూ, భాస్కరరావూ ఒక వాగ్దానం చేసు కున్నారు. అది ఇప్పుడు గుర్తుకు వచ్చింది. ఆజన్మాంతమూ ఒకే కుటుంబంగా కలిసి ఉండా లని అప్పుడు నిర్ణయించుకున్నాడు ఆజన్మాం తమూ ఒకళ్ళ వంటి పెట్టుకుని ఇంకొకళ్ళుండా లనీ, ఎవరి దగ్గరేదుంటే అది రెండో వాళ్ళతో పంచుకోవాలనీ, దానికి లెక్కా జమా పెట్టుకో కూడదని నిర్ణయించుకున్నారు.

మొదట్లో కొన్ని సంవత్సరాలు అలాగే జరి గినై నీలకంఠరావు చిన్న తనంలో తనని కాపా డుతూ వచ్చాడన్న స్మృతి భాస్కర్రావుకు బాగా గుర్తు ఉన్నది కూడాను చిన్నతనంలో తను ఇల్లు వదలి పెట్టినప్పుడు నీలకంఠ్ తనకు నాలుగణా లిచ్చాడు. ఆ నాలుగణాలు తీర్చటానికి నాలు వే లిచ్చినా చాలదన్న సంగతి భాస్కరరావుకు తెలుసు. ఏదో గుర్తుకోసం అన్నట్లు తన ఉంగరం ఇచ్చాడు. బంగారపు గడియారం ఇచ్చాడు కలిసి ఉండటం మొదలైనప్పటి నుంచీ.. తను ఏది తీసినా, ఇద్దరి కోసం తీయాలనే నిర్ణయం చేసుకున్నాడు. ఒకళ్ళ కోసమని ఏదీ తీయకూడదు. బట్టలే కాదు సామాన్లు కాదు, కుర్చీలేకాదు ఏవైతే భాస్కరరావు తనకోసం తీసుకున్నాడో— అవి నీలకంఠరావు కోసం కూడా తీసుకున్నాడు తరు వాత ఇద్దరి భార్యలూ కాపురానికొచ్చారు పిల్లలు కలిగారు కాని భాస్కర్రావుకు మటుకు తన పిల్ల లకీ, తమ్ముడి పిల్లలకీ మధ్య భేదభావం కలుగనే లేదు. వాస్తవానికి భాస్కరరావుకు ఒక్కడే కొడుకు, నీలకంఠరావుకు నలుగురు పిల్లలు. కాని భాస్కర్రావుకు తన పరభావమే లేదు. అందరు పిల్లలూ తన పిల్లలే ఏది చేసినా అందరి కోసమూ చేసేవాడు. ప్రతినెలా తినుబండారాలే ఏభై రూపాయలవి తెచ్చేవాడు. నీలకంఠరావు

పిల్లలకు భాస్కర్రావు ఏమి చేయలేదు ? తన ఒళ్ళో పెట్టుకుని ఆటలాడించాడు. దెబ్బలో, అస్వస్థతో కలిగితే సేవచేశాడు. శుశ్రూష చేశాడు. వాళ్ళు ఎప్పుడేగి కావాలంటే అదల్లా తెచ్చిచ్చాడు. పిల్లలు ఏది కావాలన్నా— తల్లినీ తండ్రినీ అడగకుండా, పెదనాన్ననే అడిగేవాడు. పెదనాన్న ఏ మాత్రం ఆలస్యం లేకుండా వాళ్ళ కోరికలు తీర్చేవాడు. అందువల్ల ఒకొకప్పుడు కష్టాల్లో కూడా ఇరుక్కునేవాడు ఒక్కొక్కప్పుడు జేబులో ఒక్క రూపాయి కూడా మిగిలేది కాదు ఐనా భాస్కర్రావు పిల్లలకెప్పుడూ లేదని అనేవాడు కాదు. తన పిల్లలతోబాటే వాళ్ళకీ బట్టలు కుట్టించేవాడు. చదువుకోవటానికి టేబిల్ లాంప్ కొనిచ్చాడు. కలాలు ఎన్ని కొనిచ్చాడో లెక్కలేదు. తన పిల్లలతో బాటు నీలకంఠరావు పిల్లలకు కూడా సైకిలు కొనిచ్చాడు చిన్న పిల్లలకు లాగుడు బళ్ళు కొనిచ్చాడు తన తమ్ముడి పిల్లల మీద భాస్కర్రావు ఎంతో ప్రేమ చూపించాడు ఏ పనైనా అనుకున్నది అనుకున్నట్లు కురిపించటం భాస్కర్రావు అలవాటు— అయితే "నేను ఇది చేశాను" అని అతని నోటితో ఎప్పుడూ అన్నది లేదు "ఇది మనం చేశాం, ఇది మనది—" అనేవాడు ఒకొక్కప్పుడు ఋణ భావన వల్ల తను చేసిన వాటికి గూడా నీలకంఠరావుకే గొప్ప ఇచ్చేవాడు. "ఇది నువ్వు తెచ్చావు. ఇది నువ్వు చేశావు—" అందరి మంచితనాన్ని నిర్లిప్తతతో అతను నీలకంఠరావు పాదాల చెంత వదిలేవాడు భాస్కర్రావు తనని తను పూర్తిగా మరిచిపోయాడు రోజురోజుకి ఇంకా మరిచి పోసాగాడు.

నీలకంఠరావు వళ్ళు తెలుస్తూ వచ్చాడు అతను సావధాన పడటానికి కారణం చెడ్డది కాదు మంచిదే. అతను భాస్కర్రావుతో అనే వాడు—"అన్నా—ఎందుకు నువ్వెప్పుడివన్నీ తెస్తావు? ఇవి తేవటాని కవసరం ఇప్పుడేమున్నది ? నువ్వెక్కువ ఖర్చు పెడతావు ఇంత ఖర్చు పెట్టట మెందుకు ? ఇలా అయితే ఎప్పుడో మనం ఆపత్తిలో పడతాము"

భాస్కర్రావు నవ్వి తోసివుచ్చేవాడు అప్పుడు నీలకంఠరావు అతనితో మరమరి అనే వాడు, "ఎందుకని తాగుతావు ఇన్ని సిగరెట్లు ? ఈ డబ్బంతా కూడబెడితే నీకే అక్కరకొస్తుంది."

భాస్కర్రావు మళ్ళీ నవ్వి "నేను చేస్తే నేం ? నువ్వు చేస్తేనేం— ఎవరు చేసినా ఒకటే— ఎవరు దాచిపెట్టినా ఒకటే నువ్వు జాగ్రత్త పెడుతున్నావు కదా ? చాలదూ ?" అనేవాడు.

భాస్కర్రావు మారలేదు మారాలని అతని కనిపించనూలేదు అప్పుడప్పుడు భాస్కర్రావు ఖర్చు చేసే పద్ధతి, లెక్కలేని పద్ధతి నీలకంఠ రావు భార్యకు కోపం తెప్పించేది సమయం చిక్కినప్పుడు వెనకనుంచి తన భావం స్పష్టంగా చెప్పింది కూడాను కాని భాస్కర్రావు అది మనసు కెక్కించుకోలేదు భాస్కర్రావు ఇంట్లో అందరి కోసం డబ్బు ఖర్చు పెడుతూండేవాడు. అయినా, తనకొచ్చే డబ్బు ఖర్చుపెట్టేవాడు.

కాని బంగారం లాంటి ఆ ఇంటికి కూడా ఎక్కడో పురుగు పుట్టినది మాటుమ నిజము. దాని గుణగుణ స్వరం సాగుతున్నది. ఆ ద్వారా భాస్కర్రావు చెవిదాకా కూడా పోతూ వచ్చింది. ఏదో చిట్టిలుకల వ్యవహారంగా తోసిబుచ్చాడు. భాస్కర్రావు అందువల్ల అతని లక్ష్యం అటు పోలేదు. నీలకంఠరావు చెబుతుండేవాడు. అతని భార్య చెప్పిన మాటలే. కాని నీలకంఠరావు మనసులో భాస్కర్రావును గురించిన ఆదుర్దాయే కాదు, అతని భారం కూడా తన మీద పడదుకదా అనే భావం అతని మనసులో ఉత్పన్నమైంది. తన భార్య, తన పిల్లలూ, తన డబ్బు, తన వస్తువులూ, అనే ఒక విధమైన పిచ్చి భావం కూడా అతని మనసులో ప్రవేశించింది. తను డబ్బు దాచుకుంటే అది తన తెలివి తేటలు వల్ల జరిగిందే కాని అప్పుడప్పుడు "ఇది నాది. ఇది నేను తెచ్చాను దీని ఖరీదింత ? దీని ధర పెరిగింది. విపరీతంగా పెరిగింది ధర—" అనటం మొదలు పెట్టాడు. కాస్త వీలు దొరికితే నీలకంఠరావు ఇది భాస్కర్రావుకు వినిపించేవాడు. భాస్కర్రావు కొంచెం ఆశ్చర్య పోయినా స్వభావం ఎరిగిచి దుర్లక్ష్యం చేశాడు. "దినికంతకూ కారణం డబ్బులేక నీలకంఠరావు అలసి పోయినా కొంచెం చిరాకు ఎక్కువైంది. అయినా వాడు మారం ఒరిగిపోయినాడు. లేకపోతే వాడు అలా మాట్లాడేవాడుకాదు. ఇంతకు ముందెప్పుడైనా ఇలా ఉన్నాడా ? అంటూ అన్నా


కాశ్మీర్ బొకె
టాల్క్‌తో
గంటలుతరబడి
సువాసనగా
తాజాగావుండండి

అత్యద్భుతమైన, నాణ్యమైన
కాశ్మీర్ బొకె కాస్మెటిక్స్ ఒక సౌందర్య
టాల్క్....ఒక బేబీ పౌడరు

పూల గుచ్ఛంలోనికి దొబ్బినట్టుగా
వుంటుంది. కాశ్మీర్ బొకె టాల్క్
యొక్క చల్లని. పూలరేకు వంటి
మెత్తదనాన్ని అనుభవిస్తే.
వొళ్లు అంతా రాసుకొనండి. నవ
వసంతపు ఘుమఘుమలతో
రాజిల్లుతారు.



శిశువును సంతోషంగా
సౌఖ్యంగా వుంచండి:
కాశ్మీర్ బొకె ప్రతి
యితర ప్రత్యేక బేబీ
పౌడరువలె మెత్తగా
సున్నితంగా వుంటుంది
మీ ఇద్దరూ ఉపయో
గించగల ఒకే పౌడరు
అందుబాటులో వుండ
టం ఎంత వీలు!




కాశ్మీర్ బొకె
పురుషులు వాంఛించే సువాసనగల టాల్కం పౌడరు!
కాల్గేట్ వారి ఒక నాణ్యమైన తయారి.
CBG 20 TEL

డులే— కొంత మనసు వదులైతే మంచిదే. మనిషి మనసు విప్పుకోవటానికి హక్కుంటుంది. నాకన్న వాడికి మటుకెవరున్నారు ? మనసు విప్పి మాట్లాడటానికి.

కాని అది రోజు రోజుకీ పెరగసాగింది. ఏ ఖర్చు లను గురించైతే మాటిమాటికీ వినవలసి వస్తున్నదో, వాటిని విని భాస్కర్రావు ఆశ్చర్యపడ్డాడు తనూ ఖర్చు చేస్తున్నాడు. కొంచెం ఎక్కువగానే చేస్తున్నాడు. అందుకనే తన దగ్గర ఏమీ మిగలటం కూడా లేదు ఒక రోజున నీలకంఠరావు అతన్ని డబ్బు కావాలని అడిగాడు అప్పుడు భాస్కర్రావు దగ్గర అంత పైకం లేక పోయింది. అంతకు ముందే భాస్కర్రావు, నీలకంఠరావు కొడుక్కోసం సైకిలు కొనిచ్చాడు. భాస్కర్రావు ఆ మాట అనలేదు. అప్పుడే నీలకంఠరావు కోసం అతను అందమైన గలీచా ఒకటి కొని తెచ్చాడు దాని సంగతి కూడా ఎత్తనే లేదు. తన కొడుకు జబ్బుతో ఉంటే దాని బిల్లుకూడా కట్టివచ్చాడు. అది అసలు చెప్పవలసిన విషయమే కాదు కాని కారణాలు తేట తెల్లంగానే ఉన్నై. కాని నీలకంఠ రావుకు మటుకు అవి కనిపించినట్లు లేదు డబ్బు కూడ బెట్టుకోవాలని ఉద్దేశ్యం అతన్ని ఎలా కమ్ముకున్నదంటే— ఈ కారణాలన్నీ అతనికే కనుపించలేదు. భాస్కర్రావు తల వంచుకు కూర్చున్నాడు. తమ్ముడి ఎదుట. అతని తల వంగి పోయింది. నిజానికి అతని కప్పుడనిపిస్తున్న భావమల్లా ఒకటే 'ఇంత ఖర్చుచేసి ఇప్పుడు నీలకంఠ్ కు డబ్బు ఇవ్వగలిగిన పరిస్థితి ఉంటే ? ఇవ్వలేక పోయినందుకు అతనికి దుఃఖం కలిగింది. కాని ఆ దుఃఖాన్ని నీలకంఠరావు ఆ సమయంలో గుర్తించలేక పోయాడు వాస్తవానికి భాస్కర్రావు దుఃఖం నీలకంఠరావుకు తెలిసినంత ఇక ఎవరికీ తెలియదు. ఒకళ్ళ కష్టసుఖాలు ఇంకొకళ్ళకి చెప్పుకుని భారం తగ్గించుకోవటం అనే పద్ధతి ప్రాణం పోగొట్టుకున్నది. కాని కారణం లేకుండా డబ్బును గురించిన తేడా నీలకంఠరావును లోబరుచుకోబట్టి ఇవాళ భాస్కర్రావు దుఃఖాన్ని అతను అర్థం చేసుకోలేకపోయాడు చిన్నబుచ్చుకుని తటుక్కున అన్నాడు—

"ఇది మామూలేగా అన్నా— నేను డబ్బు అడగగానే నువ్వివ్వటం ఎప్పుడైనా జరిగిందా? ఎప్పుడూ నేను ఇవ్వటమే— నేను చేయటమే— నేను భరించాల్సిందే— నేను బరువు మోయాలి బరువు మోయలేక చావాలి. ఒకరోజు బరువు మోయాలి. ఇంకో రోజు జవాబుదారీ తీసుకోవాలి—"

భాస్కర్రావు తల కొంచెం పైకి లేచింది కనురెప్పలెత్తి నీలకంఠరావు వంక చూచాడు భాస్కర్రావు. అతని చూపులు నీలకంఠరావును అడుగుతున్నట్లున్నై— "నిజమేరా — ఇదంతా నువ్వొక్కడివే చేశావా"?

కాని నోటితో భాస్కర్రావేమి అనలేదు. నీలకంఠరావు అతని చూపులో ఉన్న అర్థాన్ని గ్రహించలేదు. గ్రహించినా గ్రహించనట్లున్నాడేమో.

అది అలా జరిగిపోయింది కాని అలా అన్ని సమయాలు తేపతేపకు రాసాగినై. నీలకంఠరావు భాస్కర్రావు మీద అట్టే ఆరోపణ చేస్తూ వచ్చాడు. " నేను నిన్ను కాపాడాను. నీ గౌరవాన్ని రక్షించాను. చిన్నప్పటినుంచీ ఇంతవరకు నేనే నీకు సాయం చేస్తూ వచ్చాను. నీ సాయం మటుకు నా కెప్పుడూ దొరకలేదు. నీ మూలకంగా నేనొక క్షణమైనా నిశ్చింతగా ఉన్నది లేదు. నేనడగటం నువ్వు లేదనటం ఎప్పుడూ ఉన్న ఏడుపే—"

భాస్కర్రావు ఒక్కసారి గంభీరుడైనాడు. ఎంత లేదన్నా ఏభైసార్లన్నా ఆ విషయం భాస్కర్రావు తన తప్పు వప్పుకోవటం జరిగింది. నీలకంఠరావుకు అవసరమొచ్చినప్పుడల్లా తాను సాయం చేయలేక పోతున్నానే అనే దుఃఖం అతనికి నిజంగానే కలిగింది. ఆ ఆరోపణ కూడా హద్దు దాటింది. సహించటానికి కూడా హద్దు దాటిపోయింది. ఒక్కసారి ఎప్పుడూ లేని విధంగా గంభీరుడై నీలకంఠరావు మీద చూపు నిలిపి "నువ్వనేది నిజమేనా?" నేనెప్పుడూ ఏమీ చేయలేదా? నీ పిల్లలమీద నాపిల్లలమీద చూపిన ప్రేమ చూపించలా?" అన్నాడు.

"వట్టి ప్రేమేమీ అక్కర్లేదు—" చెయ్యి విదిలించి కొడుతూ అన్నాడు నీలకంఠరావు — "నేను మటుకు తక్కువ ప్రేమ చూపించానా నీ మీద?"

మాస్టర్ : హోమ్ వర్కు పది లెక్కలు చేసికొని రానివాళ్లు బెంచీ ఎక్కండర్రా !

గోపీ : సార్ ! నేను ఐదు లెక్కలు చేసుకొచ్చాను గదండీ!

మాస్టర్ : అయితే నువ్వు బెంచీమీద ఒక కాల్తో నిలబడు సగం చేశావు గనుక.

రామయ్య (మద్రాస్)

"అయితే ఒక్కొక్కటే గుర్తు చేస్తాను నీకు." కొంచెం సంకోచంతోనూ, సిగ్గుతోనూ అన్నాడు భాస్కర్రావు.

"గుర్తు చేయరాదూ? నువ్వేలాటి గుర్తులు చెబుతావో నేను గుర్తు చేస్తాను—" అన్నాడు నీలకంఠరావు.

"ఆగు, నన్ను చెప్పనియ్యి—" నీలకంఠరావును ఆపుతూ భాస్కర్రావన్నాడు —"నువ్వు నాకు సాయం చేసిన మాట వాస్తవమే కాని నేను నీకు అంటే ఇంకా ఎక్కువ సాయం చేశాను. నీకు ఏయే వస్తువులిచ్చింది— నీ పిల్లలకేమేమి పెట్టింది లిస్టు ఇప్పుడు నేను చదవను నాకు చిన్న తనంగా ఉంటుంది. వీలైతే నువ్వే ఎంచుకు చూచుకో— మనసులోనే లెక్కేసుకో నా డబ్బుకూడా ఎంత ఖర్చై ఉంటుందో? ఈ ఇంట్లో నేను డబ్బు— నీళ్ళలాగా ఖర్చు పెట్టాను. నా ఇల్లనుకుని ఖర్చు చేశాను దాన్ని పోనీయ్. చిన్నతనం సంఘటన గుర్తు చేస్తాను నువ్వుకూడా ఒకసారి తప్పిపోయావ్. నువ్వుకూడా చెడుసాహసాలు చేశావ్. నువ్వు ఏమి చేయలేను అనే నిశ్చయానికొచ్చావ్. నీకు కూడా భయంకరమైన మనస్తాపం కలిగింది. నువ్వుకూడా నాన్నకు మనస్తాపం కలుగ చేశావ్. ఆ సంఘటన నంతా నేను చెప్పను నీలకంఠ్ నీ మాదిరిగా ఉపన్యాసమివ్వటం నా చేత కాదు. అన్న తమ్ముడి లోపాలు సంగతెత్త రాదు. మిత్రుడు మిత్రుడి దోషాలు ఉల్లంఘించ రాదు. నలుగురిలో ఈ గోష్టి అసలు చేయనే రాదు. ఏకాంతంలో అతని లోపాలు చూపించటమే మైత్రి అంటారు. బాంధవ్యమంటారు. నువ్వు నా సోదరుడివి మిత్రుడివి, కూడాను నా గౌరవము కాపాడావు. నా రక్షణ కర్తవు కూడాను. అని నా మనసు అనే గుహలో దాచుకున్నాను. నేను కూడా ఎప్పుడూ దాన్ని గురించి ఆలోచించ లేదు. ఆ విషయాన్ని నేనెప్పుడూ ఎత్తేవాడ్ని కాదు గడిచి పోయిన ఆ కథను గురించి నేనెప్పుడూ మాట్లాడేవాడినికాదు నువ్వు నాసోదరుడని నాకు తెలుసు. చిన్నతనం నుంచీ ఒకళ్ళ మీద ఇంకొకళ్ళం ప్రేమ చూపించుకుంటూ వచ్చాం. అలాగనే శపథం కూడా తీసుకున్నాం ఆ శపథాన్ని త్రిప్పిగొట్టటం నాకు చేతకాదు నీలూ. దాన్ని పాలించాలి. ఆదరించాలి అంతే. కాని నీకు దాని మీద ఆదరము తొలగి పోయింది దాని దృష్టే మరిచి పోయావు.ఆ భావములో నీలో కలిగేటందుకు చిన్నతనపు సంఘటనొకటి చెబుతాను"

మధ్యలోనే నీలకంఠ్ ఒక్కుమ్మడి అడ్డు వస్తూ చెయ్యెత్తి "ఏమీ గుర్తు చేయక్కర్లేదు." అన్నాడు.

"ఏం— ఎందుకక్కర్లేదు—"

"వినాలని నాకు లేదు—"

" కాని చెప్పాలని నాకున్నది నీకు నీ తెలివితేటలను గురించి, నీ డబ్బును గురించీ గర్వం పెరిగింది. నీ చేతలను గురించిన మైకం నీకెక్కింది అది దిగి పోయే లాగ ఒక విషయం జ్ఞాపకం చేయాలి. డబ్బు అందరికీ దొరుకుతుంది. నాకూ ఏమీ తక్కువ దొరక్కవదు. అహంకారం నిన్ను చుట్టుముట్టింది. నీ భావనా శక్తి అచేతనమైంది. విషం ఎక్కితే దించాల్సిన అవసరం ఉన్నది. గుర్తు చేస్తాను విను నీలకంఠ్. ఒకప్పుడు నువ్వు రాత్రి అపరాత్రి నిద్రలేక బాధపడ్డావు— రాత్రీ— అపరాత్రి తిరుగుతూ ఉన్నావ్. మనస్తాపంతో ఆత్మహత్య చేసుకోవటానికి బయలు దేరావు. అప్పుడు నీ చెంత నేను తప్ప ఎవరున్నారు. అప్పుడు నీ ప్రాణాలు కాపాడింది ఎవరు ? ఆ సంవత్సరం నువ్వు తప్పి పోయావు. నేను తప్పి పోయాను. కాని నేను తప్పి పోవటానికి కారణం నువ్వు. అలా అని నేనెప్పుడూ ఎవరితోటీ చెప్పలేదు. నా మూలకంగానే నువ్వు తప్పావని అందరికీ చెబుతూ వచ్చాను అది నీకు ఇప్పుడు నిజమనే అనిపిస్తుందాలి నువ్వేదంటే దానికి నేను 'ఊ' అంటున్నాను. ఏ విధమైన తప్పిదమైనా నా పైన వేసుకుంటున్నాను— దీని అర్థమేమిటీ?"

నీలకంఠ్ క్షణం సేపు స్తబ్దుడైనాడు. అతనికి మర్మాఘాతం తగిలినట్లయింది. ఒక్క క్షణం ఉండి కోపంతో గురగురలాడుతూ వెళ్ళిపోయాడు. భాస్కర్రావు ఏ సంగతైతే గుర్తు చేశాడో అతని కళ్ళముందు ఇంకా అలాగే ఉంది. ఆ ఉదాహరణ నీలకంఠ్ రావుకు ఇప్పుడు అక్కర్లేదు. ఆ సంఘటన చిన్నతనంలో జరిగింది— జరిగి పోయింది. దాని బూడిద ఇప్పుడు తన గుప్పిటలోకి తీసుకు చూడాలనే కోరిక అతనికి లేదు. ఆ ఉదాహరణ వల్ల అతని కళ్ళు తెరిపిడి పడాల్సింది. భాస్కర్రా

వుడు అనవసరంగా అంటున్నాడన్న సంగతి అర్థం కావల్సింది. తనకు ప్రాణదానం చేశాడని భాస్కర రావుమీద ప్రేమ నిండుకోవాల్సింది. కృతజ్ఞతా భావం నిండాల్సింది కాని పూర్తిగా విరుద్ధమైనదే జరిగింది తన మీద ప్రేమ పెంచుకుని భాస్కర రావు మీద ద్వేషం పెంచుకుని ఉన్న నీలకంఠరావు అప్పటినుంచీ అతనితో మాటలు కూడా మాని వేశాడు. ఒకింట్లో ఉంటూ కూడా ఒకళ్ళొకళ్ళతో మాట్లాడటం మాని వేశారు ప్రక్క ప్రక్కన కూర్చుని భోంచేసేవారే కాని ఒకళ్ళ వంకింకొకళ్ళను చూచే వాళ్ళు కాదు. ఏమైనా ఇలాగే ఈ విచిత్ర పరిస్థితి సాగింది. వారం తరువాత మాటలు మళ్ళీ ఆరంభమైనై అది కూడా మళ్ళీ పోట్లాటకే— 'నువ్వు—నాది' అనటం మళ్ళీ పోట్లాడుకోవటం మళ్ళీ మాటలు మాని వేయటం ఇలా జరుగుతూ వచ్చింది. దీనికంతటికంటూ ఉన్నదా అన్న ఆలోచన భాస్కరరావుకు కలిగింది ఏళ్ళిద్దరు పోట్లాడు కుంటూంటే పిల్లలు బిక్క చచ్చిపోసాగారు ఏడవటం మొదలెట్టె వాళ్ళు

భార్య పిల్లలతో భాస్కరరావు ఇల్లు విడిచి పోవటానికి బయలుదేరితే నీలకంఠరావు పిల్లలు అడ్డుపడి "నిన్ను వెళ్ళనీయము పెద నాన్నా—" అని కూర్చునే వాళ్ళు దర్వాజా దగ్గర.

భాస్కరరావు ఆలోచనల మీదనే ఒక్క సారి ఆగి పోయాడు. ఆ వాహకులు నడుస్తూనే ఉన్నారు అఖరి ఇల్లు కూడా దగ్గర పడుతున్నది. ముందు నీలకంఠరావు కొడుకు నిప్పు తీసుకుని వెళు తున్నాడు. అతని కళ్ళ వెంబడి వర్షం కురిపి స్తున్నై. ఈ కుర్రాడు ఎన్ని ఎన్ని అడవులు తలుపు దగ్గర అడ్డుకొన్నాడో అనిపించింది భాస్కరరావుకు. "ఇల్లొదిలి వెళ్ళొద్దన్నా—" క్రిందపడి ఎన్ని పొర్లు పొర్లాడో. ఇప్పుడు తన జన్మదాత— భౌతిక రూపం వదిలి వెళ్ళి పోతూంటే ఏమీ చేయలేక పోతున్నాడు

'అరే—' భాస్కరరావు ఒక్కసారి గతుక్కు మన్నాడు. 'తనకు ఎటుకు ఈ పిల్లవాడి పాశంనుంచి తప్పించుకుని ఇల్లు వదలి వెళ్ళవలసిన అవసరం లేదా? నీలకంఠ్ ఒక పిచ్చిపని చేశాడు అని తమూ చేయాలా! కాని ఎంత కాలం ఇలా సహించి ఉండటం? ఎంత సేపు ఈ అవమానం భరించటం? విన్నదే విన్న తడవలు వినటం? ఆశ్రితుడిలాగా ఎంత కాలం ఇలా దీనంగా బ్రతకటం? నేనంటున్నానన్న మాటేగాని నేనెప్పుడూ నీలకంఠ్ మీద ఆధార పడి బ్రతకటం లేదు నాకు బాగానే సంపాద నున్నది కాని అది నా చేతిలో నిలవదు ఖర్చైపోతుంది. అదే తప్పు. తప్పు అక్కడ జరిగింది తన దగ్గర డబ్బుండని మాట ఎటుకు నిజమే కాని నీలకంఠ్ కి ఎంత ఇచ్చినాగాని చాలదు. అతనికి తృప్తినేది లేదు. అతను చిన్న తనంలో చేసిన ఉపకారానికి తిరిగి ఏమి చేసినా తీరటమనేదే ఉండదు. ఏమి చేయాలో తోచటం లేదు. దోవ తోచటం లేదు. నా అలవాటు ఎటుకు మారటం లేదు. ఎవరైనా ఏదైనా అడిగితే, ఇవ్వనని కూడా లేదని అనలేక పోతున్నాను. ఒక విధంగా నేను చదువు కున్న మూర్ఖుడ్నైనాను'

నీలకంఠ్ కొడుకు ఉపనయనం నిశ్చయమైంది. నీలకంఠ్ కొడుకు నాదగ్గర కొచ్చి, "పెదనాన్నా నా వడుక్కు బంగారపు గుండీలు కావాలి, నాకు రిస్టు వాచీ కావాలి, సిల్కు సూటు కావాలి" అన్నాడు.

పెద తండ్రి— తమ్ముడి కొడుకును దగ్గరకు తీసుకుని కౌగలించుకుని "సరే—సరే అన్నీ తెస్తాను నా బాబుకు" అన్నాడు. అని ఆవస్తువులన్నీ కొన్నాడు. అన్నీ మంచివే ఖరీదైనవే కొన్నాడు భాస్కరరావుకు ఏ వస్తువూ నచ్చేది కాదు. అది ఎవరికైనా ఇచ్చేదైతే ఇక చెప్పనే అక్కర్లేదు

వడుక పెళ్ళి కొడుక్కి ఇంత చేశాడా? నీలకంఠ్ రావు కోసం వెండి కంచమొకటి తీసుకున్నాడు మరదలు కోసం ఒక ఖరీదైన చీర కొన్నాడు. ఇంట్లో పిల్లలకందరికీ ఖరీదైన బట్టలు కుట్టిం చాడు. ఆ నెల జీతమంతా భాస్కరరావు వీటి కోసమే ఖర్చు చేశాడు.

వారం తరువాత నీలకంఠ్ రావు కూతురి పెళ్ళి అదృష్టం కొద్దీ కుదిరింది. ఎవరి మనసులోనూ అది లేదు. ఆ పిల్ల అత్యంతానందంతో పెదనాన్న దగ్గరకొచ్చింది. చుట్టు ప్రక్కల ఎవరు లేకుండా చూచి "పెదనాన్నా నా పెళ్ళికి నువ్వేమిస్తావ్?" అన్నది "ఏమి కావాలి నీనా?"

"నాక్కు మంచి బెనారెస్ సిల్కు చీరె, జుంబర్ జోడీ తీసుకో పెదనాన్నా—" అన్నది.

"జుంబర్ జోడా?—"

"అంటే చెవులకు పెట్టుకునేది" అన్నది

"ఆ, ఆ సరే. ఇస్తాను." అన్నాడు భాస్కరరావు. మర్నాడు అప్పు చేసి అవన్నీ తీసుకొచ్చాడు వచ్చే నెల తీర్చి పారేస్తాడు పిల్ల పెళ్ళయి అత్తారింటికి వెళుతున్నది భాస్కరరావుకో ఆనందం కలిగింది

మర్నాడు నీలకంఠరావు భాస్కరరావును కేకే శాడు "అన్నా"—

"ఏమిటీ నీలా—"

"నీతో ఒక పనున్నది అన్నా—"

"ఒకటేమిటీ— పది చెప్పు— లేక పోతే ఏ నూరో చెప్పు—"

"అబ్బే ఒకటి చేస్తే చాలు—" నీలకంఠరావు గంభీరంగా అన్నాడు. భాస్కరరావు తల వంగి పోయింది ఆ పనేమిటో అతనికి తెలియు సాగింది.

"ఏమిటంటే, అబ్బాయి ఉపనయనం నిశ్చ యించుకున్నాము పిల్ల పెళ్ళి కూడా నిశ్చయమై పోయింది నువ్వు నాలుగైదు వేలు ఇస్తే—"

"నాలుగైదు వేలా?"

"మరి నాలుగైదు రూపాయలా?" నీలకంఠ రావు రోషపడుతూ అన్నాడు "నాకు అవసర మొచ్చింది— ఇస్తావా?" నీలకంఠరావుకు కోప మొస్తే కొంచెం ఈసడింపుగా అంటాడు. భాస్కర రావు లేవన్నట్లు తల వంచుకున్నాడు. మెల్లిగా తల పైకెత్తాడు. —"లేదు— అంత లేదు నా దగ్గర" అన్నాడు.

నీలకంఠరావు వుంటుకుని అదివరకంటూ వచ్చి నమాటలే చదవటం మొదలు పెట్టాడు "నీవల్ల ఏమీ ఉపయోగం లేదు నీ వల్ల ఏదీ కాదు అంతా నేనే చేస్తున్నాను ఒక్కడ్నే ఏస్తున్నాను. ఒక్కడినే ఈ భారమంతా మోస్తున్నాను నీ వల్ల ఉపయోగ మేముంది?"

భాస్కరరావు మాట్లాడ లేదు. ఇంట్లో అందరూ నిశ్శబ్దమై పోయారు అందరి జీవాలు పైకీ క్రిందకు కొట్టుకులాడుతున్నై. ఉద్రేకం వచ్చి నీలకంఠరావు పోట్లాడటం మొదలు పెట్టాడు. "నువ్వు— అసలు నాకేమిచ్చావ్"

"నీకైనంత ఇస్తూనే ఉన్నాను నేను"

"అనరివ్వటానికి నీ దగ్గరేమున్నది గనుక కోరికే పిల్లల్ని గారాబం చేస్తే సరా? పిల్లలకు బంగారు గుండీలు చేయిస్తే నాకేం చేసినట్లు?"

"నీకు వెండి కంచం ఇవ్వబోతున్నాను"— భాస్కరరావుకు ఇంకా కోపం రాలేదు

"కంచమొద్దు నాకు"— అతని ప్రేమకో, బుదికో తగినట్లుగా అరిచాడు దగ్గరున్న టేబిలు మీద చేతో కొడుతూ"— ఇక్కడ డబ్బు కావాలి డబ్బు. నీ కంచమక్కర్లేదు నాకు. నీ ప్రేమ అక్కర్లేదు నాకు ఏ ప్రేమ వల్లైతే ఏమీ ఉపయోగం లేదో ఆ ప్రేమ అక్కర్లేదు నాకు అన్నా. నాకు రూపాయలు కావాలి డబ్బు లేకపోతే నా కూతురి పెళ్ళి ఆగి పోతుంది. చెప్పు. నా కోసం ఏమైనా చేస్తావా? డబ్బిస్తావా చెప్పు"—

"డబ్బు! డబ్బు! డబ్బు," భాస్కరరావు కూడా అంత బిగ్గరగానే అరుస్తూ అన్నాడు "నీకు డబ్బే కావాలి నీకు ప్రేమ అక్కర్లేదు. నీకు మనుషులక్కర్లేదు నీకు ప్రేమంటే తెలీదు. మనుషుల విలువ తెలీదు —"

"వట్టి మనుష్యులు నాకక్కర్లేదు అన్నా—" శాసిస్తున్నట్లు అన్నాడు నీలకంఠరావు "నాకు డబ్బు కావాలి, డబ్బు కోళ్ళు నేను ఎట్టుకున్నాను. డబ్బు లేకుండా ప్రపంచమే నడవదు డబ్బు లేనిదే నాకే అడ్డు తీరదు"—

"అందుకని నా దగ్గర గుంజాలని చూస్తు న్నావ్?"



# ప్రస్థానం

"నేనేం గుంజటం లేదు అన్నా— అనవసరంగా నా మీద అపవాదు మటుకు వేయబోకు"—

"అపవాదా"— కోపంతో ఉగ్రుడైపోయి చేయి పైకెత్తి అన్నాడు భాస్కర్రావు—

"అబద్ధాలు చెబుతానంటావురా — నేనెప్పుడైనా అబద్ధం ఆడానా? నన్ను అబద్ధపుకోరు— అంటావా? తీసుకో నీకు డబ్బు కావాలిగా"— కోపంతో ఒళ్ళు తెలికుండా చేయి పైకెత్తి నీలకంఠరావును ఒక దెబ్బ కొట్టాడు భాస్కరరావు రెండో దెబ్బ కొట్టడానికి చెయ్యి పైకెత్తాడు

నీలకంఠరావు ఇంకా ముగుకు వెళ్ళి "కొట్టు — కొట్టి చంపేసెయ్ ఒకసారి" అన్నాడు కోపంతో భాస్కర్రావు చెయ్యి మళ్ళీ కిందకు దిగేదే— కాని అక్కడున్న పిల్లలు ఒక్కసారి ఏడుపు మొదలు పెట్టారు. భాస్కర్రావు భార్య ముందుకు వచ్చి అతని చెయ్యి పైది పైనే పట్టుకున్నది. ఆమె శాంతంగానూ తీక్షణంగానూ అన్నది — చెయ్యి దించాడు "అన్నగారైనంత మాత్రాన కొట్టటం శోభస్కరంకాదు— అతను ఉద్రేకపడ్డాడని మనం ఉద్రేకపడతామా? సరిపోయింది— ఇవతలికి రాండి— ఈ క్షణాన్నే ఈ ఇల్లు నుంచి బయట పడదాం. ఇక ఈ ఇంట్లో ఉండే రోజులు పోయినై. ఇక ఇక్కడ ఉండటానికి శోభ మిగల్లేదు అతను మెడ పట్టి గెంటటం మొక్కటే మిగిలి పోయింది డబ్బు లేదుగా మీ దగ్గర—? లేదుగా?"

చిన్న పిల్లాడిలా భాస్కర్రావు తలవంచుకున్నాడు.

"పట్టి ప్రేమ ఉన్నది కదూ మీ దగ్గర"— భాస్కర్రావు కళ్ళు నీళ్ళతో నిండి పోయినై

"మాకు అది చాలు మీ ప్రేమతోటే మేము బ్రతకగలం. ఈ అవమానం మటుకు ఇక సహించటం కష్టం. పదండి— పదండి" భాస్కర్రావు భార్య తన పిల్లని పురమాయించింది. "బట్టలు సర్దండి — పుస్తకాలు తీసుకోండి"— అని ఆమెకూడ సామాను సర్దటం మొదలు పెట్టింది. భాస్కర్రావు నిశ్చేష్టుడైనాడు. ఈ పోట్లాటకు అంతం ఇలా అవుతుందని అతను ఊహించలేదు అతను కూర్చుని ఉండి పోయాడు

"ఎందుకు ఆందోళనపడుతారు— భగవంతుడే ఆందోళన పెడతాడు" భాస్కర్రావు భార్య మెల్లిగా అన్నది ఆమె ఎక్కువగా మాట్లాడేది కాదు. కాని ఇవాళ ఆమె మాట్లాడుతున్నది వెళ్ళి పోవటంలో ఏ మాత్రమూ తప్పు కనుపించలేదు ఒక ప్రక్క నుంచి సామాను సర్దుతున్నది మరొక పక్క నుంచి మాట్లాడుతున్నది. నీలకంఠరావు పిల్లలు సెతల్లి ఇంతగా మాట్లాడటం ఎప్పుడూ వినలేదు ఆమె దుఃఖాన్ని త్రోసి పుచ్చుతున్నది ధైర్యం తెచ్చుకుంటున్నది అదంతా కప్పి పుచ్చుకోవటానికి బిగ్గరగా మాట్లాడుతున్నది తన కంఠస్వరాన్ని త్రోసివేస్తున్నది — "విన బడటంలేదా? నేనూ ఈ వాగుడు కాయ మా పుట్టింటికి పోతాం. మరి? రావాలనుంటే — రండి మీరు కూడా—"

"ఇట్లా నేను రాను—"

"అయితే హోటల్లో ఉండండి. తెల్లవారగానే ఇంటికోసం వెతకండి— గంజినీళ్ళో, జొన్న రొట్టెలో తిని బ్రతుకుదాం కాని ఈ అవమానం మటుకు భరించలేం." భాస్కర్రావు భార్య సామాను సర్దటం పూర్తయింది. ప్రయాణానికి తయారుగా ఉంది. భాస్కర్రావు కూర్చున్న వాడు ఇంకా లేచి నిల్చోనే లేదు. అతను లేవటం లేదు. అతనికి వెళ్ళాలని లేదు. పిల్లలందరూ అక్కడ గుమిగూడి బిగ్గరగా ఏడవటం మొదలు పెట్టారు ఏడవనిదల్లా నీలకంఠరావు భార్య ఆమె శాంతగా అంతా చూస్తున్నది నిల్చున్నది. నీలకంఠరావు ఇంకా గుర్రం దిగనే లేదు అతని కళ్ళలో ఇంక 'పగ' చమక్ మంటూనే ఉన్నది. కోపంతో బాధతో అతని కళ్ళు మెరుస్తున్నై. ముఖం ఎక్కువ కఠోరమై పోయింది ఏ క్షణంలోనైనా చొక్కా పట్టుకు ఒకటి రెండు దెబ్బలు వేస్తాడేమో అనిపించేలా ఉన్నాడు. భాస్కర్రావు కోపంతో నీలకంఠరావు మీద ఒక దెబ్బ వేశాడు కాని ఇప్పుడు అతను తెలివిలోకి వచ్చాడు. అతనిలో నిబ్బరం తెగిపోలేదు మనిషిని తుంచి వేయాలనే నిష్ఠుడు కాలేదు. ఇల్లు వదలిపెట్టి వెళ్ళాలనే కోపభావం అతనికి కలుగలేదు. ఈ పిల్లలను వదలి పెట్టి వెళ్ళబోవటం లేదు. ఈ పిల్లల మధ్య నుంచి వెళ్ళిపోలేడు. తనకు వాళ్ళ మీదఉన్న ప్రేమ తెంచి వేసుకోబోవటం లేదు. భార్య వెళ్ళిపోవటానికి తయారైంది అతని మనసులో మటుకు ఇంకా వెళ్ళాలనే భావమే ప్రవేశించలేదు. తమ్ముడి పిల్లలమీద, తమ్ముడి మీద ఉన్న ప్రేమను తెంచి వేసుకుని

రాము : (సర్వర్‌తో) ఆరు ఇడ్లీలు సాంబారు రెండు ప్లేట్లు...
సోము : రెండేసి చాలవ్?
రా : రెండిడ్లీలే అయితే అవి సాంబారులో మునిగి, ఎక్కడున్నాయో వెతుక్కోవా అని!

రంగారావ్

బైటకు వెళ్ళటం అతని శక్తికి మించిన పనే అయింది కాని అతని భార్య ప్రయాణానికి తయారై. వాకిలి దగ్గరికి వెళ్ళి నిల్చున్నది పిల్లలు వెళ్ళొద్దని గోల చేస్తున్నా నీలకంఠరావు ఒక్క మాటైనా అనలేదు అతని భార్యైనా ఒక్కమాట అనలేదు ఇలా కలిసి ఉండటం మొదటి నుంచీ ఆమెకు ఇష్టం లేనే లేదు కాని నీలకంఠరావ్? అతనెందుకు మాట్లాడడు అతనికూడా తామక్కర్లేదా? ఆ ఇంట్లో నుంచి తాము వెళ్ళటం అతనికి ఇష్టమేనా? తాము వెళ్ళటమే అతనికి శుభంగా తోస్తున్నదా? — — ప్రతి ఆలోచనతో బాటు భాస్కర్రావు మనసుకు కొత్త బాధ కలుగుతున్నది తాము వెళ్ళటానికి చేస్తున్న ప్రయాణాల వంక కళ్ళు తెరుచుకు చూస్తూ ఉన్న నీలకంఠరావును చూస్తే భాస్కర్రావుకు ఆశ్చర్యం కలిగింది. అయినా అతనికి ఇది నిజమనిపించలేదు. తాము వెళ్ళిపోవాలని నీలకంఠరావు అనుకోవటం అసంభవం వాడు పోట్లాడుతాడు కోపగించుకుంటాడు సహనం లేక పోవటం వల్ల పూరికే నోరు పారేసుకుంటాడు. కాని తాము ఇంటో నుంచి పోవాలని గానీ, వేరు పడాలని గానీ అతని కెప్పుడూ అనిపించదు. తుది నిశ్చయం చేసుకో కూడదని భాస్కర్రావు మనసులో తీవ్ర కాంక్ష ఉన్నది. ఆ కాంక్ష గనుక అతను కొద్దిగా అయినా గుర్తిస్తే భాస్కర్రావు ఏదో ఒక వంకతో ఉండిపోయే వాడు. వెళ్ళిపోవాలనే యోచన రద్దు చేసేవాడు. కాని పిల్లలు ఏడుస్తున్నారు భార్య ప్రయాణానికి తయారుగా ఉంది. అవంతా నీలకంఠరావు బిగిసి చూస్తూనే ఉండిపోయాడు చివరకు భాస్కర్రావు కూర్చున్న చోటు నుంచి లేచాడు. నీలకంఠరావు ముందుకొచ్చి గద్గదికమైన స్వరంతో— "అయితే మమ్మల్ని వెళ్ళమంటావా నీలకంఠ్?" అన్నాడు

"శుభ్రంగా వెళ్ళండి—" ఏ మాత్రమూ చోటివ్వకుండా వేలు వాకిలివైపుకు చూపిస్తూ అన్నాడు నీలకంఠరావు "తలుపు తీసే ఉంది. బయలుదేరండి— ఏ కోసం ఎవరూ అడ్డు నిలవలేదిక్కడ"

"సరే—" భాస్కర్రావు గొణిగి— పిల్లల ఏడుపులు లక్ష్యం చేయకుండా, రాయిలాగా ఇంటి బైటికి వచ్చాడు

ఇదంతా ఎలా జరిగిందా అన్న ఆశ్చర్యం అతనికి కలుగుతూనే ఉన్నది అసలెలా జరిగింది? సాగరం లాటి, తల్లి ప్రేమలాటి ప్రేమ ఎక్కడికి పోయింది? మనుషులు ఇంతలో ఎలా మారిపోతారు? నాకు దగ్గరి వాడైన తమ్ముడెక్కడికెళ్ళాడు? స్నేహితుల స్నేహం లాటి మా స్నేహం ఏమై పోయింది? 'పో' అని వాకిటి వైపుకు వేలు చూపించే నీలా నా తమ్ముడవుతాడా? అతన్నెవరైనా వశీకరణం చేసుకున్నారా? ఏమైతే అదే అవుతుంది. ఇదంతా చేసి చేసి విసుగొచ్చింది

భాస్కర్రావు కిదంతా అర్థం కాలేదు వేరే చోట ఇల్లు తీసుకుని అక్కడ కాపరం పెట్టాడు. అతని కష్టం ఏమీ లేని మాట నిజమే కాని భాస్కర్రావు మనసు మాత్రం కృంగిపోయింది అతనిలో హుషారంతా పోయింది. అతని తమ్ముడే అతనికంటే గొప్ప శక్తి నిచ్చేవాడు, నీలకంఠరావు తనకే గొప్ప ఆధారంగా ఉండేవాడు తనకు సన్నిహితుడైన విశ్వాస మిత్రుడైన వాడు ఆ స్థానం ఇప్పుడు కదిలిపోయింది భాస్కర్రావు కూడా కదిలిపోయాడు

అతని వెన్నెముకకు కూడా పెద్ద దెబ్బ తగిలినట్లయింది ఎప్పుడూ పది సంవత్సరాలు చిన్నవాడుగా కనిపించే భాస్కర్రావు— పదు సంవత్సరాలు ఎక్కువ వయసు వాడిగా కనుపించసాగాడు. అప్పుడప్పుడు ఎంత బాధగా ఉండేదంటే— ఇక తను వెళ్ళిపోతాడు— అతి త్వరలోనే వెళ్ళిపోతాడు అనిపించేది

కాని నీలకంఠరావే— ఆశ్చర్యంగా, వెళ్ళిపోయాడు వెళ్ళి ఒక గంట గడిచి పోయింది. ఈ మహాయాత్ర గమ్యస్థానం చేరుకున్నది. అతన్ని తీసుకుని తిరిగి పోవటమన్నది అసంభవమైన చోటుకు వచ్చింది చితిమీద నీలకంఠరావు శాంతగా పడుకుని ఉన్నాడు. ఇవాళ అతను భాస్కర్రావుతో పోట్లాడటంలేదు. 'నీ'— 'నా' భేదం చూపించటంలేదు. "నీది"— "నాది" అని అనటంలేదు. అతను వెళ్ళిపోయాడు అస్తిత్వం వదిలి వెళ్ళిపోతున్నాడు భాస్కర్రావును అతనేమీ అడగటం లేదు ఇక ముందు అతనెప్పుడూ ఏదీ అడగబోవటం లేదు. భాస్కర్రావుతో ఇంక ముందు అతను మాట్లాడ బోవటం లేదు. నీలకంఠరావు వెళ్ళి పోతున్నాడు. ఇక కొద్ది నిముషాలు మాత్రమే వ్యవధున్నది. కొద్ది నిముషాల తరువాత

ఆ చితిమీద ఉన్న నీలకంఠరావు శరీరం సైతం భాస్కరరావుకు కనిపించనే కనుపించదు. బ్రాహ్మడు మంత్రాలు చదువుతున్నాడు. నీలకంఠరావు కొడుకు కుండ భుజం మీద పెట్టుకుని అతని ముందు ప్రదక్షిణ చేస్తున్నాడు. అటూ ఇటూ మనుషులు నిశ్శబ్దంగా నిల్చుని ఉన్నారు. విశ్వమంతా స్తబ్దమైనట్లున్నది. అగ్ని దేవుడు ఆగిపోలేదు. కాలం గడవటమూ లేదు. మనుష్యులు జీవించటమూలేదు — మరణించటమూలేదు. మృత్యువు తరువాత సాక్షాత్కరించే కాలుడిని గూర్చి— బ్రతుకున్న వాళ్ళకి కూడా అనుభూతి కలుగుతుంది భాస్కరరావు మనసు వూరికే ఆకాశంలో వర్తులాలు కొడుతున్నది కొన్ని క్షణాలలో భస్మీ భూతుడు కాబోతున్న నీలకంఠరావు వంక చూచి భాస్కరరావు గొంతు నిండుకు వచ్చింది. అతనికి పశ్చాత్తాపం కలగటం మొదలైంది. ఈ పిచ్చివాడు తనని ఇంట్లో నుంచి వెళ్ళిపొమ్మన్నా గాని తాను వెళ్ళాల్సింది కాదు. తాను అతన్ని విడిచి పెట్టాల్సింది కాదు. వాడి విసగటకు కారణం కనుక్కోవలసింది. వాడు విసిగి పోయాడు. అది తను మనసులో కెక్కించుకో కుండా ఉండాల్సింది. తాము అతనికి దూరం కాకుండా ఉండాల్సింది. వాడికి పదివేలిస్తే మటుకేమయేది ? వాడి కోరిందంతే గదా ? వాడికి డబ్బు కావాలి. మరి ఎందుకు ఇవ్వలేదు తను. ఖర్చు ఎందుకు భరించలేదు. తనని తను అమ్ముకునైనా తేకూడదూ? ఏదైనా కుదవ బెట్టైనా తెచ్చివ్వాల్సింది. బంగారంలాటి తమ్ముడు ఇప్పుడు వెళ్ళిపోతున్నాడురా మూర్ఖుడా— వీపుకు వీపు కాను కొచ్చినవాడు ప్రాణానికి ప్రాణం ఇచ్చేవాడు— పొట్టలో పెట్టుకుని గౌరవం కాపాడేవాడు— నీ తమ్ముడు వెళ్ళిపోయాడు. అలాటి సోదరుడు మళ్ళీ దొరుకుతాడా? ఇక ఎవరడుగుతారు నిన్ను డబ్బివ్వమని ? ఎవరు కోప్పడతారు ? ఎవరు విసుక్కుంటారు ? ఇక ఏమిస్తావ్ ? అసలు డబ్బెందుకు ఇవ్వలేదు వాడికి నువ్వు పెద్దవాడివి కదా ? పెద్ద వాడిలాగా ఎందుకు ప్రవర్తించలేదు ? భాస్కరరావు చెవిలో డబ్బు— డబ్బు అనే శబ్ద మవుతున్నది. నీలకంఠరావు కొడుకు చితిచుట్టూ తిరగటమైపోయింది. అతను చేతిలో అగ్ని తీసుకున్నాడు. కొరడా దెబ్బ తగిలినట్లు భాస్కరరావు ఒక్కసారి స్మారకంలోకి వచ్చాడు. వచ్చి నీలకంఠరావు కొడుకు చెయ్యి గట్టిగా పట్టుకుని "కాస్త ఆగరా— కాస్త ఆగు" అని చిన్న పిల్లాడితో ఏడవటం మొదలు పెట్టాడు. "ఒకసారి వాడిని చూడనియ్యి. మళ్ళీ ఆ ముఖం నా కెప్పుడూ కనిపించదురా బాబూ"— అని భాస్కరరావు నీలకంఠరావు ముఖాన్ని కప్పుతున్న పిడకలు పక్కకు తోసాడు. నాలుగైదు క్షణాలు అతని వంక ఏక దృష్టితో చూచాడు. అప్పుడు అతని కేమనిపించిందో ఎవరికి తెలుసు ? ప్రక్కన నిల్చున్న బ్రాహ్మడితో "కాస్త ఆగండి— ఇంకొక్క క్షణం ఆగండి"— అన్నాడు అని రొండిలో ఉన్న రూపాయిలు వణుకుతున్న చేత్తో తీసి నీలకంఠరావు చేతులో పెట్టాడు. ఇంట్లో పిల్లల చేతుల్లో పెట్టినట్లు భాస్కరరావు నీలకంఠరావు చేతిలో ఆ డబ్బు పెట్టాడు గుప్పిట మూసాడు. జీవ రహితమైన కళ్ళతో చూస్తూ "నీలకంఠ్ ఇంత మటుకూ నేను నీకేదీ ఇవ్వలేదు. నువ్వే నాకు ఇస్తూ వచ్చావు. ఇవాళ నీకు ఇస్తున్నాడు. ఇది నీకు ఇస్తున్నాను. తీసుకో నీలకంఠ్—" అన్నాడు.

భాస్కరరావు తల తిప్పేసుకున్నాడు. భగభగమంటున్న చితి వెలుగులో భాస్కరరావు ముఖం వెలుగుతూ కనిపించింది. ★

## చదువమ్రావు

బి. వి. సత్యమూర్తి

"ఏమండీ! మీ అమ్మగారినీ, నాన్నగారినీ బంధువర్గాన్ని చూడాలని ఇంత కాలమైనా అనిపించటం లేదూ, ఇంక చూడవచ్చునేమో? నేను వెళుతున్నాగా, నేను వెళ్ళిపోగానే వారంతా వస్తారు. కొడుకు పెళ్ళికి రాకపోయినా కోడలి చావుకయినా రాకుండా ఉంటారా? ఏమో చూస్తారుగా మీరే'' అన్నది నవ్వు ముఖంతో.

ఈ సమయంలోనే ఎవరో తలుపు తీసుకు వచ్చారు. చూస్తే తాసిల్దారుగారి జవాను. వాడూ

# ఎండమావులు

23వ పేజీ తరువాయి

ఏడుస్తూ బావురుమని "అమ్మగారూ, జ్యోతమ్మగారుపోయారు. అయ్యగారూ, పెద్దమ్మగారూ మిమ్మల్ని రమ్మన్నారు. శవాన్ని చూట్టానికయినా మా వదినెను మనింటికి రానీయండి, ఆ మాత్రం అవకాశమైనా మా స్వాతి వదినెకు ఇప్పించండి, అని చచ్చిపోయే ముందు చెప్పింది జ్యోతమ్మగారు. ఆలస్యం చెయ్యక మీరు వచ్చెయ్యండి తల్లీ'' అంటూనే వాడక్కడ నిల్చోకుండానే వెళ్ళిపోయాడు.

కృష్ణమూర్తి, జానకిరాం కంట తడిపెట్టారు, స్వాతికి కన్నీరు రాలేదు. ఆమె ముఖంలో విషాద రేఖలతోకూడిన ఆవేదనాపూరితమైన తెలియని సంతోషం ద్యోతకమైంది.

"చూశారా! జ్యోతి ఎంత అభిమానం గల ఆడపిల్లో. ఆత్మాభిమానం కలవారు అందరికన్నా ముందు వెళ్ళిపోతారు. నేను ఆత్మను చంపుకున్న దాన్ని కనుక వెనుకనే వెళతాను. వస్తున్నానమ్మా జ్యోతీ, వస్తున్నా, ఆ మరిచిపోయాను ఒక్క పని మిగిలి పోయింది'' అని జానకిరాం వైపు చూసి దగ్గరకు రమ్మని పిలిచింది. జానకిరాం కూడా మంచం మీద కూర్చున్నాడు.

"చూడు జానకిరాం ఈ చివరి కోరిక తీర్చే భారం నీది. ఈ రోజునుంచీ నా జీవిత భాగస్వామిని మీ అన్నగారిని నీకు అప్పగిస్తున్నాను. వారిని మీ ఇంట్లో ప్రవేశ పెట్టు అదే నా అంతిమ కోరిక. శలవు'' అంటూ కన్నీటి ధారలతో అన్నదమ్ములకు నమస్కరించింది. అంతే. అన్న దమ్ములిద్దరూ బావురుమన్నారు.

ఒక దేవత సమస్త దుఃఖలూ, అవమానాలూ సహించి స్మిత ముఖియై ప్రజ్వరిల్లే ఆత్మ ప్రకాశంతో ఆ లోకాలకు వెళ్ళి పోయింది.

శవం మీదపడి కృష్ణమూర్తి ఎంత సేపు ఏడ్చాడో తెలియదు. అపూర్వ హస్తాలని మించి రెండు చేతులు అతని భుజాల మీద పడినయ్యి. తలెత్తి చూశాడు.

పదేళ్ళుగా ఏ తప్పిదం చేత కన్న తల్లి దండ్రుల్ని దూరం చేసుకున్నాడో, ఆ తప్పిదానికి హేతువైన వ్యక్తి అంతరించగానే, ఆ కన్న తల్లి దండ్రుల్ని చూశాడు. వారి ప్రక్కనే శిలక్ష్మి స్త్రీ శవాన్ని వదిలి కన్న తల్లిదండ్రుల పాదాల్ని చుట్టేసి కన్నీటితో పాదాభిషేకం చేశాడు కృష్ణమూర్తి.

జ్యోతి శవాన్ని కూడా ఆ దారినే తీసుకు వచ్చారు. రెండు భౌతిక దేహాలనూ పూలదండలతో, పసుపు కుంకాలతో అలంకరించారు. పూరేగింపుగా స్మశాన వాటికకు తీసుకు వెళ్ళారు. ముందు జ్యోతి తండ్రి, స్వాతి మామగారు గోపాలశాస్త్రి నడిచారు. జ్యోతి శవ వాహకుల్లో ఒకడుగా ఉన్నాడు మురహరి. స్వాతి శవవాహకుల్లో ఒకడుగా ఉన్నాడు జానకిరాం తమ్ముని ప్రక్కగా అవనత వదనుడై నడుస్తున్నాడు కృష్ణమూర్తి.

జ్యోతి శవాన్ని, తండ్రి ఖననం చేశాడు. మూడు గుప్పిళ్ళు మట్టి తనూ వేశాడు మురహరి. దాని ప్రక్కనే స్వాతి శవానికి చితి పేర్చారు.

స్వాతి శవానికి, కాదు, పెద్దకోడలి శవానికి నిప్పు అంటించాడు గోపాల శాస్త్రి.

అగ్ని దేవుడు స్వాతి భౌతిక దేహాన్ని స్వాహా చేశాడు.

భూమాత తనలో కలుపుకున్నది జ్యోతి భౌతిక కాయాన్ని.

అంతా సమాప్తమయ్యాక ఇళ్ళకు వెళ్ళారు. అందరికీ స్వాగతమివ్వటానికా అన్నట్లుగా, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి వచ్చిన గౌతమి ఒక్కర్తే ఆ ఇంట్లో ఉన్నది. . . . .

—ఐపోయింది


బ్లూ పాషన్ ఫ్లవర్
మరపురాని సంధ్యా సమయానికి
Blue Passion Flower
PEARLINE PARIS
PEARLINE
Meena
PEARLINE PARIS
మీనా సుగంధము
పువ్వులజల్లు
PEARLINE 3
పియర్‌లైన్ 3
అత్యంత మనోరంజన సుగంధము
PEARLINE - PARIS PVT LTD.
P. O. Box 497, BOMBAY 1.
PFC-1

పండ్లను మెరయునట్లు చేయుటకు
నోటిని శుభ్రపరచుటకు
వైటోడెంటునే వాడండి




శ్రీవత్స కెమికల్స్ అండ్ డ్రగ్స్
ప్రైవేట్ లిమిటెడ్, మదరాసు-30.



గణేష్ డిలైట్ పంకాలు

మిక్కిలి అధికంగా కోరబడుచు, ఇండియాలో 3800 పై గల డీలర్లచే అమ్మబడుచున్నవి

ది గణేష్ ఫ్లోర్ మిల్స్ కంపెనీ లి.
64-65, నజఫ్‌ఘర్ రోడ్, న్యూఢిల్లీ-15

డీలర్‌షిప్‌లకు వ్రాయండి : ది గణేష్ ఫ్లోర్ మిల్స్ కంపెనీ లి॥, 2, తంబుచెట్టి వీధి, మద్రాసు-1 (ఫోన్ 21680) * తెలంగాణాకు ఏజెంట్లు. మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ ప్రై. లి॥, 6-సి, రాష్ట్రపతి రోడ్, సికిందరాబాద్. * కృష్ణాజిల్లాకు ఏజెంట్లు సన్‌రైజ్ ఎలెక్ట్రికల్స్, కాన్వెంట్ వీధి, విజయవాడ * కేరళకు సోల్‌ఏజంట్లు: పి కేశవన్ & కో., టి.డి. రోడ్, ఎర్నాకుళం (ఫోన్ 425) * మైసూరు స్టేటుకు సోల్ ఏజెంట్లు. ది అశోకా ఎలెక్ట్రికల్ & ఇంజనీరింగ్ కంపెనీ, 6, బ్రిగేడ్ రోడ్, బెంగుళూరు-1 (ఫోన్ 4200)

JWT-GF 3055

కేశవర్ధిని

వాడి నల్లని, నిడుపు వెంట్రుకలను పెంచుకోండి






కేశవర్ధిని ప్రాడక్ట్స్,
జైల్ రోడ్, కోయంబత్తూరు-1.

తూర్పు గోదావరి, శ్రీకాకుళం, విశాఖ జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్లు :
మెస్సర్స్ ఓమ్ ఏజన్సీస్, 45, మహాత్మా గాంధి రోడ్, సికిందరాబాద్.

మీకు తెలుసా?



హైదరాబాద్‌లో చూడ వలసిన కట్టడములలో
ముఖ్యమైనది హైకోర్టు ఒకటి!



హైదరాబాద్‌లో తయారయే సిగిరెట్లలో
ప్రసిద్ధి చెందినది హైకోర్టు ఒకటి!
ఇవి మేలురకమైన గుంటూరు పొగాకుతో
తయారు చేయబడినవి.
ప్యాకెట్టు వెల. 20.న.పై. మాత్రమే

# అసుర సంధ్య

16 వ పేజీ తరువాయి

"మునసబుగారి గురించి నాకు చాలా వివరాలు కావాలి."

"ఏమిటో."

"మావయ్యకీ ఆయనకీ కొన్నాళ్ల క్రితం మాటల్లేవని చెప్పేరు."

"అవును. చెప్పాను."

"ఆ మనస్పర్థలు దేనిమూలకంగా వొచ్చాయో చెబుతే సంతోషిస్తాను."

"దేనికైనా ప్రయోజన ముండాలి కదా నాయనా ?"

రాజారావు తాత దగ్గరిగా జరిగేడు.

"ఈ వూళ్లో అడుగుపెట్టిన మరు క్షణం ఇదే ఆలయంలో దేవుడులా మీరు కలిశారు నేను వయస్సులో చిన్నవాడినే కావచ్చు. నా ఆలోచనలు మీకు నవ్వు కలిగించనూ వొచ్చు. వొప్పుకుంటాను. మునసబుగారికీ, మావయ్యకీ మధ్య ఎలాంటి సంబంధ మున్నదో తెలుసుకోడం మరొకప్పుడైతే నాలాటి వాడికి నిష్ప్రయోజనమూ, అనవసరమే కావచ్చు. కానీ, ఇక్కడ పరిస్థితి వేరు మావయ్య హత్య చేయబడ్డారు."

తాత ముసిముసిగా నవ్వడం ప్రారంభించేడు

"అంత వూహించలేని చవటను కాదు నాయనా? మువ్వనట్టు నీ ఆలోచన నీ పసితనాన్నే ఎత్తి చూపిస్తుంది అంత చిన్న కారణాన్ని ఆధారంగా తీసుకుని మునసబు అనుమానితులంటే నే నొప్పుకోను."

"అసలు విషయం చెప్పడానికి మీ కభ్యంతరం లేదుగా."

లేదన్నట్టు తలూపాడు తాత.

"అయితే చెప్పండి "

"కన్న కొడుకు తండ్రి కెప్పుడూ ప్రయోజకుడి లానే కనిపిస్తాడు. కాదని ఎదటివాడు చెబుతే అతని అభిమానం దెబ్బతింటుంది సరిగ్గా ఇక్కడ అదే జరిగింది. మీ మావయ్య కూతుర్ని తన కోడలిగా చేసుకుంటా నన్నాడు మునసబు. కానీ—పిల్ల నివ్వక పోగా ఆయన మొహం ముందే మీ మావయ్య వరుడ్ని అపహేళన చేశాడు. స్పర్ధ రావడాని కిది చాలదూ. అవుతే అంతమాత్రంచేతనే నువ్వూహిస్తున్నది నిజమేనని వొప్పుకోగలవా నువ్వు. నీకు వాళ్ల స్పర్థ ఒక్కటే తెలుసు. కానీ, వాళ్ళ స్నేహం గురించి ఇప్పుడు నే నెంత చెప్పినా అర్థం చేసుకోలేవు."




రాజారావు మరేమీ మాటాడలేదు. వాదించినా ప్రయోజనం లేదని మవునం వహించాడు.

"ఆవిధంగా నీ వూహాగానం ప్రారంభమైతే చాలామందిని నువ్వు అనుమానించవలసి వొస్తుంది " మళ్లా తాతే అన్నాడు.

"అవుతే మీరు మరికొంతమంది గురించి చెప్పాల్సి ఉంటుంది."

తాత నవ్వేడు.

"భలేవాడివి. భయంకరమైన వర్షపురాత్రి అందరికీ ఆశ్రయమిచ్చే పవిత్రమైన దేవాలయంలో పరిచయమై నానెత్తిమీద ఇంత బాధ్యత పెట్టడం తగునా నీకు ?"

"నిజం తాతా. ఈ వూళ్లో మీరే మంచి స్నేహితులు నాకు. మనిద్దర్నీ ఈ దేవుడే స్నేహితుల్ని చేశాడు "

"ఆమాత్రం అభిమానం చాలు "

"అయితే నెయ్యి కలపండి నాతో సహకరించండి" అని తాత చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు తాత ఇంకా నవ్వుతూనే ఉన్నాడు, రాజారావు లేచి నిలబడ్డాడు.

"వూరంతా ఒకమాటు చూడాలని ఉంది. మరోమాటు మిమ్మల్ని తప్పకుండా కలుసుకుంటాను." తాత దగ్గర సెలవు తీసుకుని, చెప్పులు తొడుక్కుని మంటపం దిగేడు. తాత వెనుక నుంచి నవ్వుతూనే అడిగేడు.

"స్నేహితులమన్నావ్ బాగానే ఉంది. నిపేరు నా కింతవరకూ తెలీదు. నా పేరు రామదాసు."

రాజారావు సిగ్గుపడ్డాడు. తర్వాత చెప్పేడు.

"అమ్మ పెట్టిన పేరు రాజారావు. వాడుకలో రాజా. మీరెలా పిల్చినా అభ్యంతరముండదు."

"ముఖస్తుతి కాదు గానీ, నువ్వు మాటకారివి రాజా ! వెళ్లిరా !" అన్నాడు తాత.

* * *

ఆ రాత్రి భోజనాలైన తర్వాత అత్తయ్య దగ్గర కొచ్చి కూర్చున్నాడు రాజారావు. ఆవిడను మునసబు గురించి అడిగాడు. ఆవిడ అతని వైపు చిత్రంగా చూసింది.

"ఎంత స్నేహితులైనా ఉద్రేకంలో తమని తామే మరచిపోవడం సహజం. వస్తుథా పిరికి మనిషైనా ఆ క్షణంలో అతి సాహసవంతుడౌతాడు. పరిసరాలు గుర్తుండవు. తను చేస్తున్నది 'మహా దారుణమైన కార్య' మనీ అనిపించదు."

"మునసబుగారు నాకు బాగా తెలుసు నాయనా !",

"ఉష్ గట్టిగా అనకు అత్తయ్యా ! నా అనుమాన మేదో చెప్పానే గాని యిదే వాస్తవమని వాదించడం లేదు అయినా ఇలాంటి వూళ్లో ఇంకా ఉండటానికి భయంగా ఉంది నాకు. నే నెటూ వెళ్లిపోవలసినవాడినే. నా భయం మీ గురించే. కేవలం మీ గురించే నత్తయ్యా"

సుందరమ్మలో కొంచెం తొట్రుపాటు కనుపించింది.

"మునసబే కాదు. వాళ్లబ్బాయి గురించి గూడా తెలుసుకోవాలి."

"అతను పట్నంలో చదువుకుంటున్నాడు " అన్నది తలుపు దగ్గర నిలబడి అత్తా, అల్లుళ్ల మాటలన్నీ ఆలకించిన వరలక్ష్మి రాజారావు ఆమెను చూసేడు.

"అవుతే, ఇప్పటివరకూ నువ్వు యిక్కడే ఉన్నావన్నమాట" అన్నాడు రాజారావు

కాసేపటి వరకూ ఎవరూ మాట్లాడలేదు రాజారావు తన గదిలోకి వెళ్ళిపోతూ అన్నాడు.

"మన జాగ్రత్తల్లో మనం ఉండటం ఎంతైనా మంచిది"

—అతను మంచంమీద నడుం వాల్చేడే గాని నిద్ర పట్టడంలేదు పక్కమీద దొర్లుతూ ఉదయం తను కలుసుకున్న వ్యక్తుల గురించీ, ఆ వూరి వాతావరణం గురించీ ఆలోచించడం మొదలెట్టాడు అతని బుర్ర వేడెక్కింది పక్కమీద నుంచి లేచి తలుపుకి గడియవేసి సిగరెట్టు ముట్టించేడు తాత సిగరెట్టుమీద చేసిన వ్యాఖ్యానం హఠాత్తుగా గుర్తుకొచ్చింది నవ్వుకున్నాడు నిజమే. అతిగా సిగరెట్లు కాల్చమనేది జాడ్యమే. మానడం మాత్రం తన చాత నయ్యేది కాదు తనెదురుగా ఉన్న పాతకాలపు ఫోటో కనిపించడంతో, గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

కొంతసేపటికి అతనికి తెలీకుండానే నిద్ర పట్టేసింది.

జానికమ్మ తలొంచుకుని నిలబడ్డది రాఘవయ్య రౌద్రరూపం దాల్చేరు. ఆయన కళ్ళు ఎర్రబారినై.

"నువ్వు ముండమోసిన దానివని మరచి పోయావు"

జానకమ్మ ధైర్యంగా తలెత్తి చెప్పింది

"నా చిన్నతనంలోనే పెళ్ళి చేయడం మీ తప్పు."

ఆ భ్రష్టురాలు విన్నద్దరిస్తా డనుకుంటున్నావేమో! ఒకనాడు నిన్ను నడిగంగలో ముంచేయగలడు. వాడి ఆదర్శాలు నమ్మి వంశ గౌరవాన్ని మంటగలపకు వాడు సంఘసేవకుడు కాదు మాయల మారి. నీ పాలిటా, నా పాలిటా యముడు చిట్టి! యముడు."

ఆ మాటతో జానికమ్మకి రోషం పెల్లుబికి వొచ్చింది.

"ఆయన దేవుడు. నాకు మరో లోకాన్ని ప్రసాదించిన మహానుభావుడు"

"అవుతే వెళ్ళు. మళ్ళా నా గుమ్మం తొక్కకు. ఆ మహానుభావుడూ, నీ దేవుడితో వూరేగు. ఫో... వెళ్ళవేం. వెళ్ళు" రాఘవయ్య హుంకరించి జానికమ్మ మెడపెట్టి గెంటేడు. ఆవెనుక తలుపూ మూసేడు

"అమ్మా." ఏడుపొచ్చింది రాజాకి

—తలుపు దబదబా శబ్దమయ్యింది. అతను నిద్రలేచాడు కళ్ళు విప్పాడు. ఇది కలా? పాపిష్టి కల! కల్లోనైనా తండ్రిని ఎదిరించలేని దరిద్రుడు తను

మళ్ళా తలుపు శబ్దమైంది.

లేచి తలుపు తీశాడు గుమ్మంలో సుభద్రమ్మా, వరలక్ష్మి నుంచున్నారు

"ఏం బాబూ! సంవరించేవా?" అడిగింది సుభద్రమ్మ

"అమ్మ కలలోకి వొచ్చింది" అన్నాడు రాజారావు.

సుభద్రమ్మకి అతనిపైన జాలి కలిగింది. ఇంత అర్భకుడేం?

"నీది పిరికిగుండె నాయనా! తలుపేసుకో!"

తల్లీ కూతుళ్ళిద్దరూ వెళ్ళిపోయారు అతను దిగాలుగా వొచ్చి మంచంమీద కూర్చున్నాడు. వాచీ చూసుకున్నాడు. మూడు గంటలైంది.


అందమైన సువాసనగల జుట్టు
కొరకు
టాటావారి హేర్ ఆయిల్స్
కోకోనట్ లేక కేస్టర్

కే. టి. కృష్ణమూర్తి ఆచారిగారి
"మేల్ మాయిల్ మందు"
నల్లరంగు, ఎర్రరంగు పొడలు, దద్దులు, గజ్జి, మరియు చెడ్డనీరు వ్యాపించి నందుంచే ఏర్పడు
వినుగు పుట్టించు రణములు మొదలగు
దీర్ఘకాల చర్మరోగములకు ఉత్తమ నివారిణి
వివరములకు
సిద్ధ డాక్టర్ కే. టి. కృష్ణమూర్తి ఆచారి & సన్సు
5/22, మేల్‌మాయిల్, (P. O.) N. A. Dt.

పుష్పము మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ,మీ సరియైన చర్యను గురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టుకార్డుపైన మీకు ఇష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళవివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసిపంపండి. జ్యోతిషశాస్త్రములోని రహస్య గణితము మూలముగామేము గుణించి, మీరు కార్డు వ్రాసినతేదీ లగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవిత మార్గము,ఏ వ్యవహారములో మీకు జయము కలుగునో, ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు,మార్పులు,ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మా ద్ద్రవ్యలాభము మొదలగువానిని గురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు.1.25న. పై. లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. ఛార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహములేవైనా ఉన్నయెడల శాంతిచేయు విధానం కూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా లేనిఎడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించండి. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

PT. DEV DUTT SHASTRI, RAJ JYOTHISHI (A.W.P)
P. B. 86, JULLUNDUR CITY.

మిగతా కాలమంతా నిద్ర లేకుండానే గడిపేడు

—ఆ సాయంత్రం మాటల సందర్భంలో రాజారావుతో అన్నది వరలక్ష్మి

"ఎందుకనో బావా ? నిన్ను చూస్తుంటే ఏడుపొస్తుంది నాకు."

"అనామకులూ, చాతకానివాళ్ళూ ఎదటివాళ్ల దగ్గర సానుభూతి సంపాయించుకోడమే వొక గొప్ప అదృష్టమైతే, గర్వించాలి నేను. కానీ ! వరం—నా క్కావలసింది వొక్క సానుభూతే కాదు. మనశ్శాంతి ! అమ్మ లేదు. నాన్న లేడు. మొన్నటి వరకూ నామమాత్రమైనా ఉన్నాడనుకున్న మావయ్యా లేరు. ఎవరూ లేరు.. నా కెవరూ లేరు." అన్నాడు మొహాన్ని చేతుల్లో దాచుకుంటో.

"అమ్మ ఉంది. నే నున్నాను." అన్నది వరలక్ష్మి.

అతను ఆ పిల్లవైపు నిశితంగా చూసేడు. పెదాల మీదుగా నవ్వేస్తూ—

"తలుచుకుంటూంటే నాకే ఆశ్చర్యంగా ఉంది వరం ! క్షమాభిక్ష ఆశించినట్టు మావయ్య ద్వారా నాకు లభించకపోయినా, ఆ తండ్రి కూతురివైన నువ్వు—" చివర్న ఆపేశాడు.

"చెప్పు బావ ! నేను .... నేనేమిటి ?"

"నువ్వు నా పాలిట వరానివి."

ఆ పిల్ల కళ్లల్లో ఆనందమూ, సిగ్గు తొణికిసలాడేయి

సుభద్రమ్మ పిలవడంతో తేరుకుని వంట గదిలోకి వెళ్ళింది

రాజారావు వంటరిగా కూర్చుని సిగరెట్టు ముట్టించేడు. అంతలో అతనికో విషయం గుర్తు కొచ్చింది. గబగబా తన గదిలోకి వెళ్ళి టార్చి లైటు తీసుకున్నాడు. మఫ్లర్ మెళ్ళో వేసుకున్నాడు. పెద్ద పెద్ద అంగ లేసుకుంటో ఆలయం వైపు నడిచేడు.

అంత దూరాన్నుంచే రాజారావుని పిల్చగలిగాడు రామదాసు తాత. అతను తాత దగ్గరి కొచ్చి ఏదో చెప్పబోయాడు గాని, మధ్యలోనే తాత కలుగజేసుకున్నాడు.

"మొత్తానికి కుర్రాడి వనిపించావ్ ! నీ పట్టుదలకి మెచ్చుకుంటున్నాను. పద ఆ స్థలం చూపిస్తాను."

రాజారావు ఆశ్చర్యపోతూ అడిగేడు

"ఏ స్థలం ?"

"నువ్వెంత దాచినా నీ మెళ్ళో మప్లర్, నీ చేతిలో టార్చిలైటు నీ ఉద్దేశ్యాన్ని బైట పెడుతూనే ఉన్నాయి. మీ మావయ్యని హత్య చేసిన చోటుకే కదూ నీ ప్రయాణం.

"భలే .... కనిపెట్టేశారే."

"నీ నేస్తాన్ని. పైగా కొద్దో గొప్పో వయస్సున్న వాణ్ణి. నా కది కష్టం కాదనుకుంటాను. ఒప్పుకుంటావా ?"

ఇద్దరూ నవ్వుకున్నారు.

కనుచీకటి పడుతూండగా వూరు నుంచి బయటపడ్డారు. శ్రమ తెలికుండా ఉండేందుకు దార్లో తాత కథలు చెప్పడం ప్రారంభించేడు. రెండు మైళ్ళ పైగా నడిచిన తర్వాత తాత ఒక చోట ఆగి—

"ఆ స్థలం ఇక్కడికి ఆరు ఫర్లాంగులుంటుంది" అన్నాడు.

"పదండి తొరగా".

"కొంచెం ఆగు కుర్రాడివి. ఏకబిగిని ఎంత దూరమైనా నడువగలవ్ నా విషయం ఆలోచించు మరి". అన్నాడు తాత

రాజారావు సిగరెట్టు ముట్టించేడు.

"నిన్న నీకో మాటిచ్చాను -- అనుమానించే ఒంతు నీదైతే, దానిక్కావలసిన కొందరి మనుషుల జాబితా యిస్తానని. అంచేత మరో మనిషిని నీకు పరిచయంచేయాల్సి ఉంటుందిప్పుడు "

"థేంక్స్. చెప్పండి" అన్నాడు రాజారావు

ఇద్దరూ మళ్ళా నడక ప్రారంభించేరు. దార్లో తాత చెప్పుకుపోతున్నాడు.

"ఈ పక్క వూళ్ళో ఆచారిగారని మీ మావయ్య లాంటి వైద్యుడొకాయన ఉన్నారు రాబడి విషయంలోగానీ, పరపతి విషయంలోగానీ మీ మావయ్య ముందు ఆయన నిలబడలేకపోవడమనేది నిజం ఆచారిగారు సేకరించలేని మూలికలు ఈయన సేకరించేవారు. ఆచారిగారివూళ్ళో కొంతమంది మావయ్యగారి దగ్గరే వైద్యానికొచ్చేవారు ఈవిధంగా ఆచారిగారికి మావయ్యగారి మీద ఈసు కలగడంలో ఆశ్చర్యం లేదు. మునసబుగార్ని చిన్న కారణం తీసుకుని ఎలా అనుమానించావో, అదేవిధంగా ఆచారిగార్నికూడా నువ్వు అనుమానించవలసిందేను." అన్నాడు తాత.

"వై నాట్ ? తప్పకుండాను. అనుమానించడమనేనేది నేరంకాదు తాతా."

"ఏమో అదృష్టవశాత్తు మన అనుమానమే 'నిజం' కావచ్చు. చెప్పలేంకదా." అన్నాడు రాజారావు.

ఆ మాట అనేసి తన ఆలోచనలను ఆచారిగారి వైద్యమూ వగైరాలపై సాగించాడు రాజారావు. తాత మాత్రం మవునంగా నడుస్తున్నాడు. కొంత దూరం ఒచ్చాక తామొస్తున్న బాటని గమనించి




చార్మిస్ మీ ముఖవర్చస్సును మనోహరముగా చేస్తుంది!

ఉత్సాహవంతులుకండి...
లాలిత్యం పొందండి...
రోజంతా
శోభచేకూర్చుకోండి!

చల్లని, సేదదేర్చే చార్మిస్ మీకు
రోజంతా శోభచేకూర్చుటలో
తోడ్పడుతుంది. చార్మిస్‌యొక్క
ఆనందప్రదమైన వాసన మిమ్మల్ని
పరవశింపచేయుటలో యింద్రజాలములా
పనిచేస్తుంది—మిమ్మల్ని ఉత్సాహ
వంతులను చేస్తుంది...మిమ్మల్ని
అందముగా మనోహరముగా
కనపడేలా చేయుటలో సహకరిస్తుంది.

చార్మిస్
టాల్కమ్ పౌడర్ ఆనందప్రదమైన వాసన కలిగి వున్నది

CHTP.G.11.TEL

చూసేడు రాజారావు.

మొన్న తను ఒస్సుదిగి యీ వూరొస్తున్నప్పుడు యిదే త్రోవనొచ్చేడు ఆ విషయమే తాతతో చెప్పాడు తాత ఒకచోట రోడ్డుదిగి ప్రక్క త్రోవని నడవడం ప్రారభించాడు అది బీభత్సకరంగా ఉన్న తుమ్మ చెట్ల మధ్యనుంచి పోతాల్సి ఉన్నది మనిషి నడవ డానికి వీలుగా చిన్న కాలిబాట మాత్రం ఉంది అటూ యిటూ తుమ్మతుప్పలూ, కొంచెం దూరంలో సరుగుడు చెట్లూను తాత అన్నాడు.

"ఉత్త రోజుల్లోనే యీ ప్రాంతాల జనసంచారం ఆట్టే ఉండేదికాదు మావయ్యగారు పోయిన దగ్గర్నుంచి యీ పక్కకి రావడానికి పగలే భయ పడుతున్నారు వూరివాళ్ళు".

"మొన్ననే నీవూరొస్తున్నప్పుడు కూడా భయ పడుతూనే వచ్చాను, అప్పటికి రాత్రి తొమ్మిదైనా కాలేదు." అన్నాడు రాజారావు బెరుగ్గా.

మరి కొంతదూరం వెళ్ళి, అక్కడ ఆగిపోయాడు తాత వాళ్ళకి కొంచెందూరంలో మోకాలు బంటి పచ్చగడ్డి, పిచ్చి మొక్కలూ పెరిగి ఉన్నాయి. ఆ కాస్త మేరా భయంకరంగా ఉంది సరుగుడి చెట్ల గుంపు మీదుగా ప్రయాణంచేసే ఈదురుగాలి తాలూకు శబ్దంకూడా, ఆ నిశ్శబ్దంలో భయం పుట్టిస్తుంది.

తాత తనెదురుగా ఉన్న స్థలం వైపు చెయ్యెత్తి చూపుతూ "అక్కడే మావయ్యగారి శవం పడు న్నది ఆయన పక్కనే రక్తసిక్తమైన కొడవలి ఉన్నది." అన్నాడు

రాజారావు సిగరెట్టు పారేశాడు మరోకొత్త సిగరెట్టు వెలిగించాడు అగ్గిపెట్టెపైన రేపర్ చించుతూ ఏదో ఆలోచనలో మునిగిపోయేడు తాత రాజారావుతో వాళ్ళ మావయ్యగారి హత్య తాలూకు వివరాలేవో చెప్తూనే ఉన్నాడు అయినా చెప్తున్నవన్నీ వింటూ రాజారావు చుట్టుపక్కలన్నీ శ్రద్ధగా గాలించి వెదకడం ప్రారంభించేడు అతని మస్తిష్కంలో ఏవేవో ఆలోచనలు, బుర్ర వేడెక్కి పోతోంది. అయినా అతను పిచ్చికుక్కలా ఆ ప్రదేశ మంతా తిరిగేస్తున్నాడు

తాతకిదేమీ అర్థంకాలేదు రాజారావు మరో సిగరెట్టు ముట్టించేడు. ఖాళీ అగ్గిపెట్టెను పారే శాడు. ఒకచోట నించుండిపోయాడు. చేత్తో మొహాన్ని రుద్దుకున్నాడు అకస్మాత్తుగా అతని కళ్ళల్లో నీళ్ళ తిరిగేయి కళ్ళొత్తుకుంటూ అన్నాడు.

"అంత గొప్పగా బ్రతికిన మనిషి చివర్కి వూరికి దూరంగా, యీ దిక్కుమాలిన చోట నిర్దాక్షిణ్యంగా హత్యచేయబడ్డాడు. విధినేమనాలి తాతా?" అతని గొంతు గాద్గదికమయ్యింది.

"అదే నాయనా లీల! నీకూ నాకూ అంతుపట్టని లీల." అన్నాడుతాత రాజారావు భుజాల్ని తట్టుతూ

—మరో పది నిముషాల్లో ఇద్దరూ యింటి దోవ పట్టారు. వూళ్ళోకి ఒచ్చే వేళకి వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. ఎక్కడా ఏవిధమైన అలికిడీ లేదు. ఆసరికి అందరూ గాఢమైన నిద్రకి లొంగిపోయి ఉంటారు

తాత దగ్గర సెలవు పుచ్చుకుని యింటి వైపు కదిలాడు రాజారావు.

— రామదాసు తాతకి నిద్రపట్టలేదు. పాత ట్రంకులో ఉన్న టార్చి తీసుకున్నాడు, తలకి టవలు చుట్టుకున్నాడు, ఆ రాత్రి చలిలో ఒంటరిగా ఆ హత్యా ప్రదేశంవైపు నడకసాగించాడు.

(సశేషం)


ఋతుక్రమం ఆలస్యమైతే?

విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన "దేవిపిల్సు" వాడండి

పూర్తికోర్సుప్యాకెట్టు 28 మాత్రలువెల రు 11/ సగంకోర్సు ప్యాకెట్టు 14మాత్రలువెల రు. ... ప్రతిచోటదొరకును

"దేవి పిల్సు" ముఖ్యంగా ఆలస్యమైన, క్రమముగాకాక పోయిన, బాధతోకూడిన లేక ఆగిపోయినబహిష్ఠకుదేవిపిల్సు బాగుగ గుణమిచ్చును

1 అన్ని సందర్భములలోను శీఘ్రముగాను, అమోఘము గాను పనిచేయును
2 ఏస్థితిలోను ఆరోగ్యమునకు ఎట్టిహాని కలిగింపదు

MFRS - SEENU & CO., MADRAS-21.

మెసర్స్. డి. జె. ఫరీక్ అండ్ కంపెనీ, సుబాష్ రోడ్, సికిందరాబాద్.



పసి బిడ్డలకు పరమమిత్రము

I.T.L. గ్రైప్ సిరప్

మీ బిడ్డ ఏడిస్తే కంగారు పడకండి. అది వాని చిన్నారి కడుపులో కలిగిన బాధచే కావచ్చు. ఐ.టి.ఎల్. గ్రైప్ సిరప్ ఆ బాధ నిట్టె తొలగిస్తుంది. తెలిసిన తల్లులు ఎప్పుడూ ఒక ఐ.టి.ఎల్. గ్రైప్ సిరప్ సీసాను ఇంటిలో ఉంచుకుంటారు. పిల్లల జీర్ణాశయ బాధలకిది పెట్టింది పేరు.

తయారుచేయువారు.

ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లేబరేటరీ లిమిటెడ్, బెంగళూరు-3






* మద్రాసు సేల్సు డిపో : 35/37, తంబుశెట్టి వీధి, మద్రాసు-1.
* బెంగుళూరు సేల్సు డిపో : 71/4, ఆర్కాట్ శ్రీనివాసాచార్ వీధి.
* ఆంధ్రప్రదేశ్‌కు సెల్లింగు ఏజెంట్లు : మెసర్స్. వెంటిలెక్స్, సికిందరాబాదు.
* హుబ్లి & కర్నాటకకు సెల్లింగ్ ఏజెంట్స్ : మెసర్స్ కర్నాటక్ & దక్కన్ ఏజెన్సీస్, హుబ్లి.

**కేశములు నెరియటం మాన్పండి**

హేర్ డై తో కాదు. మా ఆయుర్వేద సువాసన హేర్ ఆయిల్ వాడిన నెరసిన కేశములు మరల నిగనిగలాడు నలుపు రంగు తిరుగును. మెదడుకు, కండ్లకు టానిక్. ఒకసారి ఉపయోగించిన తృప్తి పొందగలరు ధర రు. 10/- పూర్తి కోర్సు రు. 25/-

NATH AYURVED BHAVAN (51)
P. O LALBIGHA (GAYA)

**తెల్ల మచ్చలకు ఉచిత వైద్యము**

శక్తివంతమైన మా ఆయుర్వేద ఔషధము "శ్విత్ర మోచన్" తెల్ల మచ్చలను కొద్ది రోజులలో తొలగించును. సాంఘిక సంక్షేమం కొరకు 1000 రోగులకు ఒక్కొక్క పాకెట్ ఉచితంగా యివ్వబడును. వెంటనే వ్రాయండి.

BIHAR KUSTA KUTIR,
P. O. LALBIGHA (Gaya)

**పాదాలలో ఆనెలు**

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వ్రేళ్ళ పొతుకుపోయి పాదము నేలపై బెట్టలేక రాళ్ళు తగిలిన త్రుళ్ళిపడు వారు పైపూతగా వాడిన వ్రేళ్ళతోసహా మాయుంచేయ గల సంజీవి. వెల పోస్టు ఖర్చులతో రు. 4-25న.పై.

కొక్కోకము చిత్రపటములు గలది. రు. 1-50
దాంపత్య రహస్యములు ... రు. 3-00
తెలుగు హిందీ స్వయంశిక్ష రు. 4-50

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో

3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు-1.

**ఓజోటోన్** మకరధ్వజ చేరినది

నీరసము, బలహీనత, ధాతునష్టము, ముఖవ్యాధులచేతను, దీర్ఘవ్యాధులచేతను శరీరము కృశించుట, రక్తహీనత, దడ, పాలుమారిక, రక్తపోటు, మతిస్థిమితము లేకుండుట హరించి బలము, రక్తవృద్ధి, ధాతుపుష్టి, జీర్ణశక్తి కలిగించు

శాస్త్రీయ ఆయుర్వేద రసాయనము

8 ఔన్సుల సీసా రు. 6-50 పోస్టేజి రు. 2/-

చరకాశ్రమం ఫార్మసి (ఫోన్: 4240)

తాలుకా ఆఫీసు ఎదుట, విజయవాడ-3.

# కట్నం కోరని కామేశం

11వ పేజీ తరువాయి

మూసేసి "ఏమ్మా! కమలా ఏమిటీ విషయం?" అని అడిగారు.

"ఇంట్లో అందరూ నిద్దర పోతున్నారు. కాఫీకి టైమయిందని మీకు మాత్రం పెట్టి తెచ్చాను. ఇంట్లో మీ అబ్బాయి ఎలాగూ ఉండరు కదా! మీతో ఒక సంగతి చెప్పాలనుకుంటున్నాను ఆ విషయం ప్రస్తుతం మీకూ నాకూ తప్పించి, ఇంట్లో మరెవ్వరికీ తెలియకూడదని నా అభిప్రాయం" అన్నది క్రింద తివాసీమీద కూర్చుంటూ

మాధవయ్యగారికి రహస్య మేమిటో బోధ పడలేదు. ప్రస్తుతం ఇంట్లో ఎవ్వరికీ తెలియ కూడదట! ఏమిటో ఆయనకంతా అయోమయంగా ఉంది. తను కూతురికంటే ఎక్కువగా చూసు కుంటున్న కమల కూడా ఆఖరికి, ఏదైనా సమస్య లేవదీసిందా? ఆశ్చర్యంగా, అనుమానంగా కమల వైపు చూశారాయన

ఆయన అనుమానం పసికట్టిన కమల నవ్వుతూ "మరేమీ కంగారు పడకండి మామయ్యా! నేనేమీ క్రొత్త చిక్కులు తెచ్చిపెట్ట లేదు సుజాత వివాహ విషయంలో మనమొకపని చేస్తే బాగుంటుందేమోనని తోచింది" అన్నది సాభిప్రాయంగా మామగారివైపు చూస్తూ.

ఆయన తేలిగ్గా నిట్టూర్చి "దానిదేమో మొండి పట్టు. మన కా అదృష్టం కలిసిరాక, కట్నంకోరని వరు డెవ్వరూ దొరకడంలేదు దానికి మరీ ఏళ్ళు మించిపోకపోయినా, వివాహానికి సరియైన వయస్సే నా ఆరోగ్యమూ బాగుండడంలేదు. వయస్సై పైన పడుతున్నది దీని వివాహం చూసేయోగము నా కున్నట్టు లేదు అసలు దాని కే గీతఉన్నదో లేదో ననిపిస్తున్నది" అన్నాడు భారంగా

"ఇప్పుడా చిక్కు విడిపోయే మార్గం నాకు తోచింది మామగారూ! మీకు మా పినతల్లి కొడుకు కామేశం తెలుసుకదా! వాడు భిలాయ్‌లో ఇంజనీరుగా ఉంటున్నాడు పిన్నమ్మకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు వీడే ఆఖరువాడు. అల్లుడూ, పెద్ద కొడుకు ఇద్దరూ డాక్టర్లే ఆవిడ పుచ్చుకున్నప్పుడు కట్నం ఎక్కువగానే పుచ్చుకున్నది, ఇచ్చినప్పుడు అంతకంటె ఎక్కువే ఇచ్చింది. ఆవిడ దృష్టిలో కట్నం తీసుకోవడమనేది ఒక లాంచనం అది బాగా తీసుకోకపోయినా, ఇవ్వకపోయినా 'పెళ్ళి' ఘనంగా జరిగినట్టే. పెద్దకొడుకూ, కూతురూ చెప్పినట్లు విన్నారు కాబట్టి, ఆవిడ ముచ్చట బాగానే జరిగింది. కామేశం దగ్గర ఆ ఆటలేమీ సాగడంలేదు వీడూ, మన సుజాత రకమే కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవాలని నియమమట! ఎన్ని సంబంధాలు వచ్చినా తల్లికీ, కొడుక్కీ తగాదాలు తెగక, తిరిగిపోతున్నాయి పైగా చదువుకున్న పిల్ల కావాలట! చదువుకొని, కట్నం తానుకువచ్చే అమ్మాయి తటస్థపడ్డా వీడు ఒప్పుకోవడంలేదు. అదీగాక, పిన్నమ్మకు చదువుకున్న అమ్మాయిలంటే అంత సదభిప్రాయంలేదు ఇప్పటికి చూసిన చదువు కున్న అమ్మాయిలలో ఏ ఒక్కరూ ఆవిడకు నచ్చ లేదు. మన సుజాత అంత చక్కటివాళ్ళు ఉండటం అరుదు. సుజాతను నాలుగైదేళ్ళ క్రిందట మన ఇంట్లో చూసింది. చదువుకున్న పిల్లయినా చాలా వినయంగా ఉందనీ, అందంగా ఉందని మెచ్చు కున్నది పిన్నమ్మ కూడా ముసలితనం వచ్చింది. మీలాగే చిన్న కొడుకు పెళ్ళి చూడనేమోనని బెంగ పట్టుకున్నది. ఈ బెంగతో కట్నం పుచ్చుకోవడం షరతు కొద్దిగా సడలించింది బొత్తిగా పుచ్చుకోక పోవడం, ఆవిడ కేదో పరువు తక్కువగా ఉంది. అందుకని నామక ఏ రెండు వేలో తీసుకోవాలను కుంటున్నది కామేశం కూడా తల్లికోసరం తన పట్టు కాస్త వదిలిపెట్టాడు ఎటొచ్చీ వాడికీ, ఆవిడకీ నచ్చే పిల్ల కోసరం చూస్తున్నారు 'రామం చదువుతున్న కాలేజీలోనే అతడూ చదివాడు రెండేళ్ళు సీనియరనుకుంటాను. వాళ్ళిద్దరకూ స్నేహమే ఒకటి రెండుసార్లు పిన్నమ్మతో మన ఇంటికి వచ్చాడు. మీకు జ్ఞాపకముంటే ఉండవచ్చు" అన్నది గ్రుక్క తిప్పుకోకుండా.

"ఆ! ఏదో కొద్దిగా జ్ఞాపకం ఉన్నట్టే ఉంది. ఎర్రగా, సన్నగా ఉంటాడా!"

"ఔను! అతనే!"

"అయితమాత్రం మన కేమిలాభమమ్మా! మన మొండి ఘటం బొత్తిగా 'కట్న'మనే మాటె వనికి రాదంటుందిగా! దీనికంటె ఆ అబ్బాయేర మెరుగు! సంబంధానికేం! బాగానే ఉంది" అన్నా ఆయన నిస్పృహతో.

"అక్కడే మామయ్యా! మనిద్దరం కాస్త ధర్మరాజు యుద్ధంలో అబద్ధం ఆడినట్లు కాస్త అబద్ధం ఆడాలి. పిన్నమ్మకేమో మనం ముందు గానే కట్నం ఇచ్చేదాం. ఎలాగూ నలుగురిలో చదివించడానికి వీలులేదుకదా! కామేశంతో ఈ సంగతి సుజాతతో చెప్పవద్దని చెప్పుదాం. వాడికీ ఆదర్శం నచ్చిందే కాబట్టి, సరదా పడతాడేకాని ఏమీ అనకోడు నేనేమో సుజాతతో, పిన్నమ్మ చాదస్తురాలు కట్నం తీసుకోకపోవడమో నామో అనుకుని మనిషి అందుకని కొడుకు పుచ్చుకోకపోయినా పుచ్చుకున్నామని అబద్ధం ఆడుతుందని చెపుతాను. సుజాత తప్పకుండా నమ్ముతుందనే ధైర్యం నాకున్నది. అత్తగారితో కూడా అలానే అసలు విషయం చెప్పి, ఎవరైనా ఆ ప్రశక్తి తెచ్చినప్పుడు "ఆ! ఏమి కట్నం లేవమ్మా! ఈ కాలపు పిల్లలు మన ముచ్చట్లు, అచ్చట్లు తీరనిస్తారా! వాళ్ళ అభిప్రాయాలూ, మన అభిప్రాయాలు వేరు. ఏదో ఇచ్చామంటే ఇచ్చాం" అని అనమని చెబుదాం పిన్నమ్మవిన్నా, కామేశం కట్నం ఇస్తానంటే పుచ్చు కోడు కనక, తన కొడుకునే అన్నారనుకుంటుంది. పిన్నమ్మ అసలు ఇటువేపు రావడంలేదు పెద్ద కొడుకేమో ఢిల్లీలో ఉంటున్నాడు కూతురేమో నాగపూర్‌లో ఉంటున్నది. అందుచేత సుజాత 'పేచీ' సంగతి వాళ్ళెవ్వరకూ తెలియదు. ఈ నెలలో సెలవుపెట్టి, మళ్ళీ పిల్లను వెదుక్కోవ డానికి ఇటువేపు లను తల్లీ కొడుకు లిద్దరూ వస్తారట నేను సుజాత సంగతి వాళ్ళకు ఉత్తరం వ్రాస్తాను వాళ్ళకు మన సంబంధమే తప్పక నచ్చుతుంది. "వారిజాక్షులందు, వైవాహికంబులందు" అని మన పెద్దవాళ్ళు అననే అన్నారు. ఎవ్వరికీ హాని చెయ్యని అబద్ధం ఆడటం తప్పంటారా?" సందేహంగా అడిగింది కమల.

"తప్పులేదు కావి తల్లీ! మనం అనుకున్న ప్లాను, అడ్డంకీ లేకుండా ఆఖరివరకూ జరిగిపోవద్దా! మధ్యలో ఏ అడ్డంకులు వస్తాయో? అబద్ధాలు ఆడేవాళ్ళకుకాని, తప్పుకోవడం కష్టం. అంత చాకచక్యంగా, అబద్ధాలు ఆడే తెలివి తేటలు ఉండొద్దా" అన్నారు.

"ఆ విషయాలన్నీ నాకు వదిలి పెట్టండి. బాగో సర్దుకొస్తాను" అన్నది కమల ధీమాగా.

మాధవయ్యగారు "అలాగే వ్రాయమ్మా! ప్రయత్నించి చూద్దాం!" అన్నారు

కమల కొండ ఎక్కినంత సంతోషంతో ఇంట్లోకి వెళ్ళిపోయింది. కామేశానికీ, అతని తల్లి లక్ష్మమ్మ గారికీ ఉత్తరాలు వ్రాసింది పిన్నమ్మకు "మా ఆడబిడ్డ అంద చందాలు నీక్కు తెలియనివి కావు. కామేశానికి పెళ్ళిచేసే ప్రయత్నంలో ఉన్నావని తెలిసింది. తప్పకుండా మంచి రోజు చూసుకొని లాంచనంగా చూడటానికి, నువ్వు తమ్ముడూ రావలసింది. వాళ్ళిద్దరికీవచ్చి పిల్ల నీకు నచ్చితే, నువ్వు నేను మామగారు మిగతా విషయాలు మాట్లాడుకుందాం. కట్నం విషయం చట్టరీత్యా నేరం కాబటి నలుగురిలో మాట్లాడటానికి మామగారికి ఇష్టం లేదు. కామేశానికి కూడా ఈ విషయం కిట్టదని విన్నాను. అందుచేత మనం ముగ్గురమే ఉన్నప్పుడు ఆ విషయం మాట్లాడుకుందాం నీక్కావలసినంత కట్నం మామగారు నా ఎదుటే నీకు ఇస్తారు. ఆయన నా మాట కాదనరు నేను నీకేమీ లోటు రానియ్యను. తప్పక త్వరగా రావలసింది" అని వ్రాసింది.

ఉమ్మాయి ఉత్తరం చూసుకొని లక్ష్మమ్మ గారు, అఘ మేఘాలమీద తండ్రి ఉత్తరంలో చిందులు త్రొక్కి సుజాత వచ్చి వ్రాలారు సుజాత వస్తూనే "ఏమిటి వదినా! పరీక్షలు దగ్గర పడుతుంటే! నువ్వయినా నాన్నగారికి చెప్పకపోయావా?" అని విస్మయమాడింది.

కమల సుజాత నోరు మూస్తూ, "వూరుకో తెలివి తక్కువపిల్లా! ఈ ఒక్కరోజు చదవక పోయినా పాసవుతావు. తెగ చదివేకంటె,కాస్త 'రెస్టు' అవసరం. అయినా నీకు నచ్చే పెళ్ళికొడుకు వచ్చాడు. కామేశం కానీ కట్నం తీసుకోడు" అని చెవిలో చెప్పింది సుజాత మొహం సంతోషంతో వెలిగిపోయింది మధ్యాహ్నం మంచి ముహూర్తాన పెళ్ళి చూపులు ఏర్పాటు చేశారు. "అతికితే కతక దనే" సామెత ప్రకారం లక్ష్మమ్మగారు దగ్గర్లో ర్లోనేవున్న వారి సొంత వూరిలో పొలం పనేదో చూచుకొని సరిగా సమయానికి వచ్చింది. మళ్ళా సాయంతమే ప్రయాణం పెట్టుకొంది.

అందరూ తెలిసినవారే. ఉద్యోగరీత్యా కామేశం వాళ్ళు దూర ప్రదేశాలకు వెళ్ళడంవల్ల, ఈమధ్య రాక పోకలు ఎక్కువయి పరాయి వాళ్లలా మారి పోయారు! సుజాతను చూడగానే కామేశం కళ్ళు చెదిరపోయాయి. సన్నగా, నాజూగ్గా బంగారు తీగలా ఉంది. సుజాత మెల్లిగా వీణమీద "గిరిరాజ సుత తనయా" అని విఘ్నేశ్వర స్తుతితో ప్రారంభించి, మరి రెండు చక్కటి కీర్తనలు వాయించి ముగించింది. మనోహర వీణానాదంతో కూడి సుమధుర గాత్రం వింటూ శ్రోతలందరూ తన్మయులయి పోయారు. లక్ష్మమ్మగారికి సుజాత అన్ని విషయాల్లోనూ, ఎంతో చక్కగా నచ్చింది. కామేశం కళ్ళతోనే తన అంగీకారాన్ని తెలియజేశారు కాఫీ, ఫలహారాలు పూర్తయిన వదినగారి ఆజ్ఞననుసరించి, రామం, కామేశాన్ని అలా బైటకు తీసుకుపోయాడు కామేశానికి చెప్పవలసిన సంగతులన్నీ ఎలా చెప్పాలో రామానికి బోధ పరచి ఉంచింది కమల. సుజాత ఇంట్లోకి వెళ్ళిపోయింది.

హాల్లో మాధవయ్యగారు, రాధమ్మగారు, లక్ష్మమ్మగారు, కమలా మిగిలారు మాధవయ్యగారు మెల్లిగా "అమ్మా మీకూ మాకూ నచ్చింది. ఇంక నా శక్తిని మించకుండా కానుకల సంగతి చెబితే బాగుంటుంది" అన్నారు. లక్ష్మమ్మగారు కమలవైపు చూసి చిన్నగా నవ్వుతూ "మరియాద మాకు తెలియనిదా? అయితే మా కుర్రనాగమ్మ కట్నం లేకుండా కానీ పెళ్ళి చేసుకోనని కూర్చున్నాడు. వాడి మనస్సు కష్టపెట్టడం నాకు ఇష్ట లేదు. ఏదో లాంచనంగానైనా కట్నం తీసుకో పోతే నాకేదో పరువు తక్కువగా తోస్తుంది. లాంచనాల విషయమయినా, మరీ మితిమీరి ప్రవర్తిస్తే వాడు అంగీకరించడు. కట్నం ఏదో, వో రెండు వేలు, మిగతా లాంఛనాలుగా సామాన్యంగా జరిపిస్తే చాలు. ఇంతకీ చదువున్న అమ్మాయి అయినా మీ పిల్ల వాడికీ, నాకూ నచ్చింది. త్వరలోనే ముహూర్తం పెట్టించండి అన్నగారు" అన్నది ఆవిడ అప్పుడే వరుస కలుపుతూ.

మాధవయ్యగారు, రాధమ్మగారు, కమల ఆవిడ మాటలకు మహదానంద పడిపోయారు. కమల ఉత్తరం వ్రాసిన ప్రకారం కట్నం ముందే లక్ష్మమ్మ గారి చేతిలో పెట్టి, మరో వారం రోజులకు ప్రధానం చేసుకుని, నెల తిరక్కుండా ముహూర్తం పెట్టుకున్నారు అనుకున్న సుముహూర్తాన సుజాతకు, కామేశానికి మూడు ముళ్ళూ పడాయి. కమల యుక్తి ఫలించినందుకు ఇంటిల్లిపాదీ ఎంతో సంతోషించారు.

సుజాత అప్పుడప్పుడూ కామేశాన్ని "మరెంత మంచి వారండీ! కట్నం లేకుండా చేసుకుని, నా ఆదర్శం సఫలం చేశారు" అంటుంది నవ్వుతూ. కామేశం సర్వం తెలిసిన దేవునిలా అమాయికంగా వున్న ఆ కాటుక కళ్ళని చూస్తూ భావయుక్తంగా నవ్వుతాడు. పుట్టిన పాపకు, కమల అని కామేశం ఎందుకు పేరు పెట్టాడో సుజాత కీ నాటికీ తెలియదు.



# న్యూఢిల్లీ లేఖ

8వ పేజీ తరువాయి

జాప్యంవలన ఎన్నెన్ని అనర్థాలు కలిగాయో, కలుగుతున్నయో ఆయన ఇప్పటికీ గ్రహించకపోవటం శోచనీయం. ప్రభుత్వంయొక్క యీ విధానంవల్ల ఏదో రూపంలో కొంత నష్టం కలుగుతున్నమాట మాత్రం వాస్తవం.

ప్రభుత్వం కంపెనీల విధానాలపై అంచనాల సంఘంయొక్క 52వ నివేదిక వెలువడింది అందులో ఉద్యోగాలు, ఉద్యోగస్థులకు సంబంధించిన వివిధ వ్యవహారాలను ప్రస్తావించటం జరిగింది ఈ కంపెనీలు 'రిక్రూట్' చేసికొంటున్న ఉద్యోగుల సంఖ్య అవసరమయిన దానికంటె ఎక్కువగా ఉన్నదని ప్రారంభంనుంచే అధిక సంఖ్యలో ఉద్యోగులను తీసికోవటం జరుగుతున్నదని ఈ అంచనాల సంఘం ప్రస్తావించింది. అందువల్ల తక్కువ సరకులను ఉత్పత్తి చేయటం జరుగుతున్నదనీ, ఫలితంగా ఉత్పత్తయిన సరకు ధరలు ఎక్కువగా ఉంటున్నాయని అంచనాల సంఘం పేర్కొన్నది. వీరందరికి నివాస సౌకర్యాలు కలుగచేయటం, దానికి తోడు కార్మిక సమస్యలు అన్నీ కలిసి బాధ్యతలను ఎక్కువ చేస్తున్నాయని ఆ కమిటీ పేర్కొన్నది.

అంచనాల సంఘం నివేదిక హిందూస్థాన్ ఉక్కు కర్మాగారం విషయం ప్రస్తావించింది; అక్కడ 22 వేల మందికి పైగా పనిచేస్తున్నారు. ఈ కర్మాగారం లక్ష్యాలను అందుకొన్నాడు ఎంత సిబ్బంది అవసరమో, అంతే సిబ్బంది ఇప్పుడే వున్నది. కాని యింకా లక్ష్యాలను అందుకోలేదు. అమెరికా లాంటి దేశం ఆరువేలమంది మాత్రమే నియమిస్తుందట కాని అలాంటిదే ఆయన రూర్కెలా కర్మాగారంలో ఈనాడు 19 వేలమంది వున్నారు.

సహజంగా ఏదైనా "ఆటోమేటిక్" ఎరువుల కర్మాగారానికి 900 మంది లేక వెయ్యిమంది కావాలి. కాని సింద్రీలో తొమ్మిదివేలమంది పని చేస్తున్నారు.

ప్రభుత్వ సంస్థలలో సవర్థవంతమైన పని, పొదుపు అమలు జరగాలంటే అవసరమయిన ఉద్యోగుల వివరాలు ముందుగానే అంచనాలువేసికొనాలనీ అప్పుడే వారికై వెచ్చించే మూల ధనం సద్వినియోగం కాగలదని అంచనాల సంఘం పేర్కొన్నది. అందువల్ల ఉత్పత్తి వ్యయం కూడ తగ్గుతుంది. ఈ అంచనాల సంఘం ఈ క్రింది సలహాలను కూడా ఇచ్చింది

(1) సలహాదార్లు సూచించిన సంఖ్యకంటె ఉద్యోగుల సంఖ్య ఎప్పుడూ కొంచెం తక్కువలో ఉంచటం మంచిది.

(2) సలహార్లు అంచనా వేసిన దానికంటె ఎక్కువమంది ఉద్యోగాలకు ప్రభుత్వ అనుమతి లేకుండా నియమించకూడదు

(3) వివిధ పరిశ్రమల్లో మొత్తం అవసరమయిన ఉద్యోగుల సంఖ్యముందుగానే రూపొందించుకోవాలి.

(4) ప్రభుత్వం తరచుగా తనిఖీలు జరుపుతూ ఉండాలి

ప్రస్తుతం అదనపు సిబ్బందిని వినియోగించు కొన్న సందర్భాల విషయమై పరిస్థితిని క్షుణ్ణంగా పరిశీలించాలని, పథకాల విస్తరణ జరిగేటప్పుడు అదనపు సిబ్బందిని వినియోగించుకోటానికి ఎలాంటి చర్యలు తీసికొన్నారో పరిశీలించాలని కూడా అంచనాల సంఘం సూచన.

శ్రీకృష్ణ ★

# సరాగమాల



## వి.ఎ.కె. రంగారావు

"పగలే వెన్నెల" పాట గురించి నాచే సమాధానం పొందిన సుబ్రహ్మణ్యం గారు ఏలూరునుంచి మరొక కార్డు ఇలా వ్రాశారు.

"సరాగమాలలో మీ సమాధానం (నా సందేహానికి) చూచాను. అందులో మీరు మీ పరిధులను దాటి వెళ్ళారని నా అభిప్రాయం. మీరు సంగీతానికి సంబంధించినంత వరకే పాటలను విమర్శించ వలసింది కానీ.... పాటను తీసుకొని ఆ పాటలోని సాహిత్యాన్ని తర్కించి ఆ పాటకు ఆ సినిమాలో ఎంత సందర్భ ఉచితత్వం ఉందో విమర్శించటం మీ పరిధులను అతిక్రమించడమే అవుతుంది. ఇందులో నా పొరపాటు లేదనుకుంటాను. మీకు ఇది నచ్చకపోతే సరాగమాల పరిధులు ఎంతవరకో వివరించండి.

ఆంధ్రప్రజా బాహుళ్యం మీద మీరు ఏ నాటి నుంచో మనసులో దాచుకున్న అభిప్రాయాన్ని అతి తెలివిగా బయట పెట్టారు కానీ ఆ బయట పెట్టటంలో ఏ విధమైన ఆవేశమైనా ప్రదర్శించి ఉంటే పరిణామం తీవ్రంగా ఉండేదేమో! సరిగమలు కోసమే మీ సరాగమాల అని నా అభిప్రాయం"

— ఒక సినిమా పాటను తీసుకొని అందులో కేవలం సంగీతాన్ని విమర్శించడంసాధ్యం కానిపని. ఒక వేళ మీ బోంట్లకు అది సాధ్యమైనా అది అవాంఛనీయమైన విషయమే. ఒక త్యాగరాజ కృతికి రాకెన్‌రోల్ వరస పెట్టి సినిమాలో వినిపిస్తే సంగీతం బాగుంది కాదు అనటంతోనే సరి పోతుందా? సందర్భ శుద్ధి లేదని చెప్పుకోనవసరం లేదా! అయినా సరాగమాలకు పరిధులు నిర్ణయించ వలసినది మీరు కాదు. నేను. నా పైన నే వ్రాసినది ప్రచురించే సంపాదకుడు ఇప్పుడు కాని, ఎప్పుడు కాని సరాగమాల పరిధులు ఇవని వివరించక పోవటానికి కారణం సమయానుకూలంగా పెంచడం తగ్గించడం నా ఉద్దేశం కనుక.

ప్రజా బాహుళ్యం మీద నాకున్న అభిప్రాయం ఏ నాటినుండో దాచుకున్నది కాదు. మీ ప్రశ్న సందర్భాన్ని సృష్టించినది కాబట్టి ఆ అభిప్రాయాన్ని వెలిబుచ్చడానికి అవసరం కనబడింది. సాధారణంగా నేను అందం గురించి ఆనందం గురించి, మంచిని గురించి వ్రాసేటప్పుడే ఆవేశంతో వ్రాస్తాను. వాటికి విరుద్ధమైన వాటి గురించి వ్రాసేటప్పుడు వీలయినంతగా ఆవేశాన్ని తొక్కిపట్టి, వాస్తవాలనే నగ్నంగా చదువరుల ఎదుట నిలుప ప్రయత్నిస్తాను. ఒక వేళ ఎటువంటిదైనా నేను నిజమని నమ్మినప్పుడు ఆ నమ్మిక ఆవేశ పూరితంగానే మీ ఎదుట దూకినపుడు, పరిణామాలు తీవ్రంగా ఉన్నా సరే భరించడానికి సంసిద్ధుణ్ణి. లేక పోతే ఒక శీర్షిక నడిపే బాధ్యతను ఎందుకు నెత్తిన వేసుకుంటాను? తాను మనస్ఫూర్తిగా నమ్మిన దానిపట్ల ఆ మాత్రం ధైర్య స్థైర్యాలు చూపలేని వారు శీర్షికలు నడపడానికి తగరని నా వ్యక్తిగతాభిప్రాయం అవి నాకు లేవనుకున్నపుడు నేను నడపను కనీసం శీర్షికలు నడిపే వారికి మీలా ఉత్తరాలు కూడా వ్రాయను.

* * *

హైదరాబాదునుంచి వ్రాసిన ఎస్. సుబ్రహ్మణ్యంగారికి — మీ మూడు సందేహాలకు సమాధానాలు ఒకటే. నా ఆంధ్రదేశ పర్యటన ముఖ్యోద్దేశం పాఠకుల అభిరుచులు, అభిప్రాయాలూ తెలుసుకోవాలని కాబట్టి నా తీర్థయాత్ర వివరాలు సరాగమాలలో ప్రచురించడమైనది. మరొక ఉద్దేశముతో కాదు రెండు ప్రతిభ ఉంటే ప్రజలే గుర్తిస్తారు అని అనుకోవడం భ్రమ. ఈనాడు నేను ఘంటసాల, సుశీల పాటలగురించి వ్రాయకపోయినా ఫరవాలేదు. వ్రాసినంత మాత్రాన వారికి ఒరిగేది ఏమీ ఉండదు. కాని కొత్త కొత్త గాయకులకు ప్రచారం అవసరం. వీరిలో ఏ మాత్రం శక్తి ఉందని తెలిసినా వారిగురించి డబ్బా వాయించడమే కాదు. వారి రికార్డులు ఇంటింటికి తీసుకు వెళ్ళి అమ్మటానికైనా నేను సందేహించను ఒక చోట మంచి ఉందని తెలుసుకున్నపుడు దానిని శక్తి వంచన లేకుండా ప్రోత్సహించాలి తగిన ఛాన్సు లిప్పించడం నా కలవిగాని పని ఇక మిగిలినదేమిటి! ఆ కొత్తవారలగురించి పదే పదే వ్రాసి వారంటే ఒక కుతూహలం ప్రజలలో కలిగించటం. నేను చేయటానికి ప్రయత్నిస్తున్నదీ, కొంతవరకు కృతకృత్యుడ్ని అవుతున్నదీ అందులోనే మూడవది విమర్శతో ఉత్తరం వ్రాసినంత మాత్రాన నేనంటే వ్యక్తిగత శతృత్వం ఉందని భ్రాంతి చెందేటంతటి వాడిని కాను. నేనన్నా, సరాగమాలన్నా, సదభిప్రాయమూ, అభిమానమూ ఉన్న వారే కదా శ్రద్ధ తీసుకుని మీరు వ్రాసినటువంటి విమర్శనాత్మకమైన ఉత్తరాలు వ్రాస్తారు? ★


పై వారమే!

ఎన్. టి. రామారావుతో

"ముఖాముఖి"

ప్రత్యేకమైన ఛాయాచిత్రాలు!

ప్రత్యేకమైన ఇంటర్వ్యూ!!

## మూడుగంటల కాలక్షేపం: 'నవగ్రహా పూజామహిమ'

"వెన్నెక్కితే కరుణ, లేకపోతే కక్ష వహించే" నవగ్రహాల మహిమను దృష్టాంత పూర్వకంగా వివరించే జానపద చిత్రం "నవగ్రహా పూజా మహిమ' ఆంధ్రదేశమంతటా ఈ నెల 19తేదీన విడుదల చేసిన ఈ చిత్రాన్ని పోయిన వారంలో మద్రాసులో విలేఖరులకు ప్రత్యేకంగా చూపారు.

సత్యపాల మహారాజు కార్యశూరుడు. వాక్శూరుడు కాడు. మానవుల ప్రతిభలోనూ, కార్యసిద్ధిలోనూ అతనికి మంచి నమ్మకం. నవగ్రహాల దోషం ఉన్నదని సూచించిన అస్థాన జ్యోతిష్యుని మాటలను కూడా ధిక్కరించి, ఆ నవగ్రహాలను పూజించటానికి సత్యపాలుడు తిరస్కరిస్తాడు.

ఫలితంగా కష్టాలన్నీ అతన్ని చుట్టుముట్టుతాయి. సేనాపతి పగబూని ఉంటాడు. వేటకు వెళ్ళిన సత్యపాలుణ్ణి నానా హింసలు పెట్టి, పాడుపడ్డ బావిలో పడవేయిస్తాడు. సత్యపాలుడు ఏమంతయినా ధైర్యాన్ని కోల్పోక, ఆ బావిలోనే కొట్టుమిట్టాడుతూ ఉంటాడు. చుట్టుముట్టిన సర్పాలను అవలీలగా తీసిపారేస్తూ ఉంటాడు. ఆ మార్గాన వెళుతున్న పాంథులు అతనిని రక్షించినా, ఆ రక్షణ నిరుపయోగమవుతుంది.

రాజాస్థానంలో సత్యపాలుని భార్యను సేనాపతి బలవంత పెడుతూ ఉంటాడు. మంచి మాట చెప్పిన రాజజ్యోతిష్యునికి కారాగారవాసం తప్పలేదు.

సత్యపాలుని గానం చూసి మురిసిపోయిన వీధి భాగవతపు బృంద మొకటి తమ వెంటనే ఉండమని, అతన్ని కోరుతుంది. సత్యపాలునికి తప్పలేదు అక్కడ కూడా అతనికి విధి ఎదురవుతుంది. అతను చేయని హత్యకు అతనే బాధ్యుడవుతాడు. ఫలితంగా ఆ దేశపు రాజాజ్ఞ ప్రకారం సత్యపాలుని కాళ్ళు, చేతులు ఖండింపబడుతాయి. కాకులు, గద్దలు సత్యపాలుని చుట్టూ తిరుగుతున్న స్థితిలో ఆ వీధిన బండిలో వెళుతున్న యువ దంపతులు అతన్ని రక్షించి ఇంటికి తీసుకెళుతారు. వాళ్ళు నువ్వుల నూనె వ్యాపారస్థులు. ఆ గానుగ దగ్గరనే సత్యపాలుణ్ణి కూర్చోపెడతారు. అక్కడ కూడా అతన్ని చూచి కాలదేవత పరిహసిస్తుంది. గానుగకింద పడ్డ పసిపిల్లవాని మరణానికి ఇతన్నే బాధ్యుడుగా భావించటంతో ....... సత్యపాలుడు సహించలేక పోతాడు. ఇదంతా నవగ్రహాల ప్రభావమే నని తెలుసుకొంటాడు. నవగ్రహాలను ప్రార్థిస్తాడు ఆరాధిస్తాడు. నవగ్రహాలు అతన్ని కనికరించి, తిరిగి రాజ్యమూ, అర్ధాంగినీ యిప్పించి సకల సౌఖ్యాలూ కూరుస్తాయి.

కథావస్తువు మానవుని నమ్మకాల మీదనే ఆధారపడి ఉండటం వలన, ఇంత శ్రమా తేలిపోయే ప్రమాదం ఒకవైపు ఉన్నది. అలాంటి స్థితిలో చిత్రానికి జోడించిన వాస్తవిక సన్నివేశాలు కొంత వరకు మేలు చేకూరుస్తాయి. శనిని ధిక్కరించిన కైలాసనాథుని వృత్తాంతమూ, నవగ్రహాలను చిన్నచూపు చూచి ఫలిత మనుభవించిన రావణబ్రహ్మ ఉదంతమూ ఈ చిత్రానికి జీవం పోస్తాయి. పోతే హాస్య నటుడు బాలకృష్ణ కోసం అల్లిన 'అవ



"నవగ్రహా పూజామహిమ"లో వాసంతి.



"డా॥ చక్రవర్తి" లో సావిత్రి.



"అమరశిల్పి జక్కన్న"లో బి. సరోజాదేవి.

హాస్య కథ' "క్షోభ క్షోభ" గా ఉన్నా, ఏదో కొంత హాస్యాన్ని అందించకపోదు.

సంభాషణలు చక్కగాను, సరళంగాను ఉన్నాయి. అవి నిజంగా రచయిత జి. కృష్ణమూర్తిగారి వివేచనా శక్తిని తెలియజేస్తాయి పాటలు బాగున్నాయి.

సంగీతం రమణీయంగా ఉంది

గీతాంజలి ప్రదర్శించిన నృత్యాలు ఉన్నంతలో బాగున్నాయి. సెట్టింగుల వల్లనే ఈ నృత్యాల శోభ ఇనుమడించిందని చెప్పాలి

ముక్కామల ఆధ్వర్యం వహించిన వీధి భాగవతుల బృందం కాలక్షేపానికి బావుంటుంది. కాని, జానపద చిత్రంలోని వీధి భాగవతులచేత 'రాక్ ఎన్ రోల్' ఆడించటం ఆశ్చర్యంగా ఉంది

సత్యపాలుడుగా కాంతారావు నటన ఎన్నదగ్గది వారు స్టంట్ దృశ్యాలలో చూపించిన నైపుణ్యం, పులి పోరాటం ప్రతిభావంతంగా ఉన్నాయి

చిన్న చిన్న పాత్రలు పోషించినా సత్యనారాయణ, రామకృష్ణ, శోభన్‌బాబులు వాళ్ళ వాళ్ళ పాత్రలకు న్యాయం చేకూర్చారు. వాసంతి, గీతాంజలి నగిషీ ఉన్నంతవరకు నటించారు

'స్టార్ వాల్యూ' పాపంలాగా పెరిగిపోతున్న ఈ రోజుల్లో కొత్తవా రందరికి నిగో గమానంతో అవకాశమిచ్చి, వారి నటనను సద్వినియోగం చేయటం సాహసం. ఈ సాహసి విఠలాచార్య అప జయం ఎన్నడు ఎరుగడు

ఏమయినా మూడు గంటల సత్కాలక్షేపానికి ఈ చిత్రం బాగా ఉపకరిస్తుంది

వాశిరాజు, శ్రీకాకుళం,

## అమెరికాలో నాగేశ్వరరావు

వందమందికి పైగా ఉన్న భారతీయుల తరఫున శ్రీ టి. వి. మాధవరావుగారు మిషిగన్ రాష్ట్ర రాజధాని లాన్సింగ్ నగరానికి వచ్చి తమను ఆనంద పర్చమని నాగేశ్వరరావుగారిని కోరారు. శ్రీ నాగేశ్వరరావు మార్చి 19 న వాషింగ్టన్ (డి. సి) చేరగానే, వారి అభిమతం గుర్తించిన ప్రభుత్వం వారు మిషిగన్ రాష్ట్ర పర్యటనంతా లాన్సింగ్‌లో కేంద్రీకరించారు ఇక్కడి భారత విద్యార్థి సంఘం వారు ఆయనగౌరవార్థం ఏప్రిల్ 5 న "సాంఘిక సమ్మేళన" కార్యక్రమం ఏర్పాటు చేశారు మిషిగన్ రాష్ట్ర విశ్వవిద్యాలయంవారు—ప్రభుత్వం తరఫున శ్రీ నాగేశ్వరరావుగారికి విడిది నిచ్చి—అతిథి గౌరవాలు జరుపడానికి నిశ్చయించారు

ఫలితంగా నాగేశ్వరరావుగారు క్లీవ్‌లండ్ (ఓహాయో రాష్ట్రం) నించి, స్టేట్ డిపార్ట్‌మెంట్ నియమించిన ఆయన "ఎస్కార్ట్" శ్రీ సెడ్జ్‌విక్‌తో సహా ఏప్రిల్ 5 ఆదివారం మధ్యాహ్నం విమానంలో వచ్చారు. 'లాన్సింగ్' విమానాశ్రయంలో మ్రగాసులో ఉండి తిరిగి వచ్చిన అమెరికన్ కుటుంబాలూ, మిషిగన్‌లో డిట్రాయిట్ బాటిల్ క్రీక్, ఆనార్బర్ పట్టణాలూ, టోలిడో (ఒహాయో), సౌత్ బెండ్ (ఇండియానా)ల నుంచి ఆయన్ను కలుసుకుందామని వచ్చిన ఆంధ్రులూ, ఇక్కడి భారతీయ విద్యార్థులూ, వారి కుటుంబాలూ, ఒక పాకిస్తానీ విద్యార్థినీ అదితరుణి నాగేశ్వరరావుగారికి స్వాగత మిచ్చారు

యూనివర్సిటీవారిచ్చిన విడిదిలో మేము ఐదుగురం నాగేశ్వరరావుగారితో గంటన్నర ముచ్చటించాం దేశ పరిస్థితులూ, మనవారి యోగక్షేమాలూ మన సినీ పరిశ్రమాభివృద్ధి, దేశంలో మత కల్లోలాలూ, ఆంధ్రలో పైకి వస్తున్న పరిశ్రమలూ, తదితర విషయాలు ఆయన చెప్పారు, ఈ గంటన్నర పరిచయ గోష్ఠిలోనే నాగేశ్వరరావు గారితో ఎంతోకాలంగా పరిచయం ఉన్నట్లు అనిపించింది.

సాయంత్రం నాలుగున్నర గంటలకి యూనివర్సిటీవారి ఆహ్వానంమీద నాగేశ్వరరావుగారు ఇక్కడి "ఆడిటోరియం" లో "డిట్రాయిట్—సింఫొనీ—



"దేశద్రోహులు" చిత్రంలో దేవిక, జానకి.

ఆర్కెస్ట్రా"కి వెళ్లి పాశ్చాత్య, శాస్త్రీయ సంగీతం విన్నారు. ఆరు గంటలకు ఆయన గౌరవార్థం ఇక్కడి ఆంధ్ర విద్యార్థు లిచ్చిన విందులో అరవై మంది అతిథులు పాల్గొన్నారు. మద్రాసు, హైదరాబాదులను వదిలి ఇంతదూరం వచ్చినా నాగేశ్వరరావుగారికి "షూటింగ్" సందడి తగ్గలేదు! రాత్రి ఎనిమిది గంటలకి భారత విద్యార్థి సంఘం—కార్యక్రమంలో ఆయన చక్కగా ఉపన్యసించారు.

తను స్త్రీ పాత్రాభినయంనుంచి "హీరో" పాత్రపోషణల్లోకి మారడంలో తాను పడిన శ్రమా కష్టాలూ బట్టబయలు చేస్తూంటే నవ్వులతో పాటు ఆయన నిస్సంకోచ స్వభావానికి మెచ్చుకోళ్లతో సభ నిండిపోయింది!

మర్నాడు, ఆరవ తేదీ ఉదయం నాగేశ్వరరావు గారు లాన్సింగ్‌లో ఉన్న "ఓల్డ్స్ మోబిల్" కార్లు తయారుచేసే "ఫాక్టరీ" చూశారు. ఆ మధ్యాహ్నం యూనివర్సిటీవారి టెలివిజన్ స్టూడియో పర్యటించారు. సాయంత్రం బి. ఎస్ విద్యార్థులు ఉండే "డార్మిటరీ" (హాస్టల్స్) లని సందర్శించారు. ఆయన చూసిన ఈ మూడు హాస్టల్స్‌లోనూ ఒక ప్రత్యేకత ఉంది విద్యార్థులూ, విద్యార్థినులూ ఒకే హాస్టల్లో వేరే వేరే "బ్లాక్స్" లో ఉంటూ, ఒకే "డైనింగ్ రూమ్'లో తింటూ, అక్కడే ఉన్న "క్లాస్ రూమ్స్" లో చదువుకుంటూ ఉండడం అమెరికాలోనే మొదటి ప్రయోగంగా నడుస్తోంది! తర్వాత పోస్ట్—గ్రాడ్యుయేట్ విద్యార్థులు వారి హాస్టల్‌లో ఆయనకి తేనీటివిందు నిచ్చి—ముఖ్యంగా మన సినీ పరిశ్రమని గురించి చర్చించారు. గమనించ దగ్గ విషయం. వీరిలో కొందరు అమెరికన్ విద్యార్థులు త్వరలో భారతదేశం వెళ్లబోతున్నారు

ఏడవ తారీఖున నాగేశ్వరరావుగారు లాన్సింగ్‌లో మిషిగన్ రాష్ట్ర శాసన సభా భవనం చూచి, అక్కడ "సెక్రటరీ ఆఫ్ స్టేట్ (మన హోమ్ మినిస్టర్—హోదా) ని కలుసుకుని హిందూ సంప్రదాయాలూ, వివాహ పద్ధతులూ మొదలైన విషయాల్ని గురించి చర్చించారు. తర్వాత యూనివర్సిటీ ఆవరణకి తిరిగి వచ్చి ఇక్కడ డిగ్రీ పొంద బోతున్న విద్యార్థులకి ఉద్యోగ ప్రయత్నాలోకి 'యూనివర్సిటీ—ప్లేస్‌మెంట్' వారిచ్చే దోహదం, చదువుకుంటున్న విద్యార్థుల్లో 10,000 మంది ఎలా పార్ట్—టైమ్ ఉద్యోగులుగా చేస్తున్నారో చూశారు. యూనివర్సిటీ వైస్ ప్రెసిడెంట్ డాక్టర్ సెబ్రైన్‌ని కలిసికొని యూనివర్సిటీ ఎడ్మినిస్ట్రేషన్ వివరాలు తెలుసుకొన్నారు

'సత్య' (మిషిగన్)

నూట పదకొండు చిత్రాలలో నటించిన మేటి హీరోను ఏ చిత్రంలోనూ ఏ అమ్మాయీ 'ముద్దెట్టుకో లేదంటే' అక్కడివారికి ఎంతో వింతగా అనిపించింది. 'ప్లెన్ డీలర్' లనే ప్రఖ్యాత పత్రిక ప్రత్యేక విలేఖరి వార్డు మార్ఫ్ అక్కినేనిని గురించి వ్రాసిన వ్యాసానికి 'ఫిలిం హీరో హాస్ నాట్ బీన్ కిస్డ్ ఎట్' అంటూ 'నాలుగు కాలం'ల శీర్షిక నిచ్చాడు.





"దేశద్రోహులు" లో గిరిజ.



శ్రీ అక్కినేని నాగేశ్వరరావు వాషింగ్టన్‌లో ఎరినాస్టేజ్ థియేటరును చూడడానికి వెళ్లినప్పుడు దానిని గురించి ఫోర్డుఫౌండేషన్ ప్రతినిధి శ్రీ డగ్లెస్‌ఐగ్ వివరంగా చెబుతున్నారు.

## ఆడంబరాలను విడనాడండి
## దేశసంపదను వృధా కానీయకండి


### కాల్గేట్ బేబి పౌడరు

ఒక ప్రత్యేకమైన పౌడరు ప్రత్యేకంగా మీ బేబీ కోసం

మీ బేబీ అంటే మీకు ప్రత్యేకం — ప్రతి విషయంలోనూ ప్రత్యేకమే ప్రత్యేక ఆహారం. ప్రత్యేక దుస్తులు. అవును ఒక ప్రత్యేక పౌడరు — కాల్గేట్ బేబీ పౌడరు!

కాల్గేట్ బేబీ పౌడరును ప్రత్యేకంగా బేబి సున్నిత శరీరంకోసం తయారు చేసారు. ఎంతో మెత్తనైనది, ఎంతో సున్నమైనది, ఎంతో పొదుపు కూడా. బేబీలకు కాల్గేట్ బేబీ పౌడరంటే ఎంతో ప్రీతి—మీకు కూడా ప్రియమే!











### మీ చిన్నారి పాప రూ. 1,000 గెలవచ్చు.

మీరు చేయవలసిందంతా యింతే: ఈ క్రింద ఉదహరించిన వయసు వర్గాలలో మీ బిడ్డ సంకొత్త ఫోటో (ముఖం పూర్తిగా వుండాలి) పంపండి. 1½ సంవత్సరాలు అంతకు తక్కువ 1½ సంవత్సరాలనుండి 3 సంవత్సరాలవరకు. దానితో పాటు కాల్గేట్ బేబీ పౌడరు లార్జి లేక జయంట్ సైజు డబ్బా యొక్క మూతను జతపరచి క్రింది చిరునామాకు పంపండి.

**కాల్గేట్ బేబీ పౌడరు ఫోటోల పోటీ**
**పోస్టు బాక్సు నెం. 1965 బొంబాయి-1.**

సూత్రాలు నిబంధనలు:

1. మీరు ఒకటి కంటె హెచ్చు ఎంట్రీలు పంపవచ్చు. అయితే ప్రతి ఎంట్రీతోను, కాల్గేట్ బేబీ పౌడరు, లార్జి లేక జయంట్ సైజు డబ్బా యొక్క మూతను పంపాలి.
2. మహారాష్ట్ర స్టేట్ వుమెన్స్ కౌన్సిల్ కి చెందిన 5 గురు సభ్యులుగల ఒక సంఘం ఎంట్రీలపై తీర్పు చెబుతారు. వారు యిచ్చేదే తుదితీర్పు దీనిపై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
3. కాల్గేట్-పామోలివ్ (ఇండియా) ప్రయివేట్ లిమిటెడ్ మరియు గ్రాంట్ అడ్వర్టైజింగ్ ఇన్కార్పొరేటెడ్ ఉద్యోగులు ఈ పోటీలో పాల్గొనరాదు. 1964, జూలై 31 తారీఖున ఈ పోటీ ముగుస్తుంది.

ప్రయిజులు

| 1½ సంవత్సరాలు క్రిందివారికి | 1½ నుంచి 3 సంవత్సరాలవరకు |
|---|---|
| మొదటి బహుమానం రూ. 1000/- | మొదటి బహుమానం రూ. 1000/- |
| 50 కన్సొలేషను ప్రైజులు రూ. 50 ఒకొక్కటి | 50 కన్సొలేషను ప్రైజులు రూ. 50 ఒకొక్కటి |

## ఆనందం కావాలా?

అద్భుత హాస్యకదలు బ్రహ్మాండంగా నవ్వించే కొన్నివందల చిన్నకదలున్నగొప్పపుస్తకం వెల రూ3 50
చేతిపనులు పరిమళాలు,విలాస వస్తువులు వివిద మందులు ఎన్నోరకాలు,సులభంగాచేసే మార్గాలు రూ3 50
జీవిత రహస్యాలు మీ దాంపత్యసుఖ జీవితానికి వెంటనే తెలుసుకోదగ్గ అనేక కామసూత్రాలు రూ3 50
అమ్మక రహస్యాలు వ్యాపారంద్వారా మంచి లాబాలతో దనసంపాదనకు అనేక కొత్తదారులు రూ 6 00
పోష్టు ఖర్చులుచితం క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే మీకు కావలిసినవి వి పి పోష్టులో పంపబడును

దేశసేవ ప్రచురణలు, ఏలూరు. ఆంధ్ర.

మీరు చదివారా? లేకపోతే చదవండి!

ఉత్తమ నవలలని ప్రసిద్ధి పొందిన
ఉత్తమ నవలా రచయిత
శ్రీ కప్పగంతుల మురళీకృష్ణ రచనలు

యుగధర్మం 6.00
పడగ లెత్తిన కాలం 4.00

పై రెండు పుస్తకాలకు పోస్టుఖర్చులు మావి
నేడే మీ ఆర్డరు వ్రాయండి వివరాలకు
క్వాలిటీ పబ్లిషర్సు, విజయవాడ–2

డాక్టర్ వృత్తి చేయండి

విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్ద్వారా హోమియోపతి చదివి, గవర్నమెంటు రిజిష్టర్డు కాలేజిద్వారా డిప్లొమా పొందండి ప్రాస్పెక్టస్ ఉచితం వెంటనే వ్రాయండి.

Indian Homoeopathic College,
(APW), JULLUNDUR CITY

ఉచిత చికిత్స

బొల్లి వగైరాలకు
మేము ఒక బుడ్డి మందు
ఉచితంగా యిస్తాము
వాడి చూడండి

ARUN PHARMACY, N
P. O. Katrisarai (Gaya)


## సినిమా వార్తలు

టాడు"— కారణం కూడా చెబుతాడు "అరెరె! ఎలా వచ్చింది ఏమి మందులు తీసుకున్నావ్? ఇప్పుడెలా ఉంది ఫలాన మందులు తీసుకుంటే నయ మవుతుందేమో! అంటూ కుశల ప్రశ్నలలో దిగుతాడు మార్వాడీకి ఆశ్చర్యం కలుగుతుంది "దొంగతనానికి వచ్చి ఇదేమిటయ్యా?" అని దొంగని మార్వాడీ అడుగుతాడు "అసలు నేను దొంగనయితేగా— దొంగలు అందరూ భయ పడతారంటే నిజమే అనుకున్నాను — దొంగనన్నాను అంతేకాని నేను దొంగను కాను" అంటాడు దొంగ

ఈ సన్నివేశం చందమామ ఫిలింస్ వారు నిర్మిస్తున్న 'దొరికితే దొంగలు" చిత్రంలోకి ఈ మధ్య మెజెస్టిక్ స్టూడియోలో చిత్రీకరించారు ఈ సన్నివేశంలో మార్వాడిగా బి ఎస్ ఆర్ దొంగగా రమణారెడ్డి నటించారు

వీరుగాక ఈ చిత్రంలో రామారావు, జమున, ధూళిపాళ, కాంతారావు, రాజనాల, సత్యనారాయణ, పేకేటి, అల్లు రామలింగయ్య, సూర్యకాంతం, జయంతి, శారద, రాజశ్రీ, మొదలగువారు నటిస్తున్నారు

ఈ చిత్రానికి కథ కె వి ఆర్ ఆచార్య, మాటలు పినిసెట్టి, పాటలు ఆరుద్ర, సి నారాయణరెడ్డి, సంగీతం యస్ రాజేశ్వరరావు, ఛాయ ప్రసాద్, కళ గొడగాంకర్, కూర్పు ప్రకాష్, దర్శకత్వం పి సుబ్రహ్మణ్యం, నిర్మాత డి ఎల్ నారాయణ

### యస్. ఆర్. మూవీస్ 'ప్రమీలార్జునీయం'

యస్ ఆర్ మూవీస్ వారి పౌరాణిక చిత్రం, "ప్రమీలార్జునీయం" వాహినీ స్టూడియోలో షూటింగ్ జరుగుతుంది ఈ చిత్రంలో యన్ టి రామారావు, కాంతారావు, రేలంగి, పద్మనాభం, శోభన్‌బాబు, బాలకృష్ణ, మిక్కిలినేని, జగ్గారావు, రమేష్, సురేంద్ర బి సరోజాదేవి, రాజమ్మ, గిరిజ, రాజశ్రీ, కన్నాంబ, ఛాయాదేవి, మొదలగువారు నటిస్తున్నారు

ఈ చిత్రానికి రచన పింగళి నాగేంద్రరావు, సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ రవికాంత్ నిగాయిజ్, స్టూడియో విజయా అండ్ వాహినీ, నిర్వహణ లక్ష్మీప్రసన్న, నిర్మాతలు నాగమణి అండ్ ఆదిబాబు, దర్శకత్వం మల్లికార్జునరావు

### జకార్తాఫిలిం ఉత్సవాలకు 'నర్తనశాల'

జకార్తా ఫిలిం ఉత్సవాలకు అఖిల భారత ద్వితీయ ప్రసంశాపత్రాన్ని పొందిన రాజ్యం పిక్చర్సువారి "నర్తనశాల" చిత్రాన్ని 13వేల అడుగులకు ఎడిట్ చేసి డాక్యుమెంటరీ చిత్రంగా పంపించబడింది ఈ చిత్రంతో నిర్మాతలు శ్రీధరరావు శ్రీమతి లక్ష్మీరాజ్యం, యస్ వి రంగారావు రేలంగి, సావిత్రి, కూడా వెళ్ళరు

సి ధర్మారావు ★

## రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

సుకుంటూ సమాధానం చెప్తాడు రాజుగారు ఏడుగురు కొడుకులు కథ జ్ఞాపకం వస్తుంది!

బియ్యం ధర పెరుగుతే, మేము మాత్రం పెరగమా అంటున్నాయి 'ఇడ్లీ!' సైజులో కాదు ధరలో వాటితోపాటు మిగతావి కూడా పెరిగిపోయినాయి. ఇప్పుడు హోటలు భోజనం రూపాయి పావలా అయింది రాజధాని నగరంలో ఈ అయిదారేళ్ళల్లోనూ హోటలు వ్యాపారం విపరీతంగా పెరిగిపోయింది ఎక్కడ చూసినా హోటళ్ళే! ఆ వ్యాపారంలో అంత లాభం కనిపిస్తోందన్నమాట!

అయితే ధరలు, నలుగురికీ అందుబాటులో ఉండేటట్లుగా చూడకుండా, హోటలు యజమానులు, ఇష్టం వచ్చినట్లు పెంచెయ్యటం, అనేవాళ్ళు ఎవ్వరూ లేకపోవటం, ప్రతిదానికీ ప్రభుత్వం వారినే అనాలంటే విసుగ్గానే ఉంటుంది అయితే తప్పదు దీంట్లో కూడా వాళ్ల బాధ్యత లేకపోలేదు. ఆకాశాన్నంటే ధరలను తగ్గించటానికి, ప్రభుత్వం వారు తీవ్రమైన చర్యలు తీసుకుంటారని ప్రకటనలు సమ్మె చేస్తాం, సత్యాగ్రహం చేస్తాం అంటూ కార్మిక, కర్షక ప్రజానీకం ప్రకటించటం, వీటి వలన ధరలేం తగ్గుతాయి! ఘోరంగా పెరిగిపోతున్న ధరల సంగతి, నిత్యం అందరికీ తెలిసిందేగా!

వీటికితోడు ఆరోగ్య పరిస్థితీ చూడపోతే రాను రాను అధ్వాన్నంగా తయారవుతుంది నోరు మెదపటానికి వీల్లేదు జాతీయ గుడిసెల యూనియన్‌వారు, మురికి వాడల సంఘంవారు, విరుచుకుపడతారు ఈ వాడల్లో నివసిస్తున్నవారు ఎంత అనారోగ్య పరిస్థితుల్లో ఉన్నారో, వారివలన చుట్టుప్రక్కలవాళ్ల ఆరోగ్యాలు ఎంత దెబ్బ తింటున్నాయో చెపుతే వాళ్లకు అర్థంకాదు పట్టించుకోరు. స్వేచ్ఛా విహారంచేస్తూ, ఇతరులను స్వేచ్ఛను అరికట్టటంలో ఎంతవరకైనా పోగలరు నగరంలో ఈ మురికివాడలు విపరీతంగా పెరిగిపోయినాయట! ఈమధ్య చేసిన సర్వే ప్రకారంచూస్తే, పన్నెండు లక్షల జనాభాగల రాజధాని నగరంలో లక్షకుపైగా ఈ మురికివాడల్లోనే నివసిస్తున్నారుట ఇలాంటివి మొత్తం తొంభై దాకా ఉన్నాయిట ఈవిధంగా వీటిని పెరగనిస్తూ ఉంటే, ముందు ముందు రాజధానిలో భవనాలు ఎన్ని ఉన్నాయో లెక్కపెట్టే స్థితి రావచ్చు! ఆరోగ్యమయితే పూర్తిగా దెబ్బ తినిపోతుంది జబ్బులు రాకండా ఉండే ఏర్పాటేమిటో ఆలోచించే మనస్తత్వం, మొదటినుంచీ లేదు వచ్చిన తర్వాత మాత్రం ఏం మందులు వెయ్యాలో ఆలోచిస్తూ ఉంటారు మంత్రులు, ప్రభుత్వ కీలక సిబ్బంది, పెద్ద పెద్ద వ్యాపారస్థులు, ధనికులు, సభ్యతా ప్రపంచానికి సంబంధించిన మనుషులు, వచ్చే పోయే పెద్దవాళ్ళు, ఇంతిమంది మెసులుతున్న రాజధాని నగరంలోనే ఇంత దుర్భరంగా పరిస్థితులుంటే, మిగతాచోట్ల చెప్పేదేముంది!

ఐ ఎల్ ఎన్ ★

Edited, Printed and Published by S Radhakrishna at the AndhraPatrika Press, 6 &7 Thambuchetty Street Madras-1. Phone, 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

